శ్రీ ర స్తు.

# శ్రీ రెట్టమతశాస్త్రము.

ఇ ది

శ్రీమదయ్యలరాజ వంశ సంభవులయిన
అయ్యలు - భాస్కరుఁడు - అను కవీశ్వరులు
రచించినది.

బ్రహ్మశ్రీ, పండిత
పురాణం సూర్యనారాయణతీర్థులవారిచేతను
సంస్కరింపించి,

వారిచేతనే వ్రాయఁబడిన
"ఆనందచంద్రిక" అనునాంధ్రతాత్పర్యముతోఁజేర్చి

మ ద్రా సు.
ప మ్మి - త్యా గ రా య శ్రే ష్ఠి గా రి చే త ను
స్వకీయ
శ్రీ రాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాలయం
దచ్చొత్తించి ప్రకటింపఁబడినది.

1931



వెల { గ్లేజు 0-14-0
రఫ్ 0-10-0 }

 హెచ్చరిక.

సర్వవిధముల తప్పులతడకలైయున్న యీపుస్తకమును మేము శుద్ధము చేయించి, తాత్పర్యము వ్రాయించి యీమాదిరిగా ప్రకటించి యున్నాము. కాన దీనిని మాయనుమతి లేక యెవ్వరును ముద్రింపఁగూడదు. అట్లు ముద్రింప సాహసించినపక్షమున వారిపైన తగినచర్య జరపఁబడును.

ప్రకాశకుఁడు.

---

ప్రకటన.

ఇవి మొదలైన సంస్కృతాంధ్ర గ్రంథములు వలయువారలు ఈదిగువ కనబఱచియుండు పై విలాసదార్లకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

పమ్మి - త్యాగరాయసెట్టి,
శ్రీరాజరాజేశ్వరీనికేతన ప్రెస్,
చాకలపేట, మద్రాస్.



# పీఠిక.

ఈ గ్రంథమును జదువు నాంధ్రపాఠకమహాశయులారా! కేట్టమత
మని, కేట్టమతశాస్త్ర మనియు నొకపుస్తక మున్న దని చిరకాలముననుండి
వినుచుండుటయే కాని చూచునవసరము తటస్థింపలేదు. ఈనడుమ నేతత్ప్ర
కాశకు లయిన మహారాజశ్రీ పమ్మి - త్యాగరాయశ్రేష్ఠిగారు 1921 వ
సంవత్సరమునఁ దాత్పర్యముతో ముద్రిత మయిన యొకప్రతిని, 1925 లో
దానిని చూచి ముద్రించినదే యగు నొకప్రతిని, ఒక పట్టిమూలప్రతిని దెచ్చి
యిచ్చి శుద్ధము చేసి తాత్పర్యము వ్రాసిపెట్టుఁ డని కోరిరి. రెండవప్రతి
చూచుటకు సొగసుగానే యున్నది గాని, అది, మూఁడవది మొదటి ప్రతిని
బట్టి ముద్రించిన ట్లందలితప్పులు చెప్పక చెప్పినవి. కాఁగా మూఁడుప్రతులును
తప్పులకుప్పలు. ఇది జ్యోతిశ్శాస్త్రసంబంధ మయినను, ఏతత్కవీశ్వరులు
[illegible]గాఁ బద్యకావ్యముగా రచించినారు. ముద్రితప్రతులు మూఁడింటను,
కవిత్వమునకు ముఖ్యధర్మము లయిన యతిప్రాసములు చెడి యయోమయ
ములుగ నున్నవి. ఆయపపాఠముల ననుసరించి వ్రాయఁబడినతాత్పర్య
మెట్టు లుండునో మీరే యూహించుకొందురుగాక! ఆయపపాఠములు
శుద్ధము చేయ నెంచి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున కేఁగి చూడఁగా
నందు 4-5 వ్రాఁతప్రతులు శిథిలప్రాయములు లభించినవి. వానినిబట్టి కొంత
వఱకు సరిచేసి విషయము చెడకుండఁ గొంతవఱకు నాబుద్ధిని వినియోగించి
సరిచేసితిని. ఇందలి పద్యములు సరిచేయునపుడు నేను బడినపరిశ్రమ సర్వ
విద్యాధిదేవతయగు శ్రీపరమేశ్వరికే యెఱుక. పద్యములు సరిచేసి పదపడి
వానికి "ఆనందచంద్రిక" అనుపేరను, ఆంధ్రమునఁ దాత్పర్యము వ్రాసితిని.
ఇంతకంటెను దీనిని మఱొకరు చక్కఁజేయఁగలుగువఱకును ఇదియే సర్వో
త్తమప్రతియని సగర్వముగ నొక్కి వక్కాణించుచున్నాను. దీని నీమాది
రిగా సరిచేయించుటకై ప్రకాశకులు చాల ధనము వ్యయముచేసిరి గనుక దీనిని
బట్టి మఱొకరు ముద్రింపసాహసింపకుందురుగాక! కృతికర్తలను, కృతిపతిని
గుఱించి పుస్తకములోననే కలదని యావిషయ మిట నుదాహరింపమానితిని.

1-3-1931. చెన్నపట్టణము.  పురాణం-సూర్యనారాయణతీర్థులు.

# వి ష య సూ చి క.



శ్రీ ర స్తు.

శ్రీకృష్ణాయ నమః.



# రెట్టమత శాస్త్రము.

## ప్రథమాశ్వాసము.

అవతరణిక. శ్రీరస్తు. ఓంనమః కామేశ్వర్యై. ఈగ్రంథమును రచింపఁబోవుచు గ్రంథకర్తలు తాము రచింపఁబోవుగ్రంథము నిర్విఘ్నముగా ముగియుటకై శిష్టాచారము ననుసరించి మంగళము నాచరింపవలయుటం బట్టి తమ యిష్టదైవమయిన శ్రీరామమూర్తియు, ఇది జ్యోతిషగ్రంథము గనుక గ్రహములలో నొకఁడగు చంద్రుఁడును అర్థమగునట్లుగ, శ్లేష ను గల్పించి,వారు కృతినాయకుని రక్షింతురుగాక యని యాశీర్వదించుచున్నారు:—

శా. శ్రీరత్నాకరసంభవోక్తికలనం జెన్నొంది గర్గాదిమ
త్యారూఢిం గని మేఘమాలికసముద్యత్కాంతి రాణించి ని
త్యోర్వుశ్రీమిహిరాన్వయస్థితిఁ దగన్ జ్యోతిర్మయుండైన సీ
తారామర్క్షపుఁడోము వేంకటనరేంద్రశ్రేష్ఠు నెల్లప్పుడున్. ౧

తా. శ్రీమంతమయిన సముద్రమునఁ బుట్టినలక్ష్మియొక్క మాటల సంబంధముచేతను ఒప్పినవాఁడై, గర్గుఁడు మొదలగువారి బుద్ధివంటి బుద్ధి చేతను ప్రసిద్ధిని గన్నవాఁడై, మేఘమాలికయొక్క ప్రకాశించుచున్న కాంతి

వంటి కాంతిచేతను ప్రకాశించి, నిత్యమును గొప్పదియునగు శ్రీగల సూర్యవంశమునందలి పుట్టువుచే ఒప్పునట్లు జ్యోతిస్స్వరూపుండయినసీతారామచంద్రుఁ డెల్లప్పుడును శ్రేష్ఠుఁడయిన వేంకటరాజును రక్షించును. ౧

చంద్రునిపక్షమున.—పాలసంద్రమునందుఁ బుట్టినవాఁ డన్నమాట సంబంధముచేతను ఒప్పినవాఁడు, గర్గుఁడు మొదలయిన జ్యోతిశ్శాస్త్రవేత్తల బుద్ధియందు ప్రసిద్ధిని గన్నవాఁడు, మేఘమాలికయందు ప్రకాశించుచుండెడి కాంతిచేతను రాణించినవాఁడు, సూర్యునిసంబంధముచేతను జ్యోతిర్మయుఁడు నని తాత్పర్యము. అట్టిచంద్రుఁడు వేంకటరాజుగారిని రక్షించును. మఱియు మిహిరుఁ డనఁగా వరాహమిహిరుఁడను జ్యోతిశ్శాస్త్రవేత్తయు నర్థము గనుక, నతనితో సంబంధముగలవాఁ డనియుఁ జెప్పునది.

శా. లీలాస్యోపజితామృతాంశుకళ హాళిం గేలుదో యెత్తి యు
ద్వేలప్రీతి ధరించు గౌరికుచముల్ వీక్షించునాసక్తిఁ ద
త్కాలక్షేపముఁ గోరుప్రామిడిపురాధ్యక్షుండు భోగీశ్వరుం
డేలుం దిమ్మనృపాలువేంకటధరిత్రీశాగ్రణి న్నిత్యమున్. ౨

తా. విలాసముచేతను తనముఖముచే జయింపఁబడిన చంద్రునికళను అక్కఱతో రెండుచేతులును పైకెత్తి యధికమయిన ప్రీతిచేతను పట్టుకొను పార్వతిస్తనములను చూచునాసక్తిచేతను ఆమెకుఁ గాలహరణమును గోరుచున్నవాఁడును, ప్రామిడి యనుపట్టణమునకుఁ బ్రభువును అగు భోగీశ్వరస్వామి యెల్లప్పుడును తిమ్మరాజుగారి వేంకటరాజును రక్షించును. ౨

చ. ఎలమి సమస్తలోకముల కీశుఁడు స్రష్టయు వేల్పుఁబెద్ద నాఁ
జెలఁగుచునుండుబ్రహ్మను విచిత్రముగాఁ దనమాటలోపలన్
మెలఁగఁగఁ జేయుభారతి సమిద్ధకళావతి పెద్దతిమ్మభూ
తలపతివేంకటేంద్రునకుధన్యతరోక్తు లొసంగు వేడుకన్. ౩

తా. సంతోషముతో నెల్లలోకములకును ప్రభువును, సృష్టికర్తయు, దేవత లందఱికంటెను పెద్దవాఁడును, అనునట్టుగా ఒప్పుచుండు బ్రహ్మదేవుని ఆశ్చర్యకరముగా, తాను చెప్పినచొప్పున నడచుకొనువానినిగా చేయుచుండెడి సరస్వతీదేవి ప్రకాశించుకళలు గలది వేడుకచేతను పెద్దతిమ్మరాజుగారి వేంకటరాజుగారికి మిగుల ధన్యములయిన వాక్కుల నిచ్చుఁగాత. 3

మ. కలుషధ్వాంతవికర్తనుం డగుచు విఘ్నస్వామియై సర్వమం
గళ సర్వజ్ఞుఁడు గారవింపఁగ దివౌకశ్శ్రేణికాపూజ్యుఁ డై
యలఘుం డై నగణేశ్వరుండొసఁగుసుద్యత్కార్యసంసిద్ధిబు
ద్ధి లసత్ప్రౌఢిమ మించువేంకటధరిత్రీభర్త కేవేళలన్. ४

తా. పాపము లనుచీఁకటికి సూర్యునివంటివాఁ డౌచు, విఘ్నములకుఁ బ్రభువై, పార్వతీపరమేశ్వరులు ముద్దుచేయఁగా దేవతలకుఁ బూజింపఁదగినవాఁడై గొప్పవాఁడయిన గణపతి యెల్లప్పుడును, బుద్ధిచేతను ఒప్పుచుండెడి ప్రౌఢతనముచేతను మించిన వేంకటరాజుగారికిఁ బ్రారంభించిన కార్యముల సిద్ధి నిచ్చుఁగాత. ४

శా. శ్రీరంగేశ్వరుఁడే యితం డని బుధుల్ సేవింపఁగా బోధవి
ద్యారూఢోన్నతి మించుధన్యు నహితాహంకారవిధ్వంసకుం
గూరేంద్రాన్వయవార్ధిచంద్రు గురుముఖ్యు న్మేరుధీరు న్మహో
దారు న్వేంకటభట్టరార్యుఁదలఁతుం దాత్పర్య మింపొందఁగన్.

తా. ఇతఁడు శ్రీరంగనాయకుఁడే యని విద్వాంసులు సేవించుచుండఁగా, అధ్యాత్మవిద్యాప్రసిద్ధిచేత నయిన యౌన్నత్యముచేతను అధికుఁడయిన ధన్యాత్ముఁడును, తనకు శత్రువు లగువారి యహంకారమును ధ్వంసముచేయువాఁడును, కూరేంద్రుని వంశమనియెడి సముద్రమునకుఁ జంద్రునివంటివాఁడును, మాగురువులలో ముఖ్యుఁడును, మేరువువంటి ధైర్యముగలవాఁడును, గొప్ప యౌదార్యము గలవాఁడును, అగు వేంకటభట్టరార్యుని తత్పరత్వ మింపొందునట్టుగాఁ దలంచుచుందుము. ५

తే. గీ. ఘనులఁ బ్రాచేతస వ్యాస కాళిదాస
భారవి మయూర నన్నయభట్ట తిక్క
యజ్వ నాశంభుదాసుని నభినుతింతు
సంస్కృతాంధ్రకవిత్వవిశారదులను. ౬

తా. సంస్కృతాంధ్ర కవిత్వరచనలయందు నేర్పరులును, గొప్ప వారును అగు వాల్మీకిని, వ్యాసుని, కాళిదాసుని, భారవిని, మయూరుని, నన్నయభట్టును, తిక్కనసోమయాజిని, ఎఱ్ఱాప్రగ్గడను కొనియాడుదుము. ౬

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును బురాతన సుకవిస్తోత్రంబును గావించి యే మొక్కకృతి సకలజన శ్రుతిహితంబుగా నొనర్పం బూనియున్న సమయంబున. ౭

తా. అనుచు, ఇష్టదైవప్రార్థనంబును, ప్రాచీనులగు సుకవులస్తుతిని చేసి మేము ఏదేని యొక్కగ్రంథమును, ఎల్లవారిచెవులకును ఇంపుగాఁ జేయఁ దలఁచి యున్నప్పుడు. ౭

సీ. శ్రీమదహోబలస్వామిమహారాజ్య
రక్షకుం డగుచు నేరాజు వెలయు
నభిరామకామందకాఖ్యసతాకవ్యర
త్నమునకు నేరాజు నాథుఁ డయ్యె
జానకీనాయకచరణసంసేవనా
ప్రౌఢిచే నేరాజు ప్రబలు సిరుల
నెరయూరిపురవరాధీశాదిబహుబిరు
దాంకుఁడై యేరాజు యశము గాంచె

తే. గీ. నతఁడు కొండ్రాజుతిమ్మభూపతివరేణ్య,
తనయ పెదతిమ్మరాజవతంసగర్భ
వార్థిచంద్రుండు సత్కులవర్ధనుండు,
సతతవిభవుండు వేంకటకృష్ణవిభుండు. ౮

తా. ఏరాజు, శ్రీమంతుఁడయిన యహోబలనరసింహస్వామియొక్క గొప్పరాజ్యమునకు రక్షకుఁడై ప్రకాశించునో, ఏరాజు, మనోహరమయిన కామందకమనుపేరుగల గొప్పకావ్యమునకుఁ గృతినాయకుఁడాయెనో, ఏరాజు, శ్రీరాముని పాదములను సేవించుటయందలి గొప్పతనముచే సంపదలతో నధికుఁ డాయెనో, ఏరాజు, ఎరయూరిపురవరాధీశుఁడు మొదలయిన యనేకబిరుదములచే నంకితుఁడై కీర్తిని సంపాదించెనో, అతఁడు కొండరాజుకొమారుఁడయిన తిమ్మరాజుగారికొడుకగు పెదతిమ్మరాజశ్రేష్ఠుని గర్భమనియెడి సముద్రమునకుఁ జంద్రునివంటివాఁడును, కులమును వృద్ధి నొందించువాఁడును, శాశ్వతైశ్వర్యము గలవాఁడును అగు వేంకటరాజు. ౮

క. ఒకనాఁడు నిఖిలకోవిద,
సుకవిహితామాత్యబంధుసుతవీరభట
ప్రకరము గొలువఁగఁ గొలువుం,
డి కడుం బ్రమదంబు మదిని నివ్వటిలంగన్. ౯

తా. ఒకానొకదినమున, ఎల్లపండితులయు, కవీశ్వరులయు, హితులయు, మంత్రులయు, బందుగులయు, కొమాళ్లయు, వీరులగుభటులయు సమూహము సేవించుచుండఁగా, కొలువు తీర్చి మనస్సునందు హెచ్చుగా సంతోషము కలుగఁగా. ౯

తే. గీ. రాజకవి యయ్యు నయ్యలరాజవంశ్యు
ననఘుఁ బిన్నక్కవిభుపుత్త్రు నయ్యలాఖ్యు
నాగఘనుసూను భాస్కరనామధేయుఁ,
గరుణ దళుకొత్త రావించి గారవించి. ౧౦

తా. తాను రాజులలోఁ గవీశ్వరుఁ డయినప్పటికిని, అయ్యలరాజు వంశమునఁ బుట్టినవాఁడును, దోషరహితుఁడును, పిన్నక్కవిభునిపుత్త్రుఁడును, అగు అయ్యలనామధేయుని, నాగన్నగారికొమారుఁడయిన భాస్కరుఁ డను పేరుగలవానిని, దయ ప్రకాశించుచుండఁగా, సభకుఁ బిలిపించి గారవించి.

వ. తత్కాలోచితప్రసంగంబున నిట్లనియె. ౧౧

తా. ఆకాలమునకుఁ దగినప్రసంగమున నీదిగువఁ జెప్పిన ట్లనియెను.

తే. గీ. గాఢసుజ్ఞాననిధి రెట్టఘనుఁడు మున్ను,
చెలఁగి కన్నడభాషను జెప్పినట్టి
శాస్త్ర మంతయు నేను సజ్జనులు వొగడఁ,
దెనుఁగుబాస నొనర్పంగఁ దివురునపుడు. ౧౨

తా. ముదిరిన మంచిజ్ఞానమునకు నిధియైన రెట్టఁ డనునతఁడు పూర్వము, ఉత్సహించి కర్ణాటకభాషయందు రచించిన శాస్త్రము నంతను నేను సుజనులందఱును బొగడునట్లు తెలుఁగుబాసను రచియింపసిద్ధపడుసమయమున.

సీ. పరిపూర్ణధవళాంగభవ్యుఁడై దివ్యతే
జమున మించినశంఖచక్రములను
గరయుగ్మమునఁ దాల్చి కనకపీఠము పాణి
యుగమున నూఁది యత్యుజ్జ్వలముగ
నిజహస్తముల రెండుభుజములపై శోణ
కాంతు లెంతయుఁ బ్రకాశమ్ముగాఁగఁ
గొంచెంబులౌ చెవికొణకుల నెఱ్ఱని
చాయల మెఱయు కేసరచయంబు

తే. గీ. లుంగరపువెండ్రుకలరీతి నుల్లసిల్ల,
రామచంద్రుం డహోబలస్వామి యగుచుఁ
గరుణ నాముందటను బొడగట్టి దివ్య,
హృద్యసూక్తుల నానతి యిచ్చె నిట్లు. ౧౩

తా. పరిపూర్ణములయిన తెల్లనియవయవములచేతను ఒప్పుచున్నవాఁడై, దివ్యమయిన తేజస్సుతో మించిన శంఖమును, చక్రమును రెండుచేతులయందు ధరించి, రెండుచేతులచేతను, బంగరుపీఠము నూఁతగొని, తన

హస్తములయందును, రెండుబుజములమీఁదను ఎట్టినికొంతులు ప్రకాశించుచుండఁగా, చిన్నవియయినకొనచెవులయం దెట్టినికాంతులు మెఱయుచుండఁగా, జడలు ఉంగరాలవెంద్రుకలచొప్పునఁ బ్రకాశించుచుండఁగా శ్రీరామచంద్రుఁడు, అహోబలనరసింహస్వామిరూపమున దయతో నాయెదుటఁ బ్రత్యక్షమై దివ్యములును, మనోహరములు నగుమంచిమాటలతో నిట్లు సెలవిచ్చెను. ౧౩

క. నీవు దలంచినతలఁపు శు,
భావహము యశోనిదాన మటు గావునఁ ద
ద్భావినుతమతము గావ్యము,
గా వేడ్కఁ బరిగ్రహింపు గ్రక్కున వత్సా! ౧౪

తా. వత్సా! నీ వాలోచించినయాలోచనము శుభమును గలిగించునదియు, కీర్తికిఁ గారణమును గనుక నారెట్టనిమతమును కావ్యముగాఁ జేయించి వెంటనే నీవు కృతి నందుము. ౧౪

తే. గీ. అని ప్రసాదించినాఁడు మీ రవ్విశేష,
మతము ప్రతిపద్యమును మందకితము గాఁగ
నాంధ్రభాషానిరూఢిఁ గావ్యంబుఁ జేయుఁ,
డఖిలజనులకు నుపకార మై చెలంగ. ౧౫

తా. అని యీప్రకారముగా ననుగ్రహించినాఁడు, కావున మీరుభయులును, ఆరెట్టనిమతమును ఆంధ్రభాషయందుఁ బ్రతిపద్యమునను నాపేరొప్పునట్లు కావ్యముగాఁ జేయుఁడు. అది యెల్లవారికిని ఉపయోగించును. ౧౫

వ. విశేషించి మీరలు శ్రీరఘునాయకదయాలబ్ధసారసారస్వతులరును, రఘువీరశతకనిర్మాణకర్త రాజకవి తిప్పనార్య

పౌత్రకులరను, మదీయాశ్రితులరు నగుటంజేసి భవత్కవిత్వంబు మా కభిమతం బయి యుండునని సబహుమానంబుగాఁ గర్పూరతాంబూల జాంబూనదాంబరాభరణాది వస్తువులొసంగిన నంగీకరించి యారెట్టరభీమ మూరురాయర బసవ శంకర గుత్తిహన్నిబ్బరగండ కొంకణకోలాహల కోదేవుమేదేవు తలగుండుగండ మాననీయాక్షర మహాబిరుదాంకుండును విక్రమసాహసాంకుండును గాశ్యపగోత్ర పవిత్రుండును కొండ్రాజు తిమ్మరాజపుత్త్రుండు నయిన వేంకటధరణీకళత్రునకు నంకితముగా నేము రచియింపంబూనిన యిక్కావ్యంబు ముఖంబునకుఁ దిలకాయమానంబగు తదీయవంశావతారం బభివర్ణించెద మది యెట్టిదనిన. ౧౬

తా. అదియునుంగాక, మీరు శ్రీమదొంటిమిట్టకోదండరామునిదయచేతను బొందఁబడిన సారమయిన సారస్వతము గలవారును, రఘువీరశతకమును నిర్మించుటయందుఁ బనిపూనిన రాజకవియగు తిప్పనార్యునిమనుమలును, మాయాశ్రితులును గావున, మీకవిత్వము మా కిష్టముగా నుండును. అని బహుమానపూర్వకముగా, కర్పూరమిళితమయిన తాంబూలమును, బంగారువస్త్రములు, ఆభరణంబులు మొదలగువస్తువు లీయఁగా నే నంగీకరించి, యారెట్టరభీమ, మూరురాయరబసవశంకర, గుత్తిహన్నిబ్బరగండ, కొంకణకోలాహల, కోదేవుమేదేవుతలగుండుగండ—అను గౌరవింపఁదగిన యక్షరములుగల గొప్పబిరుదములు చిహ్నములుగాఁ గలవాఁడును, విక్రమసాహసాంకుండును, కాశ్యపగోత్రమందుఁ బవిత్రుఁడును, కొండ్రాజుగారి తిమ్మరాజుకుమారుఁడును అగు వేంకటరాజుగారి కంకితముగాఁ జేయఁబూనుకొన్న యీరెట్టమతశాస్త్రమను కావ్యముయొక్క ముఖమనెడి ముఖమునకుఁ దిలకమువలె నాచరించునట్టి యతనివంశముయొక్క యవతారమును వర్ణింపఁబూనితి మది యెటువంటి దనఁగా. ౧౬

## కృతినాయక వంశావళి.

క. భానుఁడు శాశ్వతబహుసం,
తానుఁడు దిక్ప్రకరతిమిరదళనపటూద్య
ద్భానుఁడు సంతతకరుణా,
నూనుఁడు విలసిల్లు నిర్జరోత్తముఁ డగుచున్. ౧౭

తా. శాశ్వతమై విస్తారమయిన సంతతిగలవాఁడును, దిక్కులయందలి చీఁకట్లను విదళించుటయందు సమర్థమయిన కిరణములుగలవాఁడును, ఎల్లప్పుడును దయచేత నధికుఁడును అగుసూర్యుఁడు సర్వదేవతలలోను ఉత్తముఁడౌచుఁ బ్రకాశించును. ౧౭

క. అతనికి మను వావైవ,
స్వతునకు నిక్ష్వాకుఁ డతనివంశమున రఘు
క్షితిపతి యతనికులంబున,
గతకలుషుఁడు రాఘవుండు గ్రమమునఁ బొడమెన్. ౧౮

తా. ఆసూర్యునకు మనువు పుట్టెను. ఆవైవస్వతమనువున కిక్ష్వాకుమహారాజు పుట్టెను. ఆయిక్ష్వాకునివంశమునందు రఘుమహారాజు పుట్టెను. అతనివంశమునఁ బోయినపాపములుగలవాఁడు శ్రీరాముఁడు పుట్టెను. ౧౮

క. ఆరామచంద్రునకుఁ గుశ,
వీరుఁడు జనియించె నఖిలవిబుధప్రకరా
ధారుం డాతనికులమున,
భూరిగుణోజ్జ్వలుఁడు కొండభూపతి పుట్టెన్. ౧౯

తా. ఆశ్రీరామునకు నెల్లపండితులకు నాధారమయిన కుశుఁడు పుట్టెను. అతనివంశమున నధికగుణములచేఁ బ్రకాశించు కొండరాజు పుట్టెను.

శా. ఆకొండక్షితిపాలచంద్రుఁడు మహీయఃకీర్తిసంపన్నుఁడై
లోకాలోకపరీతభూతలసుధీలోకస్తుతప్రాభవుం
డై కంజాక్షపదాబ్జభక్తిచతురుం డై సత్యసంధానని
ష్ఠాకారుణ్యనయాదిసద్గుణసమాజస్ఫూర్తి మించెన్ధరన్. ౨౦

తా. ఆకొండరాజు పూజ్యమయిన కీర్తిగలవాఁడును, చక్రవాళపర్వతముచేఁ జుట్టువాఱుకోఁబడిన భూమియందలి పండితులచేఁ గొనియాడఁబడిన ప్రభుత్వము గలవాఁడును, విష్ణుపదారవిందములయందు భక్తిగలవాఁడునై, సత్యసంధాననిష్ఠ, దయ, నీతి మొదలయిన మంచిగుణములప్రకాశముచేత నిలయం దధికుఁడాయెను. ౨౦

ఉ. ఆనరనాథపుంగవున కాశ్రితరక్షణతత్పరుండు స
న్మానసుయోధనుండు నృపమాన్యుఁడు జన్యకిరీటి విస్ఫుర
ద్దానకళాపరాజితసుధాకర మేఘ దధీచి ఖేచరాం
భోనిధి తిమ్మభూతలవిభుం డుదయించె జగత్ప్రసిద్ధుఁడై.

తా. ఆకొండరాజునకు, ఆశ్రితరక్షణాసక్తుఁడును, మానమున దుర్యోధనుని వంటివాఁడును, రాజులచే గౌరవింపఁదగినవాఁడును, యుద్ధములయం దర్జునునివంటివాఁడును, ప్రసిద్ధమయిన దానవిద్యచేతను ఓడింపఁబడిన చంద్రుఁడు, మేఘుఁడు, దధీచి, జీమూతవాహనుఁడు, సముద్రుఁడును గలవాఁడును (అనఁగా చంద్రాదులను మించినదానగుణముగలవాఁడును) అగుతిమ్మరాజు లోకప్రసిద్ధి గలవాఁడై పుట్టినాఁడు. ౨౧

తే. గీ. విమలగుణనిధి తిమ్మభూవిభుఁడు మంగ,
రాజపర్యనిపుత్త్రికారత్న మయిన
యక్కమాదేవిని వివాహ మయి చెలంగె,
జలధిసుతఁ బెండ్లియాడిన శౌరిరీతి. ౨౨

తా. గుణనిధి యైనయాతిమ్మరాజు, విష్ణుఁడు లక్ష్మిని పెండ్లాడినట్లే మంగరాజుకూఁతు రయిన అక్కమాదేవిని పెండ్లియాడినాఁడు. ౨౨

క. ఆదంపతులకుఁ బొడమె ద,
యాదాక్షిణ్యాంబురాశి హరిభక్తినిఁ బ్ర
హ్లాదుఁడు సతతత్యాగ,
శ్రీదుఁడు పెదతిమ్మరాజుక్షితి జను లలరన్. ౨౩

తా. ఆదంపతులకు, దయాదాక్షిణ్యసముద్రుఁడును, ప్రహ్లాదునివంటి హరిభక్తుఁడును, త్యాగగుణమునఁ గుబేరునివంటివాఁడును అగుపెద్దతిమ్మరాజు పుట్టెను. ౨౩

మ. విదళించెంగవిరాడ్దరిద్రతను భూవిఖ్యాతమై మించున
భ్యుదయంబందియశంబుగాంచెమహిలో నుద్దండవిద్వేషులం
గదనక్షోణులఁ దోలి గెల్పుసిరులం గైపట్టెఁ గొండ్రాజుశ్రీ
పెదతిమ్మక్షితిపాలమౌళి కెనయే పృథ్వీపతుల్దక్కొరుల్.

తా. అతఁడు కవీశ్వరులదారిద్ర్యమును విదళించినాఁడు. భూమియందుఁ బ్రసిద్ధమై మించినయభ్యుదయమును పొంది కీర్తిని సంపాదించినాఁడు. భూమియందలి గొప్పశత్రువులను యుద్ధరంగములయందుఁ బాఱఁదోలి జయలక్ష్ములను గైకొన్నాఁడు. కావున, కొండరాజుకొడుకుకొడు కయిన పెద్దతిమ్మరాజున కితరరాజులు సమానులా? కా రనుట. ౨౪

తే. గీ. అట్టిపెదతిమ్మరాజు ధైర్యాద్రిరాజు,
మంగవిభుగుర్వశౌరియనుంగుఁగూఁతు
నంగనాశిరోమణిఁ బాపసంగమాఖ్యఁ,
బ్రేమ వరియించె విభవాభిరాముఁ డగుచు. ౨౫

తా. ధైర్యమున మేరువువంటివాఁడయిన ఆపెద్దతిమ్మరాజు, ఐశ్వర్యముచేతను మనోహరుఁడై మంగరాజుకొమారుఁడయిన గురువరాజుముద్దుఁగూఁతును, స్త్రీరత్నమును, పాపసంగమ యనునామెను ప్రేమచే వరించెను.

క. గుణనిధి యగుతత్కన్యా,
మణిజనకుఁ బోధజనకు మంజులభాషా
ఫణివరు రణవిజయార్జునుఁ,
బ్రణుతింపఁ దరంబె గురువపార్థివవర్యున్. ౨౮

తా. గుణములకు గనియయిన యాపాపసంగమాంబ తండ్రిని, జ్ఞానమున జనకమహారాజువంటివానిని, మృదువయిన వాక్కులయందు శేషునివంటివానిని, యుద్ధజయములయం దర్జునునివంటివానిని, గురువ రాజును గొనియాడఁ దరమా? కా. దనుట. ౨౮

సీ. పృథులవిక్రమశాలి పెదసంగనృపతియు
సత్యసంధుఁడు చిన్న సంగరాజు
ధీరగుణాఢ్యుండు తిమ్మభూపాలుండు
రుచిరకీర్తిధనుండు రుద్రఘనుఁడు
ప్రధనాంగణకిరీటి బసవనరేంద్రుండు
స్థిరభాగ్యనిధి పెద్దచిట్టఘనుఁడు
సింధుగాంభీర్యుండు చినచిట్టధన్యుండు
సతతపుణ్యుఁడు పొట్టిసంగశౌరి
తే. గీ. కలితతేజుండు పాపసంగప్రభుండు,
ననఁగఁ బరగినతొమ్మండ్రు తనయవరులఁ
గాంచి దిగ్జయశీలుఁడై మించె నౌర!,
మంగరాజన్య గురువసమ్రాడ్వరుండు. ౨౭

తా. ఇంకను ఆగురువరాజెట్టివాఁ డనఁగా—గొప్పపరాక్రమముచేత నొప్పుచుండెడి పెద్దసంగరాజు, సత్యసంధుఁడయిన చిన్నసంగరాజు, ధీరుల గుణములతో ఒప్పుచుండెడి తిమ్మరాజు, మనోహరమయినకీర్తియే ధనము గాఁగల రుద్రరాజు, యుద్ధరంగముల నర్జునునివంటివాఁ డయినబసవరాజు,

శాశ్వతమయిన భాగ్యమునకు నిధియైన పెద్దచిట్టరాజు, సముద్రునివంటి గాంభీర్యముగల చిన్నచిట్టరాజు, సంతతపుణ్యుఁడయిన పొట్టిసంగరాజు, ఒప్పుచుండెడి తేజస్సుగల పాపసంగరాజు, అనఁగా నొప్పుచుండెడి తొమ్మండ్రు కొడుకులను గని మంగరాజుకొడుకయనగురువరాజు దిక్కులను జయించుస్వభావముగలవాఁడయి యధికుఁడాయెను. ౨౭

క. ఆగురువ రాజవరునకుఁ,
త్యాగసముద్రునకు నల్లుఁడయి వెలసె ధరా
భాగధురంధరతను నా,
భాగుఁడు పెదతిమ్మరాజు ప్రజలు నుతింపన్. ౨౮

తా. త్యాగమునకు సముద్రునివంటివాఁడయిన యాగురువరాజునకు, భూభాగభారమును భరించుటయందు నాభాగునివంటివాఁడయిన పెద్దతిమ్మరాజు ప్రజలు గొనియాడునట్లుగా అల్లుఁడయి ప్రకాశించెను. ౨౮

తే. గీ. ధీరశేఖరుఁడా పెద్దతిమ్మరాజు,
లలితగుణముల నుభయకులప్రసిద్ధ
యైనయలపాపసంగమాహ్వయపతివ్ర,
తాశిరోమణియందు ముదంబుతోడ. ౨౯

తా. ధీరులకు శిరోభూషణ మయిన యాపెద్దతిమ్మరాజు మనోహరములయిన గుణములచేతను ఉభయకులములయందును ప్రసిద్ధురా లయిన పాపసంగమ్మ యనుపేరుగల పతివ్రతాశిరోమణియందు సంతోషముతో.

చ. పరపురభంజనోగ్రుఁడయి భాసిలుదాసరిరాజశేఖరుం
దిరుపతిధారుణీశుఁ గులదీపకు వేంకటపార్థివోత్తముం
గురుయశుఁ గృష్ణయప్రభుని గొండలధీరుని బాహుశౌర్యసు
స్థిరు రఘునాథశౌరిఁ జినతిమ్మనృపాలునిఁ గాంచె ధన్యుఁడై.

తా. శత్రుపురములను పాడుచేయుటయందు శివునివంటివాఁ డయి ప్రకాశించు దాసరిరాజును, తిరుపతిరాజును, కులమును ప్రకాశింపఁజేయు వాఁ డయిన వేంకటరాజును, గొప్పకీర్తిగల కృష్ణరాజును, కొండలరాజును, బాహుశౌర్యమునందు స్థిరుఁ డయిన రఘునాథరాజును, చిన్నతిమ్మరాజును కన్నాఁడు. 30

వ. వారలలోన. 3౧

తా. ఆయేడుగురు కొడుకులలోను. 3౧

ఉ. కేసరిఁ జీఁకు శౌర్యమునఁ గేరును గీర్తివిహారలీల గం
గాసరిదిందుశేఖరులఁ గాంతులఁ గల్వలరాచవాని కెం
తే సరి వచ్చుఁ దిమ్మధరణీధవనందనరత్న మైనమా
దాసరిరాజవర్యుని బుధస్తుతచర్యుని నెన్న శక్యమే? 3౨

తా. దాసరిరాజు, శౌర్యముచేతను సింహమును రమ్మని పిల్చును. కీర్తియొక్క విహారవిలాసముచేతను గంగానదిని, శివునిని పరిహసించును. కాంతులచేతను చంద్రునకు మిక్కిలి సమానుఁడు. కాఁబట్టి అట్టితిమ్మరాజు కొడుకులలో శ్రేష్ఠుఁ డయినవాఁడును, పండితులచేఁ బొగడఁబడిన నడవడిగల వాఁడును అయిన దాసరిరాజును కొనియాడుటకు శక్య మగునా ? 3౨

చ. గురుమతిచాతురిన్ భుజగకుంజరు గెల్చును వార్ధికన్యకా
వరు నతిభక్తిఁ గొల్చు ననివారితమానవిశేషసంపదన్
గురుపతిరీతిఁ బొల్చు నలఘుప్రభుఁ డౌ పెదతిమ్మశౌరిమా
తిరుపతిపార్థివోత్తముఁడు ధీరవరేణ్యుఁడు రాజమాత్రుఁడే?

తా. గొప్పదియగు బుద్ధిచాతుర్యముచేతను శేషుని గెలుచును. లక్ష్మీపతిని భక్తితోఁ గొలుచును. గొప్పమానముచేతను దుర్యోధనునిరీతిని ప్రకాశించును. గొప్పప్రభువయిన పెద్దతిమ్మరాజుకొడుకు తిరుపతిరాజు, ధీరులలో శ్రేష్ఠుఁడు. కావున, అతఁడు సామాన్యరాజా ? కాఁ డనుట. 33

ఉ. రాజధరున్ భజించు ఖగరాజతురంగుని సంస్మరించు సం
ధాజమదగ్ని సూనుఁడన ధాత్రి రహించు హలాయుధామర
క్ష్మాజసుధాంశుజిత్వరలసద్ఘనకీర్తి సముద్ధరించుఁ గొం
డ్రాజవతంసుతిమ్మనృపరత్నము వేంకటరాజు వేడుకన్. 34

తా. కొండరాజుగారికొడుకయిన తిమ్మరాజుగారి వేంకటరాజు వేడుకతో శివుని భజించును. విష్ణుని స్మరించును. ప్రతినయందుఁ బరశురాముఁ డనునట్లు భూమియం దొప్పుచుండును. బలరాముని, కల్పవృక్షములను, చంద్రుని జయించుస్వభావముగలదై ప్రకాశించు మంచికీర్తి నుద్ధరించును.

ఉ. జిష్ణు నధఃకరించును బ్రసిద్ధికి నెక్కినవైభవంబునన్
జిష్ణుని ధిక్కరించు రిపుజిత్వరబాహుపరాక్రమంబునన్
గృష్ణుని సంతతంబు భజియించును దిమ్మనరేంద్రచంద్రుమా
కృష్ణనృపాలశేఖరుఁడు కీర్తిధురంధరుఁడెంతపుణ్యుఁడో. 35

తా. కీర్తిభారమును వహించిన తిమ్మరాజుగారికృష్ణరాజు లోకప్రసిద్ధమయిన వైభవముచేత నింద్రుని క్రిందు చేయును. శత్రువులను జయించుస్వభావముగల బాహుపరాక్రమముచేత నర్జునుని ధిక్కరించును. ఎల్లప్పుడును శ్రీకృష్ణుని భజించుచుండును. కాన, అతఁ డెంతపుణ్యాత్ముఁడో కదా! 35

ఉ. చండలసత్ప్రతాపనయచారువిలాసవికాసరేఖ మా
ర్తండలతాంతసాయకులఁ దార్కొను మార్కొనుఁ దాల్మికల్మి నా
కొండలఱేనిఁ దిమ్మనృపకుంజరసూనుఁడు కొండలయ్య యా
తం డలశ్రీధరాంశజుఁడె తప్పఁడు పోషణబుద్ధిసంపదన్. 36

తా. తిమ్మరాజుకొడుకయిన కొండలరాజు, తీవ్రమయి ప్రకాశించు ప్రతాపనయరేఖచేతను సూర్యునిని, సుందరమయిన విలాసవికాసరేఖచేతను పూవింటివానిని (మన్మథుని) తార్కొనును. ధైర్యసంపదచేతను హిమవంతుని

నెదుర్కొనును. దీనులను పోషింపవలెనన్న బుద్ధిచేతను, సంపదచేతను ఒప్పు వాఁడు గనుకఁ దప్పక అతఁడు విష్ణునియంశమువలనఁ బుట్టినవాఁడే. ౩౬

ఉ. ధీరనృపావతంసము సుధీరమణీయుఁ డనూనదానవి
ద్యారకసికత్వభూషణుఁడు ధన్యగుణాఢ్యుఁడు తిమ్మశౌరిమా
శ్రీరఘునాథరాజు బళిరే శరణాగతరక్షణంబునం
దారఘురామునంతటికృతార్థుఁడతం డొకరాజమాత్రుఁడే.

తా. తిమ్మరాజుగారిరఘునాథరాజు, ధీరులగు రాజులకు శిరోభూషణము, పండితుల కింపయినవాఁడు, అధికమయిన దానవిద్యయు, రసికత్వము భూషణముగాఁ గలవాఁడు, ధన్యములయిన గుణములచే గొప్పవాఁడు— ఆశ్చర్యముగదా! శరణుపొందినవారిని రక్షించుటయందు శ్రీరామునియంతటి కృతార్థుఁడే కావున, అతఁ డొకరాజసామాన్యుఁడా? కాఁ డనుట. ౩౭

చ. స్థిరమతి పెద్దతిమ్మజగతీవరమౌళితపఃఫలంబు స
ద్గురుజనబంధుకల్పకము కోమలకీర్తివధూప్రియుండు భా
స్వరవిజయాంగనాయుతుఁడు శాశ్వతరాఘవభక్తిశాలి శ్రీ
తిరుమలరాజు రాజిలు వితీర్ణిగుణాశ్రయవిక్రమంబునన్. ౩౮

తా. స్థిరబుద్ధిగలవాఁడును, పెద్దతిమ్మరాజుగారు చేసినతపస్సునకు ఫలస్వరూపుఁడును, విద్వాంసులు, గురువులు మొదలగుజనులు, బంధువులు అనువీరికిఁ గల్పవృక్షమువంటివాఁడును, కోమలమయిన కీర్తియనెడి నాయికకుఁ బ్రియుండును, ప్రకాశించు విజయలక్ష్మితోఁ గూడినవాఁడును, ఎల్లప్పుడు రామునియందు భక్తిగలవాఁడునునై శ్రీతిరుమలరాజు దానగుణమున కాశ్రయమయిన పరాక్రమముచేతను ప్రకాశించుచుండును. ౩౮

క. కృతి యై రమణీయశుభా,
కృతి యై యభయప్రదానకృతిసన్మతి యై
నుతి కెక్కెను బెదతిమ్మ,
క్షితిపతితిరుమలనృపాలసింహుఁడు జగతిన్. ౩౯

తా. పెదతిమ్మరాజుగారితిరుమలరాజు భూమియందు చేర్పరియు, మనోహరమయిశుభకరమయిన యూకారము గలవాఁడును, అభయ మిచ్చుపని యందు మంచిబుద్ధి గలవాఁడును నయి పొగడఁబడుచుండెను. ౩౯

చ. వితతపరాక్రమక్రమవివేకవిశిష్టజనావనక్షమా
ధృతినిధి పెద్దతిమ్మమనుజేంద్రునిశ్రీచినతిమ్మ మేదినీ
పతితిలకంబు, బొమ్మనరపాలునిపర్వతరాజుపుత్త్రి నా
యతకులశీల మానవతి నోబళదేవి వరించె వేడుకన్. ౪౦

తా. విస్తారమయిన పరాక్రమక్రమమునకును, వివేకమునకును, గొప్ప వారిని రక్షించుటకును, ఓర్పునకును, ధైర్యమునకును నిధియైన పెద్దతిమ్మ రాజుగారికొడుకయిన చిన్నతిమ్మరాజు, బొమ్మరాజుకొడుకయిన కొండల రాజుకూఁతును, విస్తారమయిన కులము, శీలముగలదానిని, మానవతిని ఓబళ దేవిని వేడుకగా వివాహమయ్యెను. ౪౦

తే. గీ. ఆవధూమణి యోబన్న యనెడిఘనుఁడు,
ప్రతిభఁ జెన్నొందు వేంకటపతివిభుండు
తిరుమలేంద్రుండు రఘునాథనరవరుండు,
నాది యగుపుత్త్రులను గాంచి ఖ్యాతి మించె. ౪౧

తా. స్త్రీరత్నమయిన ఆయోబళదేవి, గొప్పవాఁడయినయోబన్న, ప్రతిభచేఁ బ్రకాశించు వేంకటరాజు, తిరుమలరాజు, రఘునాథరాజు మొద లుగాఁగల కొడుకులను గని ఖ్యాతిచేతను అధికురా లయినది. ౪౧

ఉ. ఆచినతిమ్మభూవిభున కగ్రజుఁ డాశ్రితకల్పశాఖి మే
ధాచతురాననుండు జగతాటిమహాబిరుదాంకుఁ డాదితే
యాచలధీరుఁ డూర్జితదయానిధి వేంకటరాజు నిత్యధ
ర్మాచరణప్రవీణుఁడు జయాధికుఁ డై విలసిల్లు నెంతయున్. ౪౨

తా. ఆచిన్నతిమ్మరాజున కన్నయు, ఆశ్రితులకుఁ గల్పవృక్షమువంటి వాఁడును, బుద్ధియందు బ్రహ్మదేవునివంటివాఁడును, జగతాటియను గొప్పబిరుదము చిహ్నముగాఁ గలవాఁడును, మేరువువంటి ధైర్యము గలవాఁడును, ఊర్జితమయిన దయకు నిధియును అయిన వేంకటరాజు, నిత్యము ధర్మకార్యముల నాచరించుటయందు నేర్పరియు, జయములచేత నధికుఁడును నయి మిగులఁ బ్రకాశించును. ४౨

తే. గీ. సరసుఁ డావేంకటేంద్రుండు సాళ్వవంశ,
తిలక మగుగానరాజుపుత్త్రికల భవ్య
ధిషణలను బెద్దకృష్ణమాదేవిఁ జిన్న,
కృష్ణమాదేవి నెలమిఁ బరిగ్రహించె. ४3

తా. సరసుఁడయిన వేంకటరాజు, సాళ్వవంశమునకుఁ దిలకమువంటి వాఁడయిన గానరాజుగారికూఁతులను, మంచిబుద్ధిగలవారిని, పెద్దకృష్ణమాదేవిని చిన్నకృష్ణమాదేవిని సంతోషముతోఁ బెండ్లియాడెను. ४3

వ. ఆసాధ్వీరత్నంబులలోఁ బెదకృష్ణమాదేవియందు. ४४

తా. ఆపతివ్రతారత్నములలో పెద్దకృష్ణమాదేవియందు. ४४

తే. గీ. ఆజిఘనుఁ డైన వేంకటరాజు, కృష్ణ
పార్థివుఁడు మల్లధీరుండు బసవరాజు
నిత్యవిభవుండు వీరన్న నీలకంఠ,
ధన్యుఁ డన మించునందనోత్తములఁ గాంచె. ४౫

తా. యుద్ధములయందు గొప్పవాఁడయిన వేంకటరాజు, కృష్ణరాజు, మల్లరాజు, బసవరాజు, శాశ్వతవైభవముగల వీరరాజు, నీలకంఠరాజు అనఁగా మించినమంచిబిడ్డలను గనియెను. ४౫

క. శ్రీ వెలయఁగఁ జినకృష్ణమ,
దేవీరత్నంబునందు స్థిరభాగ్యనిధిఁ

భావజనిభు విరుపాక్షుధ,
రావరునిం గాంచి జగతిఁ బ్రస్తుతి కెక్కెన్. ౪౬

తా. మఱియు నావేంకటరాజు, ఐశ్వర్యము ప్రకాశించునట్లు చిన్నకృష్ణమదేవియందు స్థిరమయినభాగ్యమునకు నిధియయినవాఁడును, మన్మథునితో సమానుఁడును అగు విరూపాక్షురాజును గని లోకమునందుఁ బొగడ్త వడసెను. ౪౬

వ. మఱియు నక్కుమారుల క్రమం బభివర్ణించెదము. ౪౭

తా. ఇంకను పైనుదాహరింపఁబడిన రాచబిడ్డలగొప్పతనమును క్రమమముగ వర్ణించెద మని యెట్టు లనిన— ౪౭

మ. పటుసుజ్ఞానకళానిరూఢి వెలయుఁగా బ్రహ్మభుఁ డై, నిత్యవి
స్ఫుటసత్యోక్తి నజాతశత్రుకరణిం బొల్పొందుఁ, గొండ్రాజు వేం
కటరాజేంద్రునిపూర్వపుణ్యఫలమై కన్పట్టు, భూపాళిలోఁ జటు
లస్ఫూర్తి వెలుంగుకృష్ణనృపుఁ బోల్ స్వామిన్ ధరం గంటిమే.

తా. సమర్థమయిన మంచిజ్ఞానముయొక్కయు, విద్యలయొక్కయుఁ గలిమిచేతను బ్రహ్మదేవునివంటివాఁ డయి ప్రకాశించును. నిత్యమును స్ఫుటముగా సత్యము పలుకుటయందు ధర్మరాజువలెఁ బ్రకాశించును. కొండలరాజుగారి వేంకటరాజుయొక్క పూర్వపుణ్యమునకు ఫలస్వరూపుఁడై కనిపించును. రాజులలో గొప్పప్రకాశముతో వెల్గుచుండు నట్టికృష్ణరాజును పోలినరాజును భూమియందుఁ జూచితిమా? ౪౮

క. రాజు కళావైఖరి సుర,
రాజురుభోగమునఁ గుధరరాజు దిటమునన్
రాజు వదాన్యత వేంకట,
రాజన్యసుతుండు మల్లరాజేంద్రుఁ డిలన్. ౪౯

తా. వేంకటరాజుకొడుకు మల్లరాజీభూమియందు కళావైఖరి యందుఁ జంద్రునివంటివాఁడును, గొప్పభోగమునందు దేవేంద్రునివంటివాఁడును, ధైర్యమునందు హిమాద్రివంటివాఁడును, దాతృత్వమునందుఁ గుబేరుని వంటివాఁడును. ౪౯

క. అసదృశవితరణవిద్యా,
రసికునకును శౌర్యధైర్యరఘురామునకుఁ
వసుమతి వేంకటభూవరు,
బసవనృపాలునకు నన్యపార్థివు లెనయే. ౫౦

తా. భూమియందు సాటిలేని దాతృత్వమునందును, విద్యలయందును రసజ్ఞుఁడును, శౌర్యమునకును, ధైర్యమునకును శ్రీరామునివంటివాఁడును అయిన వేంకటరాజుగారిబసవరాజున కితరరాజులు సమానులా? కారనుట.

క. ధీరుఁడు బాంధవసుజనా,
ధారుఁడు శూరుఁడు నితాంతదానవిజితమం
దారుఁడు వేంకటశౌరికు,
మారుఁడు వీరన్న రాజమాత్రుఁడె ధరణిన్. ౫౧

తా. ధైర్యశాలియు, బంధువులకును, సుజనులకును ఆధార మయినవాఁడును, శౌర్యశాలియు, తెంపులేనిదానగుణముచేతను కల్పవృక్షమును జయించినవాఁడును, అయిన వేంకటరాజుగారికుమారుఁడు వీరరాజు భూమియందు కేవలము రాజా? అనఁగా గొప్పరాజనుట. ౫౧

ఉత్సాహము. నీలకంధరుఁ జయించి నీరజారిఁ గేరి యా,
పాలకడలి మించి హంసపంక్తిఁ దెగడి పూర్వదిక్
పాలకరిని ధిక్కరించి ప్రబలె వేంకటేంద్రుమా,
నీలకంఠరాజుకీర్తి నిఖలదిక్తటంబులన్. ౫౨

తా. వేంకటరాజుగారి నీలకంఠరాజుకీర్తి యీశ్వరుని జయించి, చంద్రుని పరిహసించి, పాలసంద్రమును మించి, అంచలబారును తిరస్కరించి, తూర్పుదిక్కునకు ప్రభువయిన యింద్రునియేనుఁగయిన యైరావతమును ధిక్కరించి దిగంతములయందు ప్రబలినది. ౫౨

క. శిక్షించు ఖలులఁ గరుణన్,
వీక్షించును సాధుజనుల వేంకటవసుధా
ధ్యక్షునివిరుపాక్షాధిపు,
నక్షుద్రయశోభిరాము నలవియె పొగడన్. ౫౩

తా. దుర్మార్గులను శిక్షించును. మంచివారిని దయతోఁ జూచును. అధికమయిన కీర్తిచేతను మనోహరుఁడయిన వేంకటరాజుగారి విరూపాక్షరాజును పొగడవశమా? ౫౩

క. ఈరీతిఁ బుత్త్రసంప,
ద్భూరియశోరాజ్యవిజయబోధకుఁ డయి యా
పౌరుషనిధి పెదతిమ్మ,
క్ష్మారమణుని వేంకటాద్రిజనపతి యలరున్. ౫౪

తా. ఈప్రకారముగా పుత్త్రసంపద, గొప్పకీర్తి, రాజ్యము, విజయము, జ్ఞానము గలవాఁడయి, పౌరుషమునకు నిధియయి పెదతిమ్మరాజుగారి వేంకటరాజు ప్రకాశించును. ౫౪

సీ. వసుమతీభాగధూర్వహన నిర్వాహలీల,
ఘనకిటిప్రభుఁడు వేంకటవిభుండు
నిఖిలదిశాభోగనిబిడయశస్స్రన,
ఘనసారనిభుఁడు వేంకటవిభుండు
సంతతానూనదాసత్రాణవైఖరిఁ,
గర్ణాఖ్యనిభుఁడు వేంకటవిభుండు
దృఢతరబాహుప్రదీప్త్యధరీకృత,
గ్రహరాట్ప్రభుండు వేంకటవిభుండు

తే. గీ. రాజమాత్రుండె తలఁపఁ గొండ్రాజుతిమ్మ,
ధరణినాయకుతనయుఁ డుదాత్తనయుఁడు
ప్రౌఢవిద్వత్కవీశ్వరప్రకరవినుత,
గాఢసత్కృతివిభుఁడు వేంకటవిభుండు ౫౫

తా. మఱియు నా వేంకటరా జెట్టివాఁ డనిన? భూభాగముయొక్క భారమును వహించుట నిర్వహించుట యనులీలయం దాదివరాహముతో సమానుఁడు. ఎల్లదిక్కులవైశ్యాలమందువ్యాపించినకీర్తియందు కర్పూరముతో సమానుఁడు. ఎల్లప్పుడును అధికముగా దాసులను రక్షించువైఖరియందు కర్ణునితో సమానుఁడు. మిగుల దృఢమయిన బాహుపరాక్రమముచేతను గ్రహరాజయిన సూర్యునికాంతిని క్రిందుచేసినవాఁడు. కొండరాజుగారి తిమ్మరాజుకొమారుఁడును, అధికమయిననీతి గలవాఁడును, ప్రౌఢులయిన విద్వత్కవీశ్వరుల సమూహముచేతను కొనియాడఁబడిన గాఢమయిన మంచికావ్యములకుఁ గృతినాయకుఁడును, అగు వేంకటరా జాలోచింపఁగా రాజమాత్రుఁడా? ౫౫

కథానుక్రమణిక.

వ. ఇట్టిలోకోత్తరున కభ్యుదయపరంపరాభివృద్ధిగా మాయొనర్పంబూనిన రెట్టమతశాస్త్రంబునకు వేంకటక్ష్మాపాలశిరోమణి నధినాథుం జేసి తద్వంశక్రమం బభివర్ణించి తదనంతరంబ యీప్రబంధంబునకు ననుక్రమణికం దెల్పెద మదియెట్టిదనిన వర్షాదిహేతువులగు భూజాతపుష్పపరీక్షయు, గోవ్రజార్చనాశకునంబును, దూతలక్షణంబును, గర్భర్తులక్షణంబును, మేఘలక్షణంబును, విద్యుల్లక్షణంబును, గర్జితలక్షణంబును, ఇంద్రచాపలక్షణంబును, పరివేషలక్షణంబును, ప్రతిసూర్యాతపవాయులక్షణంబును, గ్రహయుద్ధలక్షణంబును, బీజావాపలక్షణంబును, అర్ఘలక్షణంబును, గ్రహలక్షణంబును, ఆకస్మికలక్షణంబును, గ్రహచారాస్తమయో

దయలక్షణంబును, గ్రహబలఫలలక్షణంబును, గురూదయాబ్ద సంవత్సరఫల లక్షణంబును, సంవత్సరాదిఫలంబును వివరించి యుండు నందు. ౫౭

తా. లోకోత్తరుఁ డయిన యిటువంటి రాజున కభ్యుదయపరంపర కలుగునట్లుగా క్షేమము చేయఁబూనిన యీరెట్టమతశాస్త్రమునకు రాజశిఖామణి యగు వేంకటరాజును కృతిపతినిగాఁ జేసి, ఆతనివంశముయొక్క క్రమమును వర్ణించి యీకావ్యమున కనుక్రమణికను దెల్పుచుంటిమి. ఆయనుక్రమణి యెట్టి దనఁగా—వర్షము మొదలుగాఁ గలవానికిఁ గారణములయిన వృక్షములయు, పుష్పములయుఁ బరీక్షయు, ఆలమందను పూజించి తెలియఁదగిన శకునమును, దూతపరీక్షయు, పక్షులశకునమును, గర్భబుతువుస్వరూపమును, మేఘములస్వరూపమును, మెఱపులస్వరూపమును, ఉఱుముల స్వరూపమును, ఇంద్రధనుస్సుస్వరూపంబును, పరివేషములస్వరూపమును, ప్రతిసూర్యునియొక్కయు, ఎండయొక్కయు, గాడ్పుయొక్కయు స్వరూపమును, గ్రహములయొక్కయుద్ధస్వరూపమును, గింజలు నాటుటయు, వెలలస్వరూపమును, గ్రహములస్వరూపమును, ఆకస్మికస్వరూపమును, గ్రహములసంచారము, అస్తమయము, ఉదయము వీనిస్వరూపమును, గ్రహములబలమునుబట్టి కలుగుఫలములస్వరూపమును, గురూదయాబ్ద మను పేరుకల సంవత్సరపుఫలముయొక్క స్వరూపమును, సంవత్సరములు మొదలగు వానివలనఁ గలుగు ఫలమును స్పష్టముగాఁ జెప్పఁబడియుండును. అందులోపలను— ౫౭

సీ. వరుస గర్గాచార్యవర్యునిమతమున
మతిశాలి హరిభట్టుమతమునందు
ధరఁ గీర్తిఘనుఁ డైనధన్వునిమతమునఁ
బ్రతిభఁ జెన్నొందు శ్రీపతిమతమున
మేటి యైనవరాహమిహిరార్యుమతమున
సన్మేఘమాలికాశాస్త్రమునను

నుచితకీర్త్యాఖ్యచే నొప్పు నారాయణ
భట్టుమతంబునఁ బ్రాజ్ఞు లైన
తే. గీ. జనులయుక్తిని జ్యోతిషసారమునను,
శకునచయమునఁ గలయర్థచయము తెలిసి
కృతి యొనర్చిన రెట్టనిమతము మేము,
వేడ్కఁ దెనిఁగించెదము నీకు వేంకటేంద్ర! ౫౭

తా. క్రమముగా గర్గాచార్యునిమతమునను, బుద్ధిమంతుఁడయిన హరిభట్టునిమతమునందును, కీర్తిశాలియయిన ధన్వునిమతమునందును, బుద్ధివిశేషముచేతను ఒప్పుచుండెడి శ్రీపతియొక్క మతమునందును, గొప్పవాఁడయిన వరాహమిహిరుని మతమునందును, మేఘమాలికయను శాస్త్రమందును, మంచికీర్తి పేరు గల నారాయణభట్టుమతమునందును, మఱియుఁ బ్రాజ్ఞులయినవారిమాటలయందును, జ్యోతిషసారమునందును, శకునములసమూహంబునందును గలయర్థమంతయుఁ దెలిసికొని గ్రంథమును వ్రాసిన రెట్టఁ డనెడి కర్ణాటభాషాకవీశ్వరునిమతమును మే మిద్దఱమును ఓ వేంకటరాజా! వేడుకగా నీకోరినప్రకారము తెలుఁగుకావ్యముగఁ జేసెదము. ౫౭

తే. గీ. ఎంత లోకోపకారక మెంత నిక్క,
మెంత ప్రత్యక్ష మిది యని యెప్పు డార్య
లెల్ల శిరసావహింపుదు రీమతంబు,
ఘనతరౌదార్యశీల వేంకటనృపాల! ౫౮

తా. మిగుల గొప్పదియగు నౌదార్యము స్వభావముగాఁగల వేంకటరాజా! ఈరెట్టమతశాస్త్ర మెంతటి లోకోపకారకము! ఎంత నిజమయినది! ఎంత ప్రత్యక్షమయినది! అని యెల్లకాలమందును పెద్ద లందఱును ఈరెట్టమతమును శిరసావహించుచుందురు. ౫౮

## —(*) వృక్షపుష్పఫల లక్షణము. (*)—

సీ. పరఁగ నశోకంబు బ్రహ్మమేడియుఁ బూచి
కాచిన సస్యసంఘము ఫలించుఁ
గపురంపుటనఁటులు గాచ నల్లగిసెపై
రాదిగాఁ గృష్ణధాన్యములు ప్రబలు
బాగు మీఱఁగఁ జింత పాలయుఁ గరివేము
గాచిన వ్రీహివర్గంబు మించు
వింతగాఁ దుమికిచె ట్లింతయుఁ గాచిన
యావనాళసమృద్ధి యగును మిగుల
తే. గీ. నెలమి ములుమోదుగులు గాచ నలరుఁ గొఱ్ఱ,
మొల్ల పూచిన నావాలు మొల్ల మగును
రావి గాచిన జనుమును ప్రత్తి వోడము,
సత్య మింతయు వేంకటక్ష్మాతలేంద్ర! ౫౯

తా. అశోకవృక్షమును, బ్రహ్మమేడిచెట్టును పూచి కాచినపక్షమున సకలసస్యములును ఫలించును. కర్పూరపుటరఁటిచెట్లు కాచినపక్షమున నల్లయగిసె మొదలుగాఁగల నల్లనిధాన్యములు వృద్ధిని పొందును. చింతచెట్లు, పాలచెట్లును, కరివేఁపచెట్లును కాచినయెడల వడ్లదినుసులు పండును. తుమికిచెట్లు కాచినయెడల జొన్నలు సమృద్ధిగా పండును. ములుమోదుగుచెట్లు కాచినచో కొఱ్ఱలు పండును. మొల్లలు పూచినయెడల ఆవాలు హెచ్చుగా పండును. రావిచెట్లు కాచినయెడల ప్రత్తి జనుము హెచ్చుగా ఫలించును. వేంకటరాజా! ఈచెప్పిన దంతయు నిశ్చయము. ౫౯

సీ. వావిలి పూచిన వర్ధిల్లు ముత్యముల్
తిలకంబు పూచినఁ గలుగు వెండి
పిక్కమారేడులు పెంపొందఁ గాచిన
నందందు బంగార మతిశయిల్లు

నత్తి గాచినఁ దామ్రమ సుగ్గువ యై యుండు
గోలిమి గాచిన వజ్రకులము వెఱయు
బంధూకములు పూచఁ బ్రబలును బవడముల్
బచ్చలి గాచిన భయము లమరు
తే. గీ నరఁటి గాచిన గొఱియలు హర్ష మందు,
ధరణి బలురక్కసులు పూచఁ గరులు చెలఁగు
బాదిరులు పూచ నావులు మోద మందుఁ,
బ్రధనజయసాంద్ర వేంకటరాజచంద్ర! ౬౦

తా. యుద్ధములయందు జయములతో నిండిన వేంకటరాజచంద్రా! వావిలిచెట్లు పూచినయెడల ముత్యములు వృద్ధిపొందును. తిలకవృక్షములు కాచినయెడల వెండి దొరకును. పిక్కమారేడుచెట్లు హెచ్చుగా కాచినయెడల నక్కడక్కడ బంగారము వృద్ధిపొందును. అత్తిచెట్లు కాచినయెడల రాగి చౌక యగును. గోలిమిచెట్లు కాచెనేని వజ్రములు ప్రకాశించును. మంకెనపూవులు పూచినయెడల పగడములు వృద్ధిపొందును. బచ్చలిచెట్లు కాచినయెడల భయములు కలుగును. అరఁటిచెట్లు కాచినయెడల గొఱ్ఱెలు సంతోషించును. బలురక్కసిచెట్లు పూచినయెడల ఏనుఁగులు వృద్ధిపొందును. బాదిరి (కలిగొట్టు) చెట్లు పూచినయెడల ఆవులు సంతోషించును. ౬౦

తే. గీ. అడవితంగేడు రేలయు ననుము కుసుమ,
పూచెనేనియు ముద మగు భూమిప్రజకు
నలిని పూచిన ద్విజుల కుత్పలిని పూచ,
క్షత్రియుల కంద్రు జయము వేంకటనరేంద్ర! ౬౧

తా. ఓ వేంకటరాజా! అడవితంగేడుచెట్లును, రేలచెట్లును, అనుపచెట్లును, కుసుమచెట్లును పుష్పించినయెడల మనుజులకు సంతోషము గలుగును. తామర తీగలు పుష్పించినయెడల బ్రాహ్మణులకును, కలువతీగలు పుష్పించినయెడల క్షత్రియులకును జయము గలుగు నందురు. ౬౧

తే. గీ. జమ్మిచంద్రలు గాచినఁ జాలఁ బంట,
గలుగు వేములు లెస్సగాఁ గాచెనేని
రోగములు లేవు ప్రజలకు భోగ మమరు,
మిహిరసంకాశ వేంకటమేదినీశ! ౬౨

తా. సూర్యునివంటివాఁడవగు వేంకటరాజా! జమ్మిచెట్లును, చంద్రచెట్లును కాచినయెడల పంట లధికముగా పండును. వేఁపచెట్లు విశేషముగా కాచినచో జనులకు రోగము లుండవు. భోగములు కలుగును. ౬౨

సీ. కనుఁగొన మోదుగుకాయలో గింజలు
గట్టిగా మూఁడు చూపట్టెనేనిఁ
గ్రమమున నార్ద్రాదికార్తెలు పదునాల్గు
నన్నియు వర్షించు నదియుఁ గాక
మొదటిగింజయ యున్న మొదటికార్తెలయందు
నడిమిగింజయ యున్న ననువు మీఱ
నడిమికార్తెలయందుఁ గడగింజ యుండినఁ
గడకార్తెలందును గలుగు వాన
తే. గీ. లందు నేగింజ కడు కొంచె మయ్యెనేని,
తబక యై యుండెనేని తత్కార్తెలందు
నల్పవర్షంబు గురియు నంద్రార్యజనులు,
కాంతినిర్జితచంద్ర వేంకటనరేంద్ర! ౬౩

తా. కాంతిచేతను చంద్రుని జయించిన వేంకటరాజా! మోదుగుకాయలో మూఁడుగింజ లుండినచో ఆర్ద్రకార్తె మొదలుకొని అనఁగా, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఘ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, మూల పూర్వాషాఢ అను కార్తెలయందు చక్కఁగా వర్షించును. ఆమూఁడుగింజలలో మొదటిగింజ మాత్రమే ఉన్నయెడల మొదటికార్తెలయందును, మధ్యగింజమే ఉన్నయెడల మధ్య

కార్తెలయందును, కడపటిగింజయే ఉన్నయెడల కడపటికార్తెలయందును వర్షములు చక్కఁగా కురియును. ఈమూఁడుగింజలలో ఏయేగింజ గట్టిదిగా నుండక వట్టిగింజ యగునో యా యాకార్తెలయందు వర్షము కొంచెముగాఁ గురియు నని పెద్దలు చెప్పుదురు. ౬౩

సీ. మఱ్ఱియొద్దియు నిప్ప మారేడు నేరేడు
మెంతి గోదుమలును మినుము యవలు
కలివియు నడవిలోఁ గలచెట్లు గాచిన
రెట్టఁ డల్ప మనెను బృథివిఁ బంట
కొడిసె గాచిన రుజ పొడము భూజనులకుఁ
గడిమి గాచిన వాన కడమ యగును
జీడి గాచిన భీతి సిద్ధంబు నాగకే
సరులు గాచిన వాంతి సంభవించు
బిళ్ళ గాచిన నగ్నిభీతి సంధిల్లును
వెలగ గాచిన గాలి గలిగియుండు
బుడమలు గాచిన భూమిపాలకులకు
దళవాయులకును బ్రధానులకును
తే. గీ. దళములకుఁ జాల నన్యోన్యకలహ మొదవు,
నేచి లొద్దుగ దిరిసెన పూచెనేని
పంట లల్పంబు లనియెను బ్రాజ్ఞుఁ డగుచు,
నేర్పు మీఱఁగ రెట్టకందర్పుఁ డిలను
రమ్యగుణసాంద్ర ! వేంకటరాజచంద్ర. ౬౪

తా. మంచిగుణములు గల వేంకటరాజా ! మఱ్ఱిచెట్లు, ఒద్దిచెట్లు, ఇప్పచెట్లు, మారేడుచెట్లు, నేరేడుచెట్లు, మెంతి, గోదుమ, మినుము, యవలు, కలివిచెట్లు మొదలయిన యడవిచెట్లు గాచినయెడల పంటలు తక్కువ యగు నని రెట్టఁడు చెప్పినాఁడు. కొడిసెచెట్లు కాచినయెడల మనుష్యులకు

రోగములు కలుగును. కడిమిచెట్లు కాచినయెడల వర్షములు తక్కువ కురి యును. జీడిచెట్లు గాచినయెడల జనులకు భయము తప్పదు. నాగకేసర ములు కాచినయెడల వాంతులు కలుగును. బిళ్లచెట్లు విశేషముగా ఫలించిన యెడల లోకమునం దంతటను అగ్నిభయము మెండుగాఁ గలుగును. వెలగచెట్లు కాచినయెడల నధికముగా గాలి గలుగును. ఖుదమచెట్లు కాచినయెడల రాజులకును, సేనానాయకులకును, మంత్రులకును, సేనలకును పరస్పరము కలహములు గలుగును. లొద్దుగచెట్లును, దిరిసెనపుచెట్లును విశే షించి పూచినయెడల పంటలు స్వల్పముగా పండు నని పండితుఁడయిన రెట్టఁడు చెప్పెను. ౭౪

—(*) గోశకునలక్షణము. 2. (*)—

సీ. భక్తితో నాషాఢబహుళనవమినాఁడు
మొదలింటిజాముస మొదవుగముల
నర్చించి రెండవయామంబున నరుండు
తనకోర్కి ఫలియించు ననఁగ నపుడె
పాఁడియా వైనను బలుమూఁపురము గల్గు
వృషభ మైనను మంద వెడలెనేని
వానలు గురియు నవ్వారిగాఁ గడు లెస్స
పండు సస్యంబులు బహువిధముల
తే. గీ. మేదినీస్థలి నర్థసమృద్ధి గలుగు,
నఖిలజనులకు నారోగ్య మతిశయిల్లు
వాంఛితార్థంబు లీడేరు వరుస మఱియు,
నృపుల కాహవ మనెఁ జాల రెట్టఁ డిలను
రమ్యగుణసాంద్ర ! వేంకటరాజచంద్ర!. ౭౫

తా. ఓ వేంకటరాజోత్తమా ! భక్తితో ఆషాఢబహుళనవమినాఁడు మొదటిజామున ఆవులమందను పూజచేసి రెండవజామున నాకోర్కి ఫలించు నా అని ప్రార్థింపఁగానే పాలిచ్చునావైనను పెద్దమూఁపురముగలయెద్దయి

నను ఆయావులమందలోనుండి బయటికి వెడలెనేని హెచ్చుగా వర్షములు గురియును. పలువిధములగు సస్యములు మిక్కిలి ఫలించును. భూమియందంతటను వెలలు సమృద్ధిగా నుండును. ఎల్లజనులకును దేహారోగ్యాదులు మెండుగాఁ గలిగియుండును. కోరినకోర్కులన్నియును ఈడేరును. కాని రాజులకు విశేషముగా యుద్ధములు కలుగు నని రెట్టఁ డన్నాఁడు. ౮౫

ఉ. ఆలగమి న్నరుండు తగ నర్చన చేసినవేళ నెఱ్ఱనై
చాలఁగఁగుంటి గ్రుడ్డియును జాబిర పొందినబక్కయాత్మఖే
దాలసవృత్తి నెద్దయిన నా వయినం గమిఁ బాసి వచ్చినన్
గూలుఁ దెవుళ్ళచేతఁ బ్రజ కుంభిని వానలు లేవు తన్మహీ
పాలుఁడు హానిఁ జెందు ననె బాగుగ రెట్టఁడు మేదినీస్థలిన్
పాలితసత్కవీశ్వర! యపారకృపాకర! వేంకటప్రభూ!. ౮౬

తా. మంచికవీశ్వరులను పాలించినవాఁడా! అంతములేని దయకు నిధియైనవాఁడా! ఓవేంకటరాజా! మనుజుఁ డావులమంద నొప్పునట్లు పూజచేసిన సమయమున నావులమందనుండి యెఱ్ఱకాంతిగలదియును కుంటిది గాని గ్రుడ్డిదిగాని నచ్చయి బక్కచిక్కినదిగాని మనోదుఃఖముచేత నడవఁ జాలనిదిగాని అయిన ఎద్దుగాని ఆవుగాని బయటికి వచ్చెనేని భూమియందలి ప్రజలు రోగములచేత చనిపోవుదురు. వానలు గురియవు. ఆదేశపురాజునకు హాని వాటిల్లును. అని రెట్టఁడను శాస్త్రజ్ఞుఁడు చెప్పినాఁడు. ౮౬

తే. గీ. వేడ్క నావుల నర్చించువేళ నలుపు,
నెఱుపుఁ గలగొడ్డుటావు దా నెసఁగ మంద
వెడలెనేనియుఁ గొలఁదిగా వృష్టి గురియు,
రచితసత్కృత్య వేంకటరాజచంద్ర!. ౮౭

తా. మంచిపనులుచేసిన వేంకటరాజచంద్రా! వేడుకతో ఆవులను పూజించుసమయమందున నలుపును ఎఱుపును గలగొడ్డుపోయినయా వామందలోనుండి బయటికి వచ్చెనేని వర్షములు స్వల్పముగాఁ గురియును. ౮౭

—(*) పక్షిశకున లక్షణము. (*)—

క. విను పైఁడికంటిశకునము,
గనునెడ గంధాక్షతముల ఖగమును మ్రాఁనిన్.
జను లర్చింపఁగ వలయును,
వినయోజ్జ్వల తిమ్మరాజు వేంకటనృపతీ! ౬౭

తా. వినయముచేత అధికముగాఁ బ్రకాశించు తిమ్మరాజుగారి వేంకటరాజా! వినుము. పైఁడికంటి యనఁగా, కనకాక్షిపక్షివలన శకునమును జూడఁదలంచినప్పుడు గంధము, అక్షతలు, మొదలగువానిచేత నాపక్షిని, అదియున్న వృక్షమును పూజింపవలయును. ౬౭

ఉ. పూవులు నక్షతంబులును బొందుగఁదోయిటఁ దాల్చివానకై
భావములోన మానవుఁడు ప్రశ్న యొనర్పఁగఁ బక్షి యయ్యెడ
న్నావిరి బేసిగాఁ బలుక వాన యవారిగఁ గల్గు నండ్రు గో
త్రావలయంబునందుఁ గవిరాజి నుతింపఁగ వేంకటాధిపా! ౬౮

తా. వేంకటరాజా! పుష్పములును, అక్షతలును చక్కఁగా దోసిలియందుఁ బట్టుకొని వర్షమునిమిత్తము మనుష్యుఁడు మనస్సునందుఁ దలంచునపు డాపక్షి బేసిగా పలికెనేని అనఁగా ఒకమాఱు మూఁడుమార్లు అయిదుమార్లు ఇట్లు బేసిసంఖ్యగా పలికినచో హెచ్చుగా వాన గలుగు నని పండితులు చెప్పుదురు. ౬౮

చ. ఇరవుగఁ బైఁడికంటి వసియించినపచ్చనిమ్రాఁనిక్రింద శ,
ర్కరయును బిట్టమాంసముఁ బ్రకాశముగా నిడినం బ్రసన్నమై
యరుదు ఘటిల్ల నాపతగ మందుల నొక్కటి యైన ముట్టినన్
గురియును వర్షము ల్మిగుల గొబ్బున వేంకటరాజశేఖరా!

తా. వేంకటరాజశేఖరా! చక్కఁగా పైఁడికంటి నివసించినపచ్చని వృక్షముక్రిందను చక్కెరను పిట్టలమాంసమును స్పష్టముగాఁ గనఁబడునట్లు పెట్టి చూడఁగా ప్రసన్నమైన మనస్సుతో అనఁగా భయమునుమాని యా

పక్షి వచ్చి యూరెంటిలో దేనినైన నొకదానిని గ్రహించెనేని మిక్కిలి శీఘ్రముగా వర్షము గురియును. ౭౦

చ. ఘనముగ వానకై పసిఁడికంటికి నర్చన సేయఁబోవుచో
ననలకృతాంతయక్షమరుదాశల నావిహగంబు వచ్చి తీ
ర్చిన మఱి చేరినం బరఁగ శీఘ్రమె వర్షమువచ్చు హెచ్చుగాఁ
గనకమహీధ్రధైర్య! బుధకల్పక! తిమ్మయవేంకటాధిపా! ౭౧

తా. మేరుపర్వతముతో సమానమైన ధైర్యముగలవాఁడవును, విద్వాంసులకుఁ గల్పవృక్షమువంటివాఁడవును, అయిన తిమ్మరాజుగారి వేంకటరాజా! వర్షముకొఱకుఁ బైఁడికంటియొక్క శకునమును చూచుటకుఁ బోవునపుడాగ్నేయదిక్కున నుండికాని, దక్షిణదిక్కుననుండికాని, ఉత్తరదిక్కున నుండికాని, వాయవ్యదిక్కున నుండికాని, యూపైఁడికంటిపక్షి వచ్చి తీర్చినను, ఆదిక్కులయందుండి వచ్చి సమీపముగా నిలిచినను శీఘ్రముగానే పెద్ద వర్షము గురియును. ౭౧

చ. చెలువుగఁ బక్షి కర్చనము సేయఁగఁ దత్తుజశాఖనుండి య
వ్వలుఁగు కొలంకుచెంత నదిపొంతఁదటాకముదండబావిక్రే
వల వసియించి యూఁక లతివైఖరి మీఱ విదిర్చి తాఁ జన
బలువుగ వాన గల్గు గుణబంధుర! వేంకటరాజశేఖరా! ౭౨

తా. గుణములచేత మనోహరుఁడవైన యోవేంకటరాజోత్తమా! చక్కఁగా పక్షిని పూజించునపు డాపక్షి యాచెట్టుకొమ్మ మీఁదనుండి, మడుఁగువైపునకుఁగాని, నదిదగ్గఱకుఁగాని, చెఱువు సమీపమునకుఁ గాని, బావియొద్దకుఁగాని పోయి నిలిచి తనరెంౘ్రుకలను క్రిందను జాఱవిడిచి పోయినపక్షమున అధికముగా వర్షము గలుగును. ౭౨

సీ. మనుజుండు పక్షి కర్చనఁ జేసి యున్నచో
నొప్పుగా నది యేర్చి రొప్పెనేని

కుజశాఖ డిగి వచ్చి కూర్చున్నయామ్రాని
వలపలిదిక్కున నిలిచెనేని
మూత్రంబు విడిచిన ముదముతోఁ దా నున్న
దిక్కున నున్న నాదిశను విడిచి
యన్యదిక్కున కేఁగి యట నుబ్బి యాడిన
క్షితిజంబునకుఁ బ్రదక్షిణము గాఁగ
తే. గీ. వచ్చెనేనియు వర్షం బవశ్యముగను,
వచ్చు మఱియును దలఁచినవాంఛితంబు
లెల్లఁ జేకూరు నిది తథ్య మెంచి చూడఁ,
గలితకీర్తిప్రకాశ! వేంకటమహీశ! ౨౩



తా. ఒప్పుచున్న కీర్తిప్రకాశముగల యోవేంకటరాజా! మానవుఁడు పక్షికి పూజను చేయునపు డాపక్షి చక్కఁగా విజృంభించి కూసినను, చెట్టుకొమ్మనుండి దిగివచ్చి తాను గూర్చుండియున్న చెట్టు కుడిదిక్కున నిలిచినను, మూత్రము విడిచినను, ఉన్నదిక్కుననే ఉన్నను, ఆదిక్కువిడిచి వేఱుదిక్కునకుఁ బోయి యక్కడ నుప్పొంగి యాడినను, చెట్టునకుఁ బ్రదక్షిణముగా వచ్చినను తప్పక వాన గురియును. ఇంతే కాదు. కోరినకోరికలన్నియు సిద్ధించును. ఆలోచించిచూడఁగా నిపుడు చెప్పిన దంతయు నిజము.

తే. గీ. ప్రశ్న మొనరించుచోటను బసిఁడికంటి,
కట్టపయి రాతిపయి నీరు రెట్ట యిడిన
దానియండంబు లోగి జేసి రైన రాల,
వాన గల దని రెట్టఁడు పూని పలికె,
రాజదేవేంద్ర! వేంకటరాజచంద్ర! ౨౪

తా. రాజులలో దేవేంద్రునివంటివాఁడ వయినయోవేంకటరాజా! ప్రశ్నించుచోటను కనకాక్షిపక్షి కట్టమీఁదనుగాని రాతిమీఁదనుగాని

మూత్రించి రెట్ట వేసినను, దానిగ్రుడ్లు బేసిసంఖ్యగా నున్నను వాన గురియు నని రెట్టఁడు నిశ్చయముగాఁ జెప్పినాఁడు. ౭౪

చ. పనివడి వానకై నరుఁడు ప్రశ్న యొనర్పఁగఁ బక్షి యుండునో
చనునొ యటంచు, నున్న తరుశాఖనునుండిన వామభాగమం
దెనయఁగఁ జేష్ట చేసిన మహీజముదాపటి కేఁగినం గనుం
గొన సరిగ్రుడ్లు లైన మఱి కుంభిని రెట్టఁడు వానలే దనెన్
వినుతగుణప్రభావ! యరిభీకర! వేంకటరాజశేఖరా! ౭౫

తా. కొనియాడఁబడినగుణములును ప్రభుత్వమును గలవాఁడా! శత్రుభయంకరా! వేంకటరాజశేఖరా! మనుజుఁ డక్కఅగల్గి వాననిమిత్తము పక్షి యుండునా పోవునా యని ప్రశ్నించుకొనినపు డాపక్షి తా నదివఱ కున్నచెట్టుకొమ్మమీఁదనే యున్నను, ఎడమవయిపున నున్నకొమ్మమీఁదికిఁ బోయి యేదేని చేష్ట చేసినను, ఆచెట్టుయొక్క యెడమభాగమునకుఁ బోయినను, చెట్టెక్కి చూడఁగా దానిగ్రుడ్లు సరిసంఖ్యగా అనఁగా, రెండు, నాలుగు, ఆఱు ఈమాదిరిగా నున్నను భూమిమీఁద వానపడదని రెట్టఁడనెను. ౭౫

మ. స్థిరసౌభాగ్యనిదాన! దానజితరాధేయామరక్ష్మాజఖే
చరగీర్వాణమణీఘనాఘన! ఘనక్షత్త్రక్రియాదక్ష! ద
క్షరిపూద్ధర్షణదీక్షకీర్తిలలనాసంపన్న! విజ్ఞానవి
స్ఫుర! ధైర్యాదికళాధురంధర! ధరాపుత్త్రీశసేవాదరా! ౭౬

తా. శాశ్వతమయిన సౌభాగ్యమునకుఁ గారణమైనవాఁడా! దానముల చేతను రాధేయుఁ డనఁగా, రాధకొడుకయిన కర్ణుని, అమరక్ష్మాజము లనఁగా, దేవతలవృక్షములగు కల్పవృక్షములను, ఖేచరుఁ డనఁగా జీమూతవాహనుని, గీర్వాణమణి యనఁగా దేవమణియగు చింతామణిని, ఘనాఘన మనఁగా వర్షకాలమేఘమును జయించినవాఁడా! గొప్పవియగు రాజకార్యముల యందు నేర్పుగలవాఁడా! దక్షునివిరోధియయిన యీశ్వరుని ధర్షణచేయుటయందుఁ బట్టుదలగల, అనఁగా నీశ్వరునిశరీరమువలెఁ దెల్లనయిన కీర్తియను

కాంతతోఁ గూడుకొన్నవాఁడా! విజ్ఞానముచేతను ప్రకాశించువాఁడా! ధైర్యము మొదలయిన కళలయొక్క భారమును వహించినవాఁడా! భూమి కూఁతురయిన సీతాదేవియొక్క భర్తయగు శ్రీరాముని సేవించుటయం దాదరముగలవాఁడా! ౭౬

మాలిని. మృగపతినిభశౌర్యా! మేదినీచక్రధుర్యా!
నగధరనుతిశీలా! నందితస్వర్థిజాలా!
దిగధిపసదృశౌజా! ధీరతాహార్యరాజా!
సుగుణగణకలాపా! సూర్యవంశప్రదీపా! ౭౭

తా. సింహముతో సమానమయిన శౌర్యముగలవాఁడా! భూచక్ర భారమును వహించినవాఁడా! శ్రీవిష్ణుని పొగడుటయే స్వభావముగాఁ గల వాఁడా! సంతోషపెట్టఁబడిన మంచి యాచకులగుంపు గలవాఁడా! దిక్పాలకులవంటి యోజస్సుగలవాఁడా! ధైర్యమున హిమవంతుని వంటివాఁడా! మంచిగుణములసమూహమే అలంకారముగాఁ గలవాఁడా! సూర్యవంశమును ప్రకాశింపఁ జేయువాఁడా! ౭౭

గద్యము. ఇది శ్రీమదొంటిమిట్ట రఘువీరకృపాలబ్ధ
సార సారస్వత ధుర్యాయ్యలరాజవంశ సంభవాయ్య
లాఖ్య, భాస్కరాఖ్యకవిద్వయప్రణీతం బయిన
రెట్టమతశాస్త్రంబునఁ బ్రథమాశ్వాసము.

తా. శ్రీమంతుఁడయిన "ఒంటిమిట్ట" యనుగ్రామమున వేంచేసి యున్న కోదండరామస్వామియొక్క దయచేతను పొందఁబడిన సారమయిన సారస్వతముయొక్క భారమును వహించినవారును, అయ్యలరాజవంశము నందుఁ బుట్టినవారును, అయ్యలు, భాస్కరుఁడు అనుపేళ్లుగల యిద్దఱు కవీశ్వరులచేతను రచింపఁబడిన దయిన రెట్టమతశాస్త్రమునం దిది మొదటి యాశ్వాసము.



శ్రీ ర స్తు.

# ద్వి తీ యా శ్వా స ము.



క. శ్రీమదహోబలనృహరి,
స్వామిదయాలబ్ధనిత్యసామ్రాజ్యరమా
ధామ! నిరంతరజయవి,
ద్యామల ! కొండ్రాజువేంకటాద్రినరేంద్రా! ౧

తా. శ్రీమంతుఁ డయినయహోబలనరసింహస్వామియొక్క దయ చేతను పొందఁబడిన సామ్రాజ్యలక్ష్మికి స్థాన మయినవాఁడా ! అడ్డు లేని విజయవిద్యలచేతను నిర్మల మయినవాఁడా! కొండరాజుగారి వేంకటాద్రిరాజా! ౧

## —(*) ప్రజాప్రశ్నలక్షణము. (*)—

క. విరు లయిన ఫలము లయినను,
బరువడి యక్షతల నయినఁ బట్టుక నగుచున్
సరసులు వానకు నడిగిన,
విరివిగ వర్షంబు గురియు వేంకటనృపతీ ! ౨

తా. వేంకటరాజా ! సరసు లగువారు అక్కఁజగలిగి పూవులయినను, పండ్లయినను, అక్షత లయినను చేతఁ బట్టుకొని నవ్వుచు వాన కురియునా యని ప్రశ్నించినపక్షమున, విస్తారముగా వాన కురియును. ౨

క. చరణద్వయంబుఁ గరమున,
ధరియించుచు నైన జలము దాఁటుచు నైనన్
సరసులు వానకు నడిగిన,
విరివిగ వర్షంబు గురియు వేంకటనృపతీ ! 3

తా. వేంకటరాజా ! సరసు లగువారు, తమరెండుపాదములను చేతితోఁ బట్టుకొనియైనను, నీరు దాఁటుచు నయినను వాన కురియునా యని ప్రశ్నించినయెడల విస్తారముగ వాన కురియును. 3

క. ధర గొడుగుఁ బట్టి యయినను,
సురుచిర మగుగొడుగునీడఁ జూచుచు నయినన్
సరసులు వానకు నడిగిన,
విరివిగ వర్షంబు గురియు వేంకటనృపతీ! ౪

తా. వేంకటరాజా! భూమియందు సరసు లగువారు గొడుగు చేతిలోఁ బట్టుకొని కాని, మిగుల సొగసయిన గొడుగునీడను చూచుచుఁగాని వాన కురియునా యని ప్రశ్నించినచో మిక్కిలి వాన కురియును. ౪

తే. గీ. ముసుఁగు వెట్టుక యించుక ముసుఁగు దెఱచి,
కడప దాఁటుచుఁ గంఠంబు గదల వాన
వచ్చునే యని యడిగిన వసుధ వృష్టి,
గలుగు నిది యొక్కమతము వేంకటనరేంద్ర! ౫

తా. వేంకటరాజా! ముసుఁగు వేసికొని కాని, కొంచెము ముసుఁగు తెఱచి కాని, గుమ్మము దాఁటుచుఁ గాని, కంఠము కదలునట్లు వాన కురియునా యని ప్రశ్నించినపక్షమున భూమియందు వాన కురియు నని యొకమత మున్నది. ౫

చ. జనులు ముదంబు సంఘటిల శాస్త్రవిదుం గని వానవచ్చునే
యనుసమయంబునన్ ఘటమునం దొకఁడక్కడ నీళ్లుచల్లుచు
న్నను దడికోక పిండిన ఘనంబుగ వర్షము వచ్చు నండ్రు స
ద్వినయకలాప! తిమ్మపృథివీపతి వేంకటభూపశేఖరా! ౬

తా. మంచివినయమే ఆభరణములుగాఁ గలవాఁడా! తిమ్మరాజుగారి వేంకటరాజా! మనుజులు సంతోషము గలుగునట్లు వర్షశాస్త్రము తెలిసినయతనిని చూచి వాన కురియునా యను నప్పు డాచోటను ఒకానొకఁడు కుండలోనినీటిని పైనఁ జల్లుచున్నను, తడిబట్ట పిండుచున్నను వాన హెచ్చుగా కురియు నని పెద్ద లందురు. ౬

సీ. చక్కెర యయినఁ జేరక్కఱతోడుతఁ
    బచ్చనియాకైనఁ బ్రప్పు లయిన
శ్రీగంధమేణ సరసీరుహంబేణ జామి
    కాయ లైనను మాంసఖండ మైన
విరు లైన ఫల మైనఁ గరముల ధరియించి
    కడు వాంఛ వానకు నడిగెనేని
వర్షంబు గురియు నవశ్యంబు మఱియును
    నలు వొంద నీలక్షణములతోడ

తే గీ. వచ్చి యూరికిఁ బోయినవారు మగిడి,
    వత్తురే యని యడిగిన వారు వేగ
    వత్తు రని పల్కుదురు శాస్త్రవాదు లెల్ల,
    విమలగుణసాంద్ర! కొండ్రాజువేంకటేంద్ర! ౭

తా. నిర్మలములయిన గుణములచేతను దట్టమయినవాఁడా! కొండ్రాజుగారి వేంకటరాజా! పంచదారగాని, పచ్చనియాకుగాని, ప్రప్పులుగాని, మంచిగంధముగాని, తామరపువ్వుగాని, జామికాయగాని, మాంసపుఁదునుకగాని, పూవులుగాని, పండుగాని, చేతఁబట్టుకొని మిగులఁ గోరికతో వాన కురియునా యని ప్రశ్నించినపక్షమున, తప్పక వాన కురియును. ఇంతేకాదు. పైప్రకారముగానే వచ్చి యూరికిఁ బోయినవారు మరలి వేగముగ వత్తురా అని ప్రశ్నించినపక్షమున, ఆవెళ్లినవారు వేగముగా వచ్చెదరని ప్రశ్నశాస్త్రము నెఱిఁగినవా రందఱును చెప్పుదురు. ౭

చ. అనలసమీరరాత్రిచరయామ్యదిశాస్థలులందు నుండి యా
    నన మటు తెల్లఁజేసుక మనంబున ఖేదముఁ బొంది పైపటం
    బును వెస జాఱ మైచలన మొందఁగ వానలువచ్చునేయనం
    దనివిగ వర్షము ల్గురియు ధారుణి వేంకటరాజశేఖరా! ౮

తా. వేంకటరాజా! అగ్నిమూలనుగాని, వాయుమూలనఁగాని, నిర్రృతిమూలనుగాని, దక్షిణదిక్కునఁ గాని నిలువఁబడి మొగము తెలతెలఁ బోవుచుండఁగా, మనసులో దుఃఖమును బొంది, పైవస్త్రము వెనుకకు జాఱి పోవుచుండఁగా, శరీరము చలనమును పొందుచుండఁగా వాన కురియునా యని ప్రశ్నించినపక్షమున, వలసినంతవాన కురియును. ౮

క. మడుపున నేటం జెఱువునఁ,
గడు వేడుక నిలిచి వాన గలదే యనినన్
జడివట్టి కురియు వర్షము,
విడువక వేంకటనృపాల! విమతవిఫాలా! ౯

తా. శత్రుసంహారకుఁడా! వేంకటరాజా! మడుఁగులోఁ గాని, ఏటిలోఁ గాని, చెఱువులోఁ గాని మిగుల వేడుకతో నిలువఁబడి వాన కురియునా అని ప్రశ్నించినచో విడువకుండ జడివానలు కురియును. ౯

తే. గీ. కాల్వ దొన బావిఁ గొంచెముగా జలంబు,
గలుగు నెడ నిల్చి వర్షంబు గలదె యనిన
వసుధమీఁదను దగుపాటివాన వచ్చు,
విక్రమోపేంద్ర! కొండ్రాజు వేంకటేంద్ర! ౧౦

తా. పరాక్రమమునందు విష్ణుమూర్తివంటివాఁడా! కొండ్రాజుగారి వేంకటరాజా! కాలువలోఁ గాని, జలధారిలోఁ గాని, కొంచెమునీరు గల చోటను గాని నిలువఁబడి వాన కురియునా యని ప్రశ్నించినచో భూమి మీఁదను తగుమాత్ర మనఁగా కొంచెముగా వాన కురియును. ౧౦

సీ. చెలమ చేరువఁ గొద్దిజల మున్న తావునఁ
బాటిగా నీ ళ్ళున్న యేటికడను
బచ్చనిమ్రాఁకులపజ్జఁ బాల్గలచెట్ల
చెంగట వాఁగులచెంత నిలిచి

పెదవులు దడుపుచు భీతిమై వడఁకుచు
దొరఁకొని వానలు దొడ్డు గాఁగఁ
గలవొ లేవో యని కాంక్షతో నడిగినఁ
గురియు వర్షము కడుఁ గొంచెముగను
తే. గీ. దప్ప దీమాట మేదినీతలమునందు,
ననుచు రెట్టఁడు వివరించె నతులమతిని
సరససల్లాప! భానువంశప్రదీప!
విబుధజనగణ్య! వేంకటవిభువరేణ్య! ౧౧

తా. సరసముగ మాటలాడువాఁడా! సూర్యవంశమును ప్రకాశింపఁ జేయువాఁడా! పండితులచే నెన్నఁబడినవాఁడా! వేంకటరాజా! చెలమ దగ్గఱఁగాని, కొంచెముగ నీరున్నచోటనుగాని, చక్కఁగా నీరుపాఱుచున్న యేటిదగ్గఱగాఁగాని, పచ్చనిచెట్లదగ్గఱఁగాని, పాలున్నచెట్లదగ్గఱఁ గాని, కొండకాలువలయొద్దను గాని నిలువఁబడి పెదవులు తడుపుకొనుచు, భయము చేతను వణఁకుచు, హెచ్చుగా వానలు కురియునా లేదా యనియక్కఱతో నడిగినయెడల, మిక్కిలి కొంచెముగానే వాన కురియును. భూతలమునం దీమాట తప్ప దని సాటిలేనిబుద్ధిచేతను రెట్టఁడు చెప్పియుండెను. ౧౧

మ. అలదైవజ్ఞునిఁ జేరి వాన గలదే యంచున్ జను ల్వేఁడువే
ళల నచ్చో నొకఁ డెవ్వఁడైనఁ గరవాలం బూనిజళ్పించుచున్
నలిసంచారముఁ జేయుచున్న నగుచున్నంబాయసాన్నంబుగుం
డలలో నింపుచునుండినన్ గలవు వానల్ వేంకటక్ష్మాధిపా!

తా. వేంకటరాజా! జోస్యులయొద్దకుఁ బోయి జనులు వాన కురియునా యని ప్రశ్నించునప్పు డాచోట నెవఁడైన నొక్కఁడుం కత్తి చేతఁబట్టుకొని జడియునట్లు చేయుచు, సంచారము చేయుచున్నను, నవ్వుచున్నను, పరమాన్నమును కుండలలో నింపుచున్నను వానలు కురియును. ౧౨

చ. తలఁపొనగూడవానగలదాయనువేళను గొంద ఱచ్చటన్
సలిలము పుక్కిలించుచుఁ దృషన్ జలమానిన నీరు ద్రొక్కి నం
బొలుపుగఁబంకమంటినను మూత్రము చేయుచునున్న వర్షము
ల్గలవు సమృద్ధిగా సుకవికల్పక ! వేంకట రాజ శేఖరా ౧౩

తా. మంచికవీశ్వరులకుఁ గల్పవృక్షమువంటివాఁడా ! వేంకటరాజో త్తమా ! కోరిక తీరునట్టుగా వాన కురియునా యని ప్రశ్నించుసమయమున, ఆప్రశ్నించినచోటను కొందఱు నీళ్లు పుక్కిలించుచు దప్పిచేతను నీరు త్రాగినను, నీరు మట్టినను, కాలికి బురద యంటుకొన్నను, మూత్రవిసర్జనము చేయుచున్నను సమృద్ధిగా వానలు కురియును. ౧౩

చ. కలుగునె వాన యంచు నడుగం జనువేళ గజంబు కుక్షిలో
సలిలముఁ బీల్చి తుండమున సారెకు మీఁదికిఁజల్లుకొన్నఁగ
ప్పలగుమి గూసెనేని ప్రతిభాస్కరుఁ డప్పుడు పశ్చిమంబునన్
బొలిచిన వర్షముల్ గురియు బోరన వేంకట రాజ శేఖ రా!౧౪

తా. వేంకటరాజా ! వాన కురియునా అని ప్రశ్నింపఁబోవునపు డేనుఁగు కడుపులోనికి నీళ్లు పీల్చి తొండముతో మాటిమాటికిని పైకిఁ జల్లుకొనుచుండినను, కప్పలగుంపు పలుచినను, అపుడే ప్రతిసూర్యుఁడు పడమరదిక్కున నగపడినను వేగముగానే వాన కురియును. ౧౪

చ. వలయును నిప్పు లుల్కుకము వాడినతీగయు శీతలోల్ముకం
బులు మఱి పూరికప్పెరయు బొగ్గులు నాఁదగు నెన్నిదింటిలో
వల నొక పైన హస్తమునఁ బట్టుక వానలు వచ్చునే యనన్
గలుగదు వృష్టి యప్పు డనె గట్టిగ రెట్టఁడు దిట్టఁడై మహీ
జలరుహాలోచనాకుసుమసాయక! వేంకటభూమినాయకా!౧౫

తా. స్త్రీలకు మన్మథునివంటివాఁడా ! వేంకటరాజా ! వల, నిప్పులు, కొఱకంచు, వాడిపోయినతీగ, చల్లారినకొఱవి, గడ్డి, చిప్ప, లేక కపా

లము, లేక భిక్షాపాత్రము, బొగ్గులు, అనునీయెనిమిదివస్తువులలో నేదేని యొకటి చేతఁ బట్టుకొని వాన కురియునా యని ప్రశ్నించినపక్షమున. ఆసమయమున వానకురియదని దిట్టఁడయిన రెట్టఁడు గట్టిగాఁ జెప్పినాఁడు.౧౫

## గర్భర్తులక్షణము.

సీ. ఎండలు ప్రబలుట యిల బ్రీలుటయు సూర్య
పరివేషమును బండి పాఱినట్లు
గర్జిల్లుటయు మఱి ఘనముగా నుఱుముట
మంచు గాలియు నుమ్మగించుటయును
సన్నపువానయుఁ జలియును నివి పది
వివరింప వర్షధాతువులు మఱియు
నధికాతపము వాయు వహిమాంశుపరిధియు
మేఘనిర్ఘోషంబు మెఱయుటయును
తే. గీ. ననఁగ నివి పంచధాతువు లండ్రు కొంద,
ఱిట్టిధాతువు లెసఁగిన హెచ్చుగాను
వృష్టి గురియును బహుసస్యవితతు లెల్లఁ,
జాల ఫలియించు వేంకటక్ష్మాతలేంద్ర! ౧౬

తా. వేంకటరాజా! ఎండలు మెండుగాఁ గాయుట, భూమి పగులుట, సూర్యునిచుట్టును గుడికట్టుట, బండి పరుగెత్తినట్లుగా మేఘములు గర్జించుట, మఱియును గొప్పగా ఉఱుములు గలుగుట, మంచుపడుచుండుట, గాలి వీచుచుండుట, ఉక్కగా నుండుట, తుంపరవానపడుట, చలి అను నీపదియును ఆలోచింపఁగా వర్షధాతువులు. ఇంతేకాదు హెచ్చుగా నెండలుగలుగుట, గాడ్పులు వీచుట, సూర్యునిచుట్టును గుడికట్టుట, మేఘములుఱుముచుండుట, మెఱపులు మెఱయుచుండుట అనునివి పంచధాతువులని కొందఱందురు. ఇటువంటి ధాతువు లధికమయినయెడల హెచ్చుగా వానలు కురియును. అనేకవిధములయిన పైరులు హెచ్చుగా ఫలించును.౧౬

సీ. దినరాజు మూలర్క్షమునకు వచ్చిన దాది
  గను సప్తమం బైన దినమునందు
నెన్నంగఁ దొంబదియేడవదినమునఁ
  బరివేష మెసఁగినఁ బరఁగ బదియు
మూఁడవ వాసరంబున నూటముప్పది
  యేడవదినమున నింద్రధనువు
నమరినఁ బదునెన్మిదవనాఁడు నూటెన్మి
  దవదివసంబునయందు మెఱపు

తే. గీ. నలువదేడవనాఁట వానయును నూట,
  నలువదేడవదినమున జలధరంబుఁ
  జెలఁగెనేనియు గర్భంబు నిలుచుటకును,
  లక్షణం బది వేంకటాద్రిక్షితీంద్ర ! ౧౭

తా. వేంకటరాజా ! సూర్యుఁడు మూలనక్షత్రమునందుఁ బ్రవేశించి నది మొదలుకొని, యేడవరోజునను తొంబదియేడవరోజునను, సూర్యునిచుట్టుచ గుడికట్టినను, పదుమూఁడవదినంబునను నూటముప్పదియేడవదినమునందును, ఇంద్రధనుస్సు కనుపట్టినను, పదునెన్మిదవదినమునను, నూటయెనిమిదవ దినమునందును మెఱసినను, నలువదియేడవదినమునందు వానయును, నూట నలువదియేడవనాఁడు మబ్బులు నగపడినను, మేఘములకు గర్భము నిలిచిన దని తెలిసికొనుటకు గుర్తు.

క. తగ మూలతార యాదిగ,
మృగశిరయందనుక గర్భబుతువు లగుం ద
న్మృగశీర్షార్ధము మొదలుగ,
నాగి వానలు వచ్చు వేంకటోర్వీరమణా! ౧౮

తా. వేంకటరాజా! మూలనక్షత్రమున సూర్యుఁడు ప్రవేశించినది మొదలుకొని మృగశీర్షనక్షత్రమున సూర్యుఁడు ప్రవేశించువఱకును అనఁగా మూలకార్తెమొదలు మృగశీర్షకార్తెవఱకును గర్భఋతువు లగును. మృగశిర కార్తె సగ మయినది మొదలుకొని వానలు కురియుచుండును. ౧౮

సీ. పరికింపఁ బ్రథమగర్భర్తులగ్నంబునఁ
క్రూరగ్రహంబులు గూడి యున్న
నుదయించుచుండిన నొనరఁ జూచుచునున్నఁ
గుజభాను లిరువురుఁ గూడియున్నఁ
దొలఁగక యవియె చంద్రునిఁ గూడి యుండిన,
నావేళ నుత్పాత మైనఁ జెడును
ఆలగ్నమందు రెండవభాగమునఁ దద్గ్ర
హంబు లుండిన గర్భ మమరియుండు
తే. గీ. గణన మీఁదఁ దృతీయభాగమున నున్న,
నరయ నీమూఁడుభాగంబులందు నున్నఁ
బోవుఁ దద్గర్భ మీక్రమంబుననె యెల్ల,
తారలకుఁ జూడు మనె రెట్టధన్యుఁ డిలను,
మహితగుణసాంద్ర! వేంకటమహిపచంద్ర! ౧౯

తా. ఒప్పుచుండెడి గుణములచేతను దట్టమయినవాఁడా! వేంకట రాజా! పరీక్షింపఁగా, మొదటిగర్భఋతువులగ్నమునందు క్రూరగ్రహములు కలసి యున్నను, ఉదయమును పొందినను, లేక చూచుచున్నను, అంగార కుఁడును సూర్యుఁడును కలసియుండినను, ఆరెండుగ్రహములును చంద్రునితోఁ గలసియుండినను, ఆదినము ఉత్పాత మయినను ఆగర్భము చెడును. ఆలగ్న మునందలి రెండవభాగమునందు పైగ్రహము లుండినయెడల నాగర్భము ప్రకాశించుచుండును. లెక్కపెట్టి చూడఁగా మూఁడవభాగమునం దున్నను, ఆలోచింపఁగా పైనఁ జెప్పఁబడిన మూఁడుభాగములయందును క్రూరగ్రహము

లుండినపక్షమునను ఆగర్భము నిలువదు. ఈప్రకారముగానే అన్నినక్షత్రములకును చూచుకోవలసిన దని రెట్టపండితుఁ డన్నాఁడు. ౧౯

క. తరణి ధనుర్మకరంబులఁ,
జరియించినఁ దూర్పుదెసను జలదము మెఱపుల్
హరిచాప ముఱుముఁ గలిగిన,
విరివిగ గర్భర్తు వమరు వేంకటనృపతీ! ౨౦

తా. వేంకటరాజా! సూర్యుఁడు ధనూరాశియందును, మకరరాశి యందును, సంచరించునపుడు తూర్పున మేఘము, మెఱపు, ఇంద్రధనుస్సు, ఉఱుములును గలిగినయెడల గర్భఋతువు నిలుచును. ౨౦

తే. గీ. ఒనర ఘటమీనముల శని యుండునపుడు,
ధనదదిశ మారుతము మేఘమును మెఱపును
గలిగెనేనియు గర్భర్తు వలరు సంద్రు,
వేంకటనృపాల! సంతతవిజయశీల! ౨౧

తా. ఎప్పుడును విజయమే స్వభావముగాఁగల వేంకటరాజా! కుంభరాశియందును, మీనరాశియందును శనిసంచారము గలిగినపుడు, ఉత్తరదిక్కున గాలి, మేఘము, మెఱపును గలిగినపక్షమున గర్భఋతువు ఒప్పుచుండు నని పెద్ద లందురు. ౨౧

తే. గీ. మేషవృషభంబులను బద్మమిత్రుఁ డున్న,
మెఱపు పరివేషమును వాన యుఱుము నింద్ర
ధనువు మేఘంబు గలిగినఁ దగ ఫలించు,
గర్భఋతు వుర్విమీఁద వేంకటనృపాల! ౨౨

తా. వేంకటరాజా! మేషరాశియందును, వృషభరాశియందును సూర్యుఁ డుండినసమయమున మెఱపులు, సూర్యపరివేషము, వాన, ఉఱుములు, ఇంద్రధనుస్సు, మేఘములు గలిగియుండినపక్షమున భూమిమీఁదను గర్భఋతువు చక్కఁగా ఫలించును. ౨౨

తే. గీ. మిథునకర్కటకములందు మిహిరుఁ డున్న,
వాన గురిసిన మఱి పునర్వసువునందు
వర్ష మెసఁగినఁ బంటలు వఱలు వసుధ,
వేంకటనరేంద్ర! సత్కళావిజితచంద్ర! ౨౩

తా. మంచికళల (విద్యల) చేతను చంద్రుని జయించినవాఁడా! వేంకటరాజా! మిథునరాశియందును, కర్కటకరాశియందును సూర్యుఁ డుండఁగా వర్షము కురిసినను, పునర్వసునక్షత్రమున సూర్యుఁ డుండఁగా వాన గురిసినను, భూమియందు లెస్సగా పంటలు పండును. ౨౩

సీ. సింహకన్యలయందు శీతాంశుఁ డున్నను
వానలు గురియును వఱలుఁ బంట
లల తులావృశ్చికములయందు నినుఁ డున్నఁ
గొలఁదిగా వానలు గురియుచుండు
హీనంబు లగుఁ బంట లెండు మెట్టపొలాలు
తపనుండు వృశ్చికధనువులందుఁ
దనరంగ నాదశధాతువు లుండినఁ
గర్ణాటకమున నగ్గలము పంట
తే. గీ. సారిది దశధాతువులు నిట్లు చూడ గర్భ,
మరినను మూలతారక యాదిగాఁగ
ఱసినను నూటతొంబదెన్మిదిదినముల,
వృష్టి గురియును గొండ్రాజువేంకటేంద్ర! ౨౪

తా. గొండలరాజుగారి వేంకటరాజా! సింహరాశియందును, కన్యారాశియందును చంద్రుఁ డుండఁగా వానలు కురియును. పంటలు లెస్సగాఁ బండును. తులారాశియందును, వృశ్చికరాశియందును సూర్యుఁ డుండినచో, వానలు స్వల్పముగాఁ గురియును, పంటలు తగ్గిపోవును. మెఱకపొలములు బొత్తిగా నెండిపోవును. వృశ్చికరాశియందును, ధనూరాశియందును సూర్యుఁ

డుండఁగా, వెనుకటి గర్భర్తులక్షణపుఁబద్యమునందుఁ జెప్పఁబడిన పదిధాతువులును ఉండినపక్షమున, కర్ణాటకదేశమునందు పంటలు పుష్కలముగాఁ బండును, క్రమముగాఁ బదిధాతువులును ఈలాగునఁ జూడఁబడఁగా గర్భము గలిగిన మూలనక్షత్రము మొదలుకొని నూటతొంబదియెనిమిది దినముల తర్వాత వాన కురియును. ౨౪

ఆ. వె. తలఁచి చూడ నిట్టిదశధాతువులును గ,
లిగినను గ్రహబలంబు లేకయున్న
నాలుగునెలలమీఁద నాలుగునాళ్ళకు వాన,
గురియు వేంకటాద్రినరవరేణ్య! ౨౫

తా. వేంకటరాజా! ఆలోచించి చూడఁగా, ఇటువంటి పదిధాతువులును కలిగి యున్నప్పటికిని గ్రహములబలము చాలనిపక్షమున, ఆఱునెలలపైన మఱియాఱుదినములకు అనఁగా నూటయెనుబదియాఱు దినములకు వాన కురియును. ౨౫

క. ధర మార్గశీర్షమునఁ దుం,
పరవానయుఁ బౌషమునను వాతాతపముల్
బెరసిన ముందర వర్షము,
గురియుర్ వేంకటనరేంద్ర! గురునయసాంద్రా! ౨౬

తా. బృహస్పతివంటి నీతిచేతను దట్టమయినవాఁడా! వేంకటరాజా! మార్గశీర్షమాసమునందు తుంపరగా వాన గురిసినను, పౌషమాసమునందు గాలి యెండలు విస్తారముగా నుండినయెడలను రాఁగలయేఁట బాగుగా వానలు కురియును. ౨౬

సీ. అల మార్గశీర్షంబునం దాదిదినమున
నెలవంటి రేఖలు నింగియందు
నుండ నాపున్నమ నుఱుములు మేఘంబు
మెఱపు నుండిన నాఁడె మిహిరచంద్రు-

లలఘుప్రకాశులై యలరినఁ గలుగును
మీఁదట వాన సమృద్ధి గాఁగ
నాకృష్ణపక్షమునందలిపాడ్యమిఁ,
దెల్లని రేఖలు దివి నమరినఁ
తే. గీ. గురియుఁ బంచమియాలోన గొప్పవాన,
యయ్యమావాస్య స్వాతి శశాంకుఁ డున్నఁ
గలుగు ముందటియాశ్లేష కార్తెయందు,
వృష్టి కొండ్రాజుతిమ్మయ వేంకటేంద్ర! ౨౭

తా. కొండ్రాజుతిమ్మరాజుగారి వేంకటరాజా! మార్గశీర్ష శుద్ధ ప్రతిపద్దినమున చంద్రునివంటిరేఖ లాకాశమునం దుండినను, మార్గశీర్ష పూర్ణిమనాఁడు ఉఱుములు, మేఘములును, మెఱపులును ఉండినను, ఆదినముననే సూర్యుఁడును, చంద్రుండును గొప్ప ప్రకాశము గలవారై యుండినను రాఁగలసంవత్సరమున వానలు లెస్సగాఁ గురియును. మార్గశీర్ష కృష్ణపక్షమునందలి పాడ్యమినాఁడు తెల్లనిరేఖ లాకాశమున హెచ్చుగా నుండినపక్షమున, ఆపంచమిలోపలనే పెద్దవాన కురియును. అమావాస్య స్వాతియందును చంద్రుఁ డుండినను ముందఱ సంవత్సరమునందలి యాశ్లేష కార్తెలో వర్షము కురియును. ౨౭

క. భువిఁ బౌషశుద్ధసప్తమిఁ,
బవనము మిం చుఱుము మంచుఁ బర్విన వర్షం
బవిరళముగఁ గురియుఁ జుమీ,
వివిధగతిం దిమ్మరాజువేంకటనృపతీ! ౨౮

తా. తిమ్మరాజుగారి వేంకటరాజా! పౌషశుక్లసప్తమినాఁడు గాడుపు, మెఱపులు, ఉఱుములు గల్గి మంచు వ్యాపించినపక్షమున ముందర సంవత్సరమునఁ బలువిధములుగా విస్తారమయిన వానలు కురియును. ౨౮

తే. గీ. పౌషమున రోహిణిని జాలఁ బరిధి గట్టి,
మంచు గలిగిన నాషాఢమాసమందు
వృష్టి గురియును ధాత్రి సంతుష్టి గాఁగ,
విభవదేవేంద్ర! కొండ్రాజు వేంకటేంద్ర! ౨౯

తా. విభవమునందు దేవేంద్రునివంటివాఁడా! కొండలరాజుగారి వేంకటరాజా! పౌషమాసమునందు రోహిణీనక్షత్రమునాఁడు సూర్యపరివేషము కట్టి, మంచు పడినపక్షమున ముందటి సంవత్సరమునందలి యాషాఢమాసమునందు భూమికి సంతుష్టి కలుగునట్లు వానలు గురియును. ౨౯

చ. పొలుపుగఁ బౌషమాసమునఁ బున్నమయాదిగ సప్తవాసరం
బుల కలధాతువుల్ పది సముజ్జ్వలలీలఁ దనర్చెనేని భూ
వలయములోన మీఁదట నవశ్యమువానలు గల్గియుండి పై
రులు ఫలియించు సత్కువిసరోజదివాకర! వేంకటేశ్వరా! ౩౦

తా. మంచికవీశ్వరు లనియెడిపద్మములకు సూర్యుఁడా! వేంకటరాజా! పౌషపూర్ణిమ మొదలుకొని యేడుదినములకు వెనుకఁ జెప్పిన పది వర్షధాతువులును మిగులఁ బ్రకాశించునట్లొప్పినపక్షమున భూమియందు ముందటిసంవత్సరమునఁ దప్పకుండ వానలు గురిసి సస్యములు ఫలించును. ౩౦

ఆ. వె. పౌషమాసశుద్ధపౌర్ణమినాఁడు రే,
సంజకడను మంచు సంఘటిలినఁ
బంట గలుగుఁ జాలఁ బరఁగఁ గర్ణాటభూ,
వీర! తిమ్మరాజు వేంకటేంద్ర! ౩౧

తా. కర్ణాటభూమియందలివీరుఁడా! తిమ్మరాజుగారి వేంకటరాజా! పౌషపూర్ణిమనాఁడు రాత్రి సంధ్యావేళను మంచు పడినయెడల ముందటి సంవత్సరమున సమృద్ధిగాఁ బంటలు పండును. ౩౧

తే. గీ. పౌషబహుళాష్టమిని స్వాతి పరఁగు వేళ,
గర్జితము మించు మంచును గలిగెనేనిఁ

జెలఁగ మీఁదటఁ బంటలు సిద్ధ మగును,
వినువు కొండ్రాజుతిమ్మయవేంకటేంద్ర! 3౨

తా. కొండరాజుతిమ్మరాజుగారి వేంకటరాజా! వినుము. పౌషకృష్ణాష్టమినాఁడు స్వాతీనక్షత్ర మెప్పినసమయమున ఉఱుములు, మెఱపులు, మంచును కలిగినపక్షమున మఱుచటిసంవత్సరమునఁ బంటలు సిద్ధించును— అనఁగా చక్కఁగాఁ బండును. 3౨

సీ. అలజ్యేష్ఠమాసంబునం దాదిదివసంబు
మొదలుగాఁ బదిదినములకు వాన
గురిసినఁ గార్తెలఁ గురియదు వర్షంబు
చినుకక యుండినఁ జెలఁగు వాన
శ్యామవర్ణంబున నరుణవర్ణంబున
వరుసఁ బాండరగౌరవర్ణములను
గనుపట్టి మేఘసంఘంబులు నడచిన
జగతీసురుల్ నృపుల్ చాల నొచ్చి
తే. గీ. శూద్రవృత్తిఁ జరింతురు క్షోణిప్రజలు,
సంతతంబును మిగులఁ గ్లేశములచేతఁ
గలహములచేత నొత్తు రక్కజము గాఁగ
భువినిఁ బీడింపఁబడుదురు పోసఁగఁ జాల,
ననియె రెట్టఁడు విను వేంకటావనీశ! 33

తా. తిమ్మరాజుగారివేంకటరాజా! జ్యేష్ఠప్రతిపత్తిథి మొదలుకొని పదినాళ్లకు వాన కురిసినయెడల, ఆసంవత్సరపుకార్తెలలో వాన కురియదు. చినుకులు పడకయుండినపక్షమున చక్కఁగా వర్షించును. ఆదినములలో మేఘములు చామనచాయగను, ఎఱ్ఱనికాంతిగలవిగను, తెలతెల్లగాను పచ్చపచ్చగాను ఉండినను, గౌరవర్ణముగాను కనుపడి నడచినపక్షమునన బ్రాహ్మణులును, రాజులును హెచ్చుగా నొచ్చుటయే కాక శూద్రులవృత్తివంటి

వృత్తులుగలవారై ప్రవర్తింతురు. భూమియందలియితరజనులు సర్వకాలమం దును మిక్కిలి కష్టములచేతను, కలహములచేతను ఆశ్చర్యముగా నొత్తురు. చాలవఱకుఁ బీడింపఁబడుదురు. అని రెట్టన్న లోకప్రసిద్ధముగా నన్నాఁడు.

## మేఘలక్షణము.

వ. మఱియు మధువర్ణం బైన మేఘమండలంబు మధుమేఘం బనం బరఁగు నది పంచదశయోజనవిస్తీర్ణం బై యుండు నందు ద్రోణపరిమిత వర్షంబు గలుగుఁ గపిలవర్ణం బైనమే ఘంబు మరున్మండలం బనంబడు నది ద్వాదశయోజన విశాలం బై యుండు నందును వాయువు ప్రధానం బయిన వర్షంబు సంభవించు నని కొందఱు పల్కుదురు. గర్భర్తు సమయంబున మేఘంబు మధువర్ణంబై యుండెనేనియు గ్రహవక్రత్వంబు గలిగియుండెనేని ఖండవర్షంబగు గ్రహవక్ర త్వంబు లేనియెడల నామేఘంబు ద్రోణసంఖ్య వర్షించుఁ ద ద్ద్రోణసంఖ్య యెట్టి దనఁ బదియాఱుమానిక లొక్కతూ మును నటువంటివి నాల్గుతూములైన నొక్కద్రోణంబుననం బడు గ్రహబలంబు గలిగెనేని వర్షంబు గురియు రాజులేని రాష్ట్రంబునుంబోలె గ్రహబలంబు లేకున్నయెడల వర్షంబు గలుగనేరదు. తదనంతరంబ మేఘలక్షణము వివరించెదము.

తా. ఇంకను వినుము. తేనె లేక కల్లురంగుగల మేఘమండలము మధుమేఘం బని చెప్పఁబడును. ఆమేఘము పదునైదుయోజనములవైశా ల్యముగలదయి యుండును. అది ద్రోణము పరిమాణముగల (నాల్గుతూముల) వాన గురియును. కపిలవర్ణము గల మేఘము మరున్మండల మనఁగా వాయు మండల మని చెప్పఁబడును. ఆమేఘము పండ్రెండామడ వైశాల్యము గలిగి యుండును. అందును వాయువు ప్రధాన మయినపక్షమున వాన గురియును. అని కొందఱమతము. గర్భఋతువు కలిగినపుడు పైనఁజెప్పినట్లు మధువర్ణము

గలదిగా నున్నను, గ్రహములు వక్రములై యుండినపక్షమునను వర్షము ఖండముగాఁ గురియును. గ్రహములవక్రత లేనిపక్షమున, ఆ మేఘము ద్రోణపరిమితి గల వాన గురియును. ఆద్రోణపుఁగొలత యెట్టి దనఁగా, పదునాఱుమానిక లొక్కతూము, అటువంటివి నాలుగుతూము లయినపక్షమున, ఒక్కద్రోణ మని చెప్పఁబడును. గ్రహములబలము పూర్ణముగా నున్నపక్షమునఁ దప్పక వానలు గురియును. రాజులేనిరాష్ట్రమువలెనే గ్రహములబలము లేకయుండినపక్షమున వాన గురియక చెడిపోవును. ఇంకను మేఘముల స్వరూప మెట్టు లందు వేని వివరముగాఁ జెప్పెదము వినుము. ౩౪

క. జలదము లేనుఁగులవలెఁ,
నలుదిక్కులయందు మిగుల నల్లఁగ నున్నఁ
బొలుపుగ వానలు గురియును,
విలసత్ప్రతిభాకలాప ! వేంకటభూపా ! ౩౫

తా. ప్రకాశించుచున్నబుద్ధివిశేషమే అలంకారముగాఁ గలవాఁడా ! వేంకటరాజా ! మేఘము లేనుఁగులరీతిని నాలుగుదిక్కులయందును, అనఁగా నాకసమునం దంతటను మిక్కిలి నల్లఁగా నుండినపక్షమున సమృద్ధిగా వానలు గురియును. ౩౫

క. మందగతి మొగులు మృగముల,
యందంబునఁ గరులరీతి నాకస మంతన్
గ్రందుకొని మెలఁగ వర్షం,
బందముగా వచ్చు వేంకటాధిపవర్యా! ౩౬

తా. వేంకటరాజోత్తమా ! మేఘములు మందగమనముగలవి యయి మృగములవలెను, ఏనుఁగులలాగునను నలుదిక్కులయందును వ్యాపించియుండిన పక్షమున, చక్కఁగా వాన గురియును. ౩౬

క. తళుకు తళుక్కున మెఱయఁగ,
నల గగనము గప్పు తెల్లనగు మేఘ మిలా

స్థలిఁ గలయంగ వర్షించును,
హరిబల! కొండ్రాజువేంకటాధిపతిలకా! ౩౭

తా. సింహముబలమువంటిబలముగలవాఁడా! కొండరాజుగారి వేంకటాద్రిరాజా! మెఱుపులు తళుక్కు తళుక్కు మని మెఱయుచుండఁగా, ఆకసమున దట్టముగాఁ గ్రమ్మియున్న తెల్లని మేఘము భూమి కరఁగిపోవునట్టుగా వర్షించును. ౩౭

చ. అమరఁగ నట్టినీలవిశదాంబుధరంబులలో మెఱుంగు తా
మ్రమువలె దాసనంపువిరిమాడ్కి రహించినయేని రాజమే
ఘములనుసంజ్ఞనొంది యవిగంగయు వింధ్యము మేరగాఁగవ
ర్షము గురియుం ధరాస్థలి నిజంబిది తిమ్మయవేంకటాధిపా!

తా. తిమ్మరాజుగారి వేంకటరాజా! ఒప్పునట్లు నీలమువలెఁ బ్రకాశించు మేఘములలోపలను, మెఱుపులు రాగిరంగుగాను, మంకెనపుష్పము చందమునను ప్రకాశించిన ట్లయినపక్షమున, ఆమేఘములు రాజమేఘములనుపేరు గలవి యయి యవి గంగానదియు, వింధ్యపర్వతములును మేర యగు భూమియందుఁ జక్కఁగా వర్షించును. ఈమాట నిజము. ౩౮

తే. గీ. అగ్గివన్నెలమేఘంబునందు గొప్ప,
మెఱపు మెఱసిన మిగుల సమృద్ధి గాఁగ
వింధ్యముననుండి గౌతమి వెడలఁ గలుగు,
వృష్టి కొండ్రాజుతిమ్మయవేంకటేంద్ర! ౩౯

తా. కొండ్రాజు తిమ్మరాజుగారి వేంకటరాజా! మేఘములయందు నిప్పుల కాంతివంటి కాంతిగల గొప్పమెఱపులు మెఱసిన పక్షమున, వింధ్యకును గోదావరీనదికిని మధ్యను మిక్కిలి సమృద్ధిగా వానలు కురియును. ౩౯

చ. నలినమురీతి నుండెడుఘనంబు గణింపఁగ విప్రజాతి యిం
పలరఁగ నెఱ్ఱనైనమొగు లారయక్షత్రియజాతి యంతయుం

నలు పగునట్టివారిదము నాలవజాతి య టంద్రు కోవిదుల్
బలరిపుభోగ! సంతతకృపానిధి! తిమ్మయవేంకటాధిపా! ౪౦

తా. ఇంద్రునివంటి భోగములు గలవాఁడా! ఎడతెగనిదయకు నిధియైనవాఁడా! తిమ్మరాజుగారి వేంకటరాజా! తామరపుష్పమువంటి రంగుగల మేఘు మాలోచింపఁగా బ్రాహ్మణజాతిమేఘ మనియును, మిగుల నెఱ్ఱఁగా నుండు మేఘము లాలోచింపఁగా క్షత్రియజాతి మేఘము అనియు, సర్వమును నల్లఁగానున్న మేఘము శూద్రజాతిమేఘము అనియును పండితులు చెప్పుదురు. ౪౦.

తే గీ. వసుధ వర్షించుఁ బుష్కలావర్తకంబు,
లనెడుజలదంబు లద్భుతం బావహిల్ల,
ఖండవర్షంబు లితరమేఘములు గురియు,
ధీరజనగణ్య! వేంకటాధిపవరేణ్య! ౪౧

తా. పండితులచేత నెన్నఁబడినవాఁడా! వేంకటరాజోత్తమా! పుష్కలావర్తకంబు లని ప్రసిద్ధి కెక్కిన మేఘము లాశ్చర్యము గలుగునట్టుగా భూమియందు వర్షించును. అవిగాక మిగిలిన మేఘములు ఖండవర్షములు గురియును. ౪౧

వ. మఱియుఁ జామరంబులచందంబునఁ గొలంకులయందంబునఁ జెఱువుల చెలువంబున మంటపంబుల క్రమంబునఁ గుంభికుంభంబులబాగున మొసళ్ళలాగున వెండికొండలరీతిని సింహంబులభాతిని గోపురంబుల యొప్పునఁ జంద్రబింబంబుల చొప్పున శృంగారరథంబుల కరణిని దేవవిమానంబులసరణిని గొడుగులవడువున నెత్తులచాడ్పున రాక్షసులమాడ్కిని కుంజరంబుల పోల్కిని వృషభంబులవిధంబున శంఖంబుల సోయగంబున భాసిల్లు మేఘంబులు వర్షించు నదియునుంగాక. ౪౨

తా. ఇంకను వినుము రాజా! వింజామరలవలెను, కొలంకులవలెను, చెఱువులవలెను, మండపములలాగునను, ఏనుఁగుల కుంభస్థ[illegible]ము సళ్లవలెను, వెండికొండలరీతిని, సింహములవలెను, గోపురముల యాకారమునను, చంద్రబింబంబులవలెను, శృంగారవనములభంగిని, దేవతల విమానములవలెను, గొడుగులవలెను, కత్తులవలెను, రాక్షసులవలెను, ఏనుంగులవలెను, ఎడ్లచందమునను, శంఖములలాగునను ప్రకాశించునట్టి మేఘములు చక్కఁగా వర్షించును. ఇంతే కాదు—ఇంకను వినుము. ౪౨

ఆ. వె. కాకి నక్క క్రోఁతి కాటుకకొండ కుం,
దేలు మోడుమ్రాను శూల మెలుఁగు
విడిచిపోయినిండ్లవడువున మొగు లున్న,
వృష్టి కొంచె మండ్రు వేంకటేంద్ర! ౪౩

తా. వేంకటరాజా! కాకివలెను, కోఁతివలెను, కాటుకకొండవలెను, చెవులపిల్లివలెను, మ్రోడయినవృక్షమువలెను, శూలమువలెను, ఎలుఁగుబంటివలెను, కాఁపురముండక విడిచిపోఁగా పాడయిన యిండ్లవలెను మేఘము లుండినపక్షమున వానలు కొంచెముగాఁ గురియునని పెద్దలుచెప్పుదురు. ౪౩

తే. గీ. క్రొత్తగోరోజనం బింద్రగోపపురువు,
కటికినెత్తురు నింగిలీకమ్మువన్నె
లలరి మొగు లున్న వాన లే దనియె రెట్టఁ
డఖిలశాస్త్రార్థవిదు లెల్ల నభినుతింప,
వినుతగుణసాంద్ర! తిమ్మయవేంకటేంద్ర! ౪౪

తా. కొనియాడఁబడిన మంచిగుణములచేతను నిండారినవాఁడా! తిమ్మరాజుగారి వేంకటరాజా! క్రొత్తదియయిన గోరోజనమువలెను, ఆరుద్ర పురుగులవలెను, అప్పుడు నఱకఁగా వచ్చినరక్తమువలెను, ఇంగిలీకమురంగునను ప్రకాశించు మేఘము లున్నపక్షమున, అన్నిశాస్త్రములయందలి యర్థముల నెఱిఁగినవా రందఱును కొనియాడునట్టుగా రెట్టఁ డనుపండితుఁడు వాన కురియ దని చెప్పినాఁడు. ౪౪

సీ. అరుణమేఘం బైన నల్ప మై యున్నట్టి
తుంపరవానయే పెంపు లేదు
మెఱపు గన్పింపఁగా మేఘముల్ కొండల
మీఁద రేపును మాపు మేయుచున్న
వర్షముల్ గురియును వరుసతో వాయవ్య
దిశయందు నీశాన్యదిక్కునందు
మేఘంబు లుఱిమిన మెఱపుతో నుండినఁ
గలుగును వృష్టి యగ్గలము గాఁగ
తే. గీ. నెంచి చూడంగ ధాత్రిలో నిది వరాహ,
మిహిరమత మండ్రు కోవిదుల్ మిహిర తేజ!
ధీర! కొండలతిమ్మపార్థివకుమార!
జన్యజయసాంద్ర! వేంకటక్ష్మాతలేంద్ర! ౪౫

తా. సూర్యుని తేజస్సువంటి తేజస్సుగలవాఁడా! ధైర్యముగలవాఁడా! కొండలరాజుగారి తిమ్మరాజుకుమారా! యుద్ధములయందు లభించిన జయములచే నధికుఁడా! వేంకటభూమీశ్వరా! అరుణవర్ణముగల మేఘము పట్టినయెడల, చాల కొంచెముగా నున్నటువంటి తుంపరవానయే. కాని సమృద్ధిగా వానకురియదు. మేఘములు మెఱపు లగపడునట్టుగా కొండల మీఁదను ప్రొద్దున, సాయంకాలమునను మేయుచున్న పక్షమున సమృద్ధిగా వానలు గురియును. వాయుదిక్కునందు, మేఘము లుఱిమినను, ఈశాన్య దిక్కునందు మెఱపులతో నుండినను సమృద్ధిగా వర్షించును. ఆలోచించి చూడఁగా భూమియం దీపైనఁ జెప్పినది వరాహమిహిరాచార్యుని మతమని పండితులు చెప్పుదురు. ౪౫

తే. గీ. భానుఁ డుండంగఁ దూర్పునఁ బశ్చిమమున,
మెఱసినను పైఁడివన్నెల మేఘ మున్న

వాన గురియును ధరణి నవ్వారి గాఁగ,
దిమ్మభూపాలవేంకటాద్రిక్షితీంద్ర ! ౪౬

తా. తిమ్మరాజుగారి వేంకటరాజా ! సూర్యుఁడు తూర్పున నుం డఁగా పడమరదిక్కున మెఱపులు మెఱసినను, బంగారురంగుగల మేఘములు కనుపట్టినను సమృద్ధిగా వాన గురియును. ౪౬

క. పెనుమఱ్ఱిమ్రాఁకురీతిని,
గనుపట్టిన మొగులుమీఁదఁ గాంచనవర్ణం
బొనరిన మేఘము దోఁచిన,
విను వానలు వచ్చు మిగుల వేంకటనృపతీ ! ౪౭

తా. వేంకటరాజా ! పెద్దమఱ్ఱిచెట్టులాగున నగపడుచున్న మేఘము మీఁదను బంగారురంగుగల యింకొక మేఘ మగపడియెనేని సమృద్ధి యగునట్లు వాన కురియును. ౪౭

వ. మఱియును బూర్వాషాఢను బదుమూఁడు ద్రోణంబులు గురిసినఁ బంటలు గలుగు నందుఁ గడమ యైనఁ బంటలు గడమ యై యుండు నుత్తరాషాఢను బండ్రెండు ద్రోణంబులు గురిసిన వరిపంటలు గలుగు వెలిపైరు లల్పంబులగును జ్వరబాధలు గలుగు శ్రవణనక్షత్రంబున మొదటనే పదునాలుగు ద్రోణంబులు గురిసిన బ్రాహ్మణులకు హాని పుట్టు రాజన్యుల కక్కడక్కడ నన్యోన్య కలహంబులు ఘటిల్లు ధనిష్ఠను బదునాలు ద్రోణంబులు గురిసినఁ దటాకంబులకు భయంబు వాటిల్లు శతతారను బదునాలుగు ద్రోణంబులు గురిసిన శిశువులకుఁ గొఱగాదు పూర్వభాద్రను బది ద్రోణంబులు గురిసిన వైశ్యులకు సుంత హాని గల్గు నుత్తరభాద్ర నెనిమిది ద్రోణంబులు గురిసిన మృగభయ మధికమగు రేవతిని బదుమూఁడు ద్రోణంబులు గురి

సిన మహిషములకు సంతుష్టి యగ్గలంబు మఱియు నశ్వినిని దొమ్మిది ద్రోణంబులు గురిసినఁ దురంగంబులకు వృద్ధి వాటిల్లు భరణి నేడు ద్రోణంబులు గురిసిన నగ్నిభయం బాపాదిల్లుఁ గృత్తిక నాలు ద్రోణంబులు గురిసిన శూద్రులు వృద్ధి నొందుదురు రోహిణిని బది ద్రోణంబులు గురిసిన నిక్షుసస్యంబులు వృద్ధి నొందును మృగశీర్షమునఁ బదునొకండు ద్రోణంబులు వర్షించిన రక్తధాన్యములు ఫలించు నార్ద్ర నైదు ద్రోణంబులు గురిసిన శాకవర్గంబులు వృద్ధి యగుఁ బునర్వసువున నిరువది ద్రోణంబులు గురిసిన మేలుగాఁ బాలు పిండు భూమిని సస్యంబులు చెలంగు రోగంబులునుం గలహంబులునుం గలిగి యుండుఁ బుష్యనక్షత్రంబునఁ బదునైదు ద్రోణంబులు గురిసిన భూనాథులకు వ్యాధులు సంభవించు వసుధావలయంబు దుర్భిక్షరహితం బై మించు నాశ్లేషను బదుమూఁడు ద్రోణంబులు గురిసినఁ బ్రజలు వ్యాకులత్వంబుం బొందక సంతసంబునం బ్రవర్తిల్లుదురు పాలకులు ప్రమోదంబున వర్ధిల్లుదురు మఘ నిరువది ద్రోణంబులు గురిసినఁ బ్రజలు భయవిరహితు లై దేవపితృపూజా తత్పరు లై చెలంగుదురు పూర్వఫల్గుని నిరువదిమూఁడు ద్రోణంబులు గురిసిన జనులు సద్వినయ సంపన్ను లై చెలంగుదురు సస్యములు ఫలియించుఁ జిచ్చు బాధలు హెచ్చు నుత్తరఫల్గుని నిరువదియేడు ద్రోణంబులు గురిసిన భూభుజులును బ్రజలును సుఖవసతి జీవింతురు హస్తనక్షత్రమునఁ బదునాలుద్రోణంబులు వర్షించిన భూసురులు రాజవరులు ధర్మప్రవృత్తు లై తేజరిల్లుదురు చిత్త నధికంబుగ మారుతంబువీచిన భయంబు లుద్భవిల్లు స్వాతిని

బదిద్రోణంబులు గురిసిన భూప్రజలు సుఖస్థితి నుండుదురు
విశాఖను బది ద్రోణంబులు గురిసిన భూసురులును రాజు
లును స్వధర్మప్రవర్తకు లగుదు రనూరాధను బదునాల్గు
ద్రోణంబులు గురిసిన రాజులచే రాజ్యంబులు పాలింపంబడి
యొప్పు జ్యేష్ఠను బదునేడు ద్రోణంబులు గురిసినఁ జోరభ
యంబులు గలిగి పంటలపరిమితంబై యుండు మరణంబు
లగ్గలం బగు మూలను బదునాల్గు ద్రోణంబులు గురిసిన
రాజులు దుర్జనులై తిరుగుదురు ప్రజల కాపద లౌదవు నని
రెట్టఁడు నిశ్చయించె. ౪౮

తా. వేంకటరాజా! ఇంకను చెప్పెదము వినుము. పూర్వాషాఢా నక్షత్రమునాఁడు పదుమూఁడు ద్రోణములవాన కురిసిన పక్షమున పంటలు పండును. అందు వాన తక్కువయైనచో, పంటలును తక్కువ యైయుండును. ఉత్తరాషాఢయందుఁ బన్రెండు ద్రోణములవాన గురిసినపక్షమున వరిపంట పండును. తక్కినపయిరులు కొంచెముగాఁ బండును. దొంగలవలన బాధలు గలుగును. శ్రవణనక్షత్రమునాఁడు మొదటనే పదునాలుగుద్రోణములవాన గురిసినపక్షమున బ్రాహ్మణులకుఁ గీడు గలుగును. అక్కడక్కడ రాజులకుఁ బరస్పరము కలహములు సంభవించును. ధనిష్ఠానక్షత్రమునఁ బదునాఱు ద్రోణములవాన గురిసెనేని చెఱువులకు భయము సంభవించును. శతభిషఙ్నక్షత్రమునఁ బదునాలుగు ద్రోణములవాన కురిసినచో, శిశువులకు మంచిది గాదు. పూర్వభాద్రానక్షత్రమునఁ బదిద్రోణములవాన గురిసినయెడల వైశ్యుల కంత మంచిది గాదు. ఉత్తరభాద్రానక్షత్రమున నెనిమిదిద్రోణములవాన గురిసినచో మృగభయ మెక్కువ యగును. రేవతీనక్షత్రమునం బదుమూఁడు ద్రోణములవాన గురిసినచో, ఎనుములు చాల సంతసించును. అశ్వినీనక్షత్రమునఁ దొమ్మిదిద్రోణములవాన గురిసినచో గుఱ్ఱములు బాగుగా వృద్ధిని పొందును. భరణినక్షత్రమున నేడుద్రోణములు వాన గురిసిన యెడలఁ బ్రజల కగ్నిభయము గలుగును. కృత్తికానక్షత్రమున నాఱుద్రో

ణములవాన గురిసిన శూద్రులు వృద్ధిగల్గి యుందురు. రోహిణీనక్షత్రమునఁ బదిద్రోణములవాన గురిసినచోఁ జెఱకుతోఁటలు చక్కఁగాఁ బెరుఁగును. మృగశీర్షనక్షత్రమునఁ బదునొకండు ద్రోణములవాన గురిసినయేని నెల్లధాన్యములు చక్కఁగా ఫలించును. ఆర్ద్రానక్షత్రమున నైదుద్రోణములవాన గురిసినయెడల కాయగూరలు సమృద్ధిగా ఫలించును. పునర్వసునక్షత్రమున నిరువది ద్రోణములవాన గురిసిన పక్షమున నాలమందలు లెస్సగాఁ బాలిచ్చును. సస్యంబులు చక్కఁగా ఫలించును. జనులకు రోగంబులును, కలహంబులును గలుగును. పుష్యనక్షత్రమునఁ బదునైదు ద్రోణములవాన గురిసినచో రాజులకు వ్యాధులు గలుగును. భూమియందుఁ గఱవు లేక యుండును. ఆశ్లేషనక్షత్రమునఁ బదుమూఁడు ద్రోణములవాన గురిసినయెడలను ప్రజలు వ్యాకులపాటు లేక సంతోషముతోఁ బ్రవర్తింతురు. పాలించు ప్రభువులును సంతోషముగల్గి వృద్ధి నొందుదురు. మఘానక్షత్రంబున నిరువది ద్రోణములవాన గురిసిన పక్షమునఁ బ్రజలు భయము లేనివారై దేవతలను పితృదేవతలను పూజించుటయం దాసక్తి గలవారయి ప్రకాశించుచుందురు. పుబ్బనక్షత్రమున నిరువదిమూఁడు ద్రోణంబులవాన గురిసినచో జనులు మంచివినయముతోఁ గూడినవారగుదురు. సస్యములు బాగుగా వృద్ధిపొందును. చిచ్చుబాధలు హెచ్చగును. ఉత్తరనక్షత్రమున నిరువదియేడుద్రోణంబులు వర్షించినచో రాజులును, ప్రజలును సుఖజీవనము గలవారగుదురు. హస్తనక్షత్రమునఁ బదునాల్గు ద్రోణంబులవాన గురిసిన బ్రాహ్మణులును, క్షత్త్రియులును ధర్మమార్గమునఁ బ్రవర్తించుచున్నవారయి ప్రకాశించుదురు. చిత్రానక్షత్రమునాఁ డధికముగా గాలి వీచినపక్షమునఁ బ్రజలకు భయము లధికమగును. స్వాతీనక్షత్రమునఁ బదిద్రోణంబుల వాన గురిసినచో భూమియందలిప్రజలు సుఖముగల్గి యుందురు. విశాఖానక్షత్రమునఁ బదిద్రోణంబులవాన గురిసినచో, బ్రాహ్మణులును, రాజులును తమతమధర్మముల నాచరించుచు, ఆచరింపఁజేయుచుఁ బ్రవర్తింతురు. అనూరాధా నక్షత్రమునఁ బదునాల్గు ద్రో

ణములవాన గురిసినయెడల రాజులు తమరాజ్యంబులను చక్కఁగాఁ బరిపాలింపుచుందురు. జ్యేష్ఠానక్షత్రమునఁ బదునేడుద్రోణములవాన గురిసెనేని దొంగలవలన భయము గలుగును. పంట లధికముగాఁ బండును. ప్రజలు విస్తారముగ మరణింతురు. మూలనక్షత్రమునఁ బదునాలుగు ద్రోణములవాన గురిసినయెడల రాజులు దుర్మార్గు లయి ప్రవర్తింతురు. ప్రజల కాపదలు గల్గు నని రెట్టపండితుఁడు నిశ్చయముగాఁ జెప్పియున్నాఁడు. ౪౮

—(*) విద్యుల్లక్షణము. (*)—

సీ. పంచవర్ణంబుల మించు చూపట్టిన
జనసంతతికి సంతసంబు గలుగు
నేనువన్నెలును బ్రత్యేక మై మెఱసిన
వాయువు విసరును వాన యొసఁగు
నెఱ్ఱనిమెఱు పయ్యె నేని వర్షము వచ్చుఁ
గలహంబు వుట్టు భూతలమునందు
నట నెఱ్ఱమెఱుపులో నపరంజిచాయలు,
గానిపించినయేని వాన గురియు
దిరిసెనపుంబూవువరుసను ములుకపు
వ్వమురీతిఁ బున్నమచంద్రునట్లు

తే. గీ. మెఱసెనేనియు వానలు మిగులఁ బ్రబలు,
భూజనంబులు పరితుష్టిఁ బొందు చుందు
రవని సద్గుణులకును గౌరవము గల్గుఁ
గవిజనచకోరచంద్ర! వేంకటనరేంద్ర! ౪౯

తా. ఇటుపయిని మెఱపులలక్షణము చెప్పఁబడును. కవీశ్వరు లనియెడి చకోరపక్షులకుఁ జంద్రుఁడా! వేంకటరాజా! మెఱపు లయిదు రంగులతో మెఱసినపక్షమున జనులకు సంతోషము గలుగును. ఆరైదు

రంగులుచు వేఱువేఱుగా నగపడునట్లు మెఱసినయెడల గాలి వీచును వాన హెచ్చుగాఁ గురియును. మెఱ పెఱ్ఱగా మెఱసినచో వాన గురియును భూమియందలి జనులకుఁ గలహములు గలుగును. అట్టియెఱ్ఱని మెఱపునందు బంగారురంగు కనుపట్టిన యెడల వాన కురియును. దిరిసెన పూవువలెను, వాఁకుడు పూవువలెను, పున్నమచంద్రమామవలెను మెఱపులు మెఱసిన పక్షమున హెచ్చుగా వానలు గురియును. భూమియందలిజనులు సంతోషమును పొందుచుందురు. భూమియందు మంచిగుణములు గలవారికి గౌరవము గలుగును. ౪౯

తే. గీ. పొగతెఱంగున భసితంబుపోల్కి మెఱపు,
గానిపించినఁ దడవులఁ గలుగు వాన
లెన్నఁగలమించు నెత్తురువన్నె యైనఁ,
గలహ మౌ నని రెట్టనకవివరుండు.
సరసగుణధామ! వేంకటసార్వభౌమ! ౫౦

తా. సరసము లయిన గుణములకు స్థాన మయినవాఁడా! వేంకటరాజేంద్రా! మెఱపులు పొగవలెను, బూడిదరంగుతోను గనుపట్టిన యెడలను, ఆలస్యముగా వానలు గురియును. పొగడఁదగినయా మెఱపు నెత్తురురంగు గలదియైనచో, కలహములు గలుగు నని రెట్టకవి యన్నాఁడు. ౫౦

క. జ్వలన యమ నిర్రృతి మరుదా,
శల మెఱసిన వాన లేదు సరవి నితరది
క్కుల మెఱయ వాన గురియును,
విలసన్మతి! తిమ్మరాజువేంకటనృపతీ! ౫౧

తా. ప్రకాశించుబుద్ధిగలవాఁడా! తిమ్మరాజుగారి వేంకటరాజా! అగ్నిమూలను, దక్షిణదిక్కునను, నిర్రృతిమూలను, వాయుమూలను మెఱసిన పక్షమున వాన కురియదు. కడమదిక్కుల ననఁగా, తూర్పునను, పడమరను ఉత్తరమునను, ఈశాన్యమూలను మెఱసినచో వాన గురియును. ౫౧

తే. గీ కపిలవర్ణంపు మెఱపున గాలి విసరు,
నెక్కువగ నెఱ్ఱ మెఱపున నెండ గాయుఁ
దెలి మెఱుంగున వఱపౌను గలదు వాన,
విను పసుపువన్నె మెఱపున వేంకటేంద్ర! ౫౨

తా. వేంకటరాజా! కపిలవర్ణముగ మెఱసినచో గాలి వీచును. మిక్కిలి యెఱ్ఱగా మెఱసిన యెడల నెండలు మెండుగాఁ గాచును. తెల్లఁగా మెఱసినచో దుర్భిక్షము గలుగును. పసపురంగుగా మెఱసిన పక్షమున వాన గురియును. దీనికి మూల శ్లోక మిట్లున్నది.

"వాతాయ కపిలా విద్యు దాతపాయాతిలోహినీ,
పీతా వర్షాయ విజ్ఞేయా దుర్భిక్షాయాసితా భవేత్".

ఈ శ్లోకమున, నల్లఁగా మెఱసినయెడల కఱవు కలుగు నని యున్నది. ౫౨.

—(*) గర్జితలక్షణము. (*)—

ఉ. పాతెడుబండిమ్రోఁతగతిఁ బందులు చెల్వుగ రొప్పు రీతి వే
సారక గార్దభం బఱచుజాడను ఘంటలనాదు కైవడిన్
వారక తోముకుండలరవంబుగతిన్ స్తనితంబు పర్విన్
ధారుణి వాన లేదనియె ధన్యుఁడు రెట్టఁడు వేంకటప్రభూ!

తా. వేంకటరాజా! పరుగెత్తుచుండెడి బండియొక్క చప్పుడువలెను, పందులు మూల్గుచున్నట్లును, గాడిద యఱచినట్లును, గంటలు వాయించిన చప్పుడువలెను, కుండలు తోమునప్పటిచప్పుడువలెను ఉఱుము లుఱిమినపక్షమున భూమియందు వానకురియదని ధన్యుఁడయినరెట్టకవి యన్నాఁడు. ౫౩

—(*) ఇంద్రధనుర్లక్షణము. (*)—

సీ. వానకాలమున భాస్వంతుండు గ్రుంకిన
వెనుకఁ జీఁకటి పర్వువేళయందు

వాయుదిక్కున నగ్నివర్ణంబుతో నగ
భేదిచాపము గానిపించేనేని
యావర్ణముననె సుధాంశుమండల మున్న
మహిమండలంబున మానవులును
క్షితినాథులును గారుచిచ్చుచేఁ గాలుదు
రద్భుతం బడర నాహరిధనుస్సు
తే. గీ. పచ్చ నై యున్నఁ బ్రజలకు బాధ పుట్టుఁ,
దెల్ల నై యున్నఁ జెడు సర్వదేశములును
బూని యీకీడు దాఁకక మాన దెపుడు,
ననియె రెట్టసుకవి వేంకటావనీశ! ౫౪

తా. వేంకటరాజా! వర్షాకాలమునందు సూర్యుఁ డస్తమించిన తరువాతను చీఁకట్లు వ్యాపించుసమయమున వాయుమూలను ఇంద్రధనుస్సు నిప్పులవంటికాంతితో నగపడినను, అట్టికాంతితోనే చంద్రబింబ ముండినను భూమండలమునందు ప్రజలును, రాజులును కారుచిచ్చుచేతను కాలిపోవుదురు. ఆశ్చర్యము కలుగునట్టుగా నాయింద్రధనుస్సు పసపువన్నె గలదియై యగపడినయెడలఁ బ్రజలకు బాధలు గలుగును. అది తెల్లగా నగపడినచో నన్నిదేశములును చెడిపోవును. ఎప్పటికిని ఈకీడు తగులక మాన దని రెట్టఁడనుకవి పూని పలికియున్నాఁడు. ౫౪

ఆ. వె. పసుపుపచ్చ యాకుపచ్చ నల్పును దెల్పు,
నెఱుపువన్నియల మహేంద్రచాప
మున్న మొగులు నట్టు లున్నఁ బంటలు గల్గు
వినుము తిమ్మరాజువేంకటేంద్ర! ౫౫

తా. తిమ్మరాజుగారి వేంకటరాజా! ఇంకను వినుము. పసపుపచ్చగాను, ఆకుపచ్చగాను, నల్లగాను, తెల్లగాను, ఎఱ్ఱగాను—అనఁగా నన్నిరంగులుగలిగి యింద్రధను స్సుండఁగా మేఘములుగూడ నన్నిరంగులతోఁ గనుపట్టినయెడలఁ బంటలు లెస్సగాఁ బండును. ౫౫

క. హరిహయచాపము నిశయం,
దరుదుగ నేదిశను దోఁచు నాదిక్కు బ్రజల్
వెరవు చెడి పోదు రనియెను,
గుఱుతుగ రెట్టఁడు సమస్తకోవిదు లెంచన్. ౫౬

తా. రాత్రివేళ నింద్రధను స్సాశ్చర్యము గలుగున ట్లేదిక్కున నగపడునో ఆదిక్కున నున్నప్రజ లేవిధ మయినయుపాయమును లేక చెడిపోవుదు రని యెల్లపండితులును కొనియాడునట్లుగా రెట్టఁ డన్నాఁడు. ౫౬

క. దొరఁకొని రాతిరి వర్షము,
గురియఁగఁ బురుహూతధనువు కువలయబంధుం
డరుణ మగుమెఱుపుఁ దోఁచిన
ధరణీశులు నొత్తు రనియెఁ దగ రెట్టఁడిలన్. ౫౭

తా. ప్రారంభించి రాత్రివేళ వాన గురియుచుండఁగా నింద్రధనుస్సును, చంద్రుఁడును, ఎఱ్ఱనిమెఱపును గనుపడినయెడల రాజులు నొత్తు రని రెట్టఁ డనినాఁడు. ౫౭

తే. గీ. పగలు వర్షింప మెఱపు చూపట్టి యింద్ర,
ధనువు పశ్చిమముననుండి దక్షిణాశ
దనుకఁ దూర్పుననుండి యుత్తరపుదిశకుఁ,
గదసినను మేలు ప్రజకు వేంకటనరేంద్ర! ౫౮

తా. వేంకటరాజా! పగలు వాన గురియుచుండఁగా మెఱపులు కనుపడి యింద్రధనుస్సు పడమరనుండి దక్షిణదిక్కువఱకును, తూర్పుదిక్కుననుండి యుత్తరపుదిక్కువఱకును వ్యాపించినచోఁ బ్రజకు మేలు గలుగును.

క. వావిరి జ్యేష్ఠాషాఢ,
శ్రావణములఁ గొరదు వరుణుచక్కటిఁ బొడమఁగ
లే వనె వానలు రెట్టం,
డీవసుధను దిమ్మవసుమతీశకుమారా! ౫౯

తా. తిమ్మరాజుగారి కుమారుఁడ వయిన వేంకటరాజా! క్రమముగా జ్యేష్ఠమాసమునందును, ఆషాఢమాసమునందును, శ్రావణమాసమునందును ఇంద్రధనుస్సు పడుమటిదిక్కున నగపడినయెడల నీభూమియందు వానలు గురియ వని రెట్టఁ డన్నాఁడు. ౫౯

పరివేషలక్షణము.

చ. వెలయఁగ సూర్యచంద్రపరివేషములచ్చుపుఁబైఁడిచాయలన్
బలుపగు వానకాలమునఁ బర్విన వర్షము వచ్చు నింపు సొం
పలరఁగ నన్యకాలమున నైనను బుట్టును రాజకార్యముల్
కలుషవిదూర! తిమ్మమహికాంతుని వేంకటరాజశేఖరా! ౬౦

తా. పాపములకు దూరముగా నుండువాఁడా! తిమ్మరాజుగారి వేంకటరాజా! సూర్యపరివేషమును, (గుడి) చంద్రపరివేషమును స్వచ్ఛమయిన బంగారుకాంతులు ప్రకాశించునట్లు వర్షాకాలమునందుఁ గనుపడినయెడల వాన గురియును. వానకాలమునఁ గాక యితరసమయములయందుఁ గనుపట్టిన యెడల రాజకార్యములు పుట్టును. అనఁగా రాజులకు యుద్ధములు మొదలగు పనులు గలుగును. ౬౦

క. ఇనశశిపరివేషంబులు,
ఘనరహితము లగుచు వానకాలమునందుం
గనుపట్టినఁ గల నయినను,
విను వానలు లేవు నిజము వేంకటనృపతీ! ౬౧

తా. వేంకటరాజా! వినుము. వర్షాకాలమున మేఘములు లేకుండఁగనే సూర్యునకును, చంద్రునకును గుడి కట్టినయెడలఁ గలలో నయినను వానలు కురియవు. ఈమాట నిజము. ౬౧

క. ప్రావృట్కాలమునను మే,
ఘావళితోఁ గూడ శశికి నహిమాంశునకున్
భావింపఁ బరిధు లుండిన,
వేవేగ మె కురియు వాన వేంకటనృపతీ! ౬౨

తా. వేంకటరాజా! వర్షాకాలమున మేఘములతోఁ గూడఁ జంద్రునకును, సూర్యునకును గుడి కట్టినట్టయిన వేగముగానే వాన కురియును. ౬౨

ఆ. వె. వానతఱిని జంద్రవనజబాంధవులకు,
రెండుమూఁడుపరిధు లుండెనేని
వాన గల్లు లెస్స వాన లేకుండిన,
నృపులు నొత్తు రనియె రెట్టఘనుఁడు. ౬౩

తా. వర్షాకాలమునఁ జంద్రునకును, సూర్యునకును రెండుగాని, మూఁడుగాని గుళ్లు కట్టినపక్షమున లెస్సగా వాన కురియును. అట్లు వాన కురియనిచో రాజులు నొత్తు రని రెట్టఁ డన్నాఁడు. ౬౩

ఉ. ఎంతయు వానకాలమున హేళికిఁ జుక్కలరాచవానికిన్
వింతగ రెండుమూఁడుపరివేషము లెద్దెసఁ గానిపించినన్
రంతులు గాంతు రాదిశధరావరు లాపరిధుల్ సితప్రభా
వంతము లయ్యెనేని మఱి వర్షము లే దనె రెట్టఁ డిమ్మహిన్.

తా. వర్షాకాలమునందు సూర్యునకును, చంద్రునకును ఆశ్చర్యకరముగా రెండుగాని, మూఁడుగాని గుళ్లు, ఏదిక్కున నగపడిన ఆదిక్కుననుండెడిరాజులు బాధలఁ బొందుదురు. ఆకట్టినగుళ్లు తెల్లనికాంతి గలవి యయినపక్షమున భూమిపయిని వానలు గురియ వని రెట్టఁ డన్నాఁడు. ౬౪

సీ. వివరింప శశిపరివేషంబులో బృహ
స్పతి యున్నఁ గొఱగాదు బ్రాహ్మణులకు
ననిమిషకులశాత్రవాచార్యుఁ డుండిన
వర్షంబు గురియు నవశ్యముగను
గువలయాప్తునితనూభవుఁ డున్న హాని యా
నర్భకశ్రేణుల కద్భుతముగ
నంగారకుం డున్న నందందుఁ దఱచుగాఁ
బోరులు గలుగును ఘోరముగను

తే. గీ. జండకిరణునినందనుం డుండెనేనిఁ,
బట్టభద్రులు నొత్తురు గట్టిగాను
వసుధలో నిది గా దన వలవ దంద్రు,
కవిజనచకోరచంద్ర! వేంకటనరేంద్ర! ౬౫

తా. కవీశ్వరు లనియెడి చకోరములకుఁ జంద్రుఁడా! వేంకట రాజా! ఆలోచింపఁగా, చంద్రునికిఁ గట్టినగుడిలో బృహస్పతి యనఁగా గురుఁడున్నపక్షమున బ్రాహ్మణులకు మంచిది గాదు. దేవతలకు శత్రువు లయిన రాక్షసులకు గురు వయినశుక్రుఁ డుండినపక్షమునఁ దప్పక వాన గురి యును. కలువలకుఁ జుట్టమయినచంద్రునికొడుకు బుధుఁ డున్నపక్షమున నాశ్చర్యకరముగా శిశువులకుఁ గీడు గలుగును. కుజుఁ డుండిన పక్షమున నక్కడక్కడఁ దఱచుగా భయంకరము లయినయుద్ధములు తటస్థించును. సూర్యునికొడుకయిన శని యుండినపక్షమున రాజ్యాభిషిక్తులు గట్టిగా నొచ్చినవా రగుదురు. పయిప్రకారముగ నున్నపక్షమున భూమియం దిపుడు చెప్పినఫలములు కలుగ వని చెప్పఁగూడ దని పెద్ద లందురు. అనఁగా అట్లుండినచో ఆఫలములు కలిగియే తీరును. ౬౫

క. హరిణాంకునిపరివేషం,
బరుణం బై యుండ నందు నర్కజకుజులున్
గురుఁడు వసించినఁ బ్రజలకు,
నరు దగునాపదలు గల్గు నని రెట్టఁ డిలన్. ౬౬

తా. చంద్రునిగుడి యెఱ్ఱనై యుండఁగా నందులో సూర్యునికొడు కయిన శనియు, భూమికొడు కయిన యంగారకుఁడును, గురుఁడును ఉండిన పక్షమున జనులకు మిక్కిలి యాశ్చర్యకరములయిన యాపదలు తటస్థించు నని రెట్టఁ డన్నాఁడు. ౬౬

ఆ. వె. చంద్రుఁ డస్తమించుసమయంబునందు న,
య్యరుణపరిధిలోన గురుఁడుఁ గుజుఁడు

శనియు నుండిరేని సార్వభౌములు నొత్తు,
రనియె రెట్టసుకవి హర్ష మెసఁగ. ౬౭

తా. చంద్రుఁ డస్తమించువేళను అట్టి యెఱ్ఱని గుడిలోపల గురుఁడును, అంగారకుఁడును, శనియును ఉండినట్లయినఁ జక్రవర్తులు నొత్తు రని రెట్టఁ డను మంచికవీశ్వరుఁడు సంతస మధికమగునట్లుగా నన్నాఁడు. ౬౭

క. హిమకరుఁడు గ్రుంకఁ బరివే,
షములో గురుఁ డున్నఁ గాదు జగతికి శుక్రుం
డమరఁగ నుండిన బోయలు,
సమయుదు రనె రెట్టఁ డఖిలశాస్త్రజ్ఞుఁ డిలన్. ౬౮

తా. చంద్రుఁడు క్రుంకుచుండఁగా నతని పరివేషములోపల గురుఁడుండినపక్షమున భూమికి మంచిది కాదు. శుక్రుఁ డుండినపక్షమున బోయలను తెగవారు చచ్చిపోవుదు రని భూమియందు నెల్లశాస్త్రముల నెఱిఁగినవాఁడు రెట్టఁ డన్నాఁడు. ౬౮

## ప్రతిసూర్య లక్షణము.

సీ. ఊహింపఁ బ్రతిసూర్యుఁ డుత్తరదిశయందుఁ
బ్రభవించెనేని వర్షంబు గలుగు
నొగి యామ్యదిక్కున నుదయించినను గాలి
ప్రబలంబుగా వీచుఁ బశ్చిమమునఁ
బొడమెనేనియు వాన జడిపట్టి కురియును
హర్షంబు నొందుదు రఖిలజనులు
ప్రాగ్భాగమునను జూపట్టిన బహువృష్టి
యొసఁగియుండును భీతి హెచ్చుఁ బ్రజకుఁ
తే. గీ. బద్మజునుభాషితంబునఁ బరఁగునట్టి,
శాస్త్ర మీక్షించి యిటు లనె పరసు లెన్నఁ

గలితవాక్ప్రౌఢి రెట్టనకవివరుండు,
విపులకారుణ్య! వేంకటనృపవరేణ్య! ౧౯

తా. విస్తారమయిన దయగలవాఁడా! వేంకటరాజా! ఆలోచింపఁగా ప్రతిసూర్యుఁ డుత్తరదిక్కునం దుదయించిన పక్షమున వాన గురియును. దక్షిణదిక్కునం దుదయించినయెడల మిక్కిలి బలముగా గాలి వీచును. పశ్చిమదిక్కునం దుదయించినచో జడివర్షములు కురియును. ఎల్లవారును సంతోషమును పొందుదురు. తూర్పుదిక్కున నుదయించెనేని అధిక వర్షములు కురియును. ప్రజలకు భయము లధికము లగును. బ్రహ్మదేవుని మంచిమాటలచేతను ఒప్పుచున్నట్టి (అనఁగా బ్రహ్మదేవునిచేతను చెప్పఁబడిన) శాస్త్రమునుచూచి సరసులు కొనియాడునట్టులు ఒప్పుచుండెడి వాక్చాతుర్యముగల రెట్టన్నయను కవీశ్వరుఁ డన్నాఁడు. ౧౯

చ. జ్వలనకృతాంతరాక్షసదిశాస్థలులం బవనంబు వీవఁ గే
వలమును లేవు వర్షములు వారుణదిక్కున నల్పవృష్టియౌ
నల యితరాశలం గలుగ నత్యధికంబుగ వాన నిశ్చయం
బలఘుజయాఢ్య! తిమ్మవసుధాధిపు వేంకటరాజశేఖరా! ౨౦

తా. అధికమయిన జయములచేతను ఒప్పినవాఁడా! తిమ్మరాజుగారి వేంకటరాజా! ఆగ్నేయదిక్కుననుండియు, దక్షిణదిక్కున నుండియు, నిరృతిదిక్కుననుండియును, గాలి వీచినపక్షమున బొత్తిగా వానలు కురియవు. పశ్చిమదిక్కుననుండి గాలి వీచినయెడలఁ గొంచెము వాన కురియును. కడమ దిక్కులనుండి యనఁగా, తూర్పుననుండియు, వాయు మూలనుండియు, ఉత్తరదిక్కుననుండియు, ఈశాన్యమూలనుండియు గాలి వీచిన పక్షమున మిక్కిలి హెచ్చుగా వానలు కురియును. ఇది నిశ్చయము. ౨౦

శా. స్వర్ధామప్రభువాహ దంతి హరి గీర్వాణద్రుశాఖా సుధా
వార్ధి గ్లా హలభృత్తు పారశిఖరి వ్యాళేంద్ర కుందావళీ

స్పర్ధాళుప్రథమానకీర్తిసుషమాసంఛాదితాజాండ ! శ్రీ
గీర్ధాత్రీవనితాసమాశ్రితలసద్గేహాస్వబాహ్వర్గళా ! ౭౧

తా. స్వర్గస్థానమునకుఁ బ్రభువయిన యింద్రునిగుఱ్ఱమయిన యుచ్చైశ్శ్రవముతోను, దంతి యనఁగా, ఐరావతముతోను, హరి యనఁగా సింహముతోను, దేవతలవృక్షము లనఁగాఁ గల్పవృక్షములకొమ్మలతోను, పాలసంద్రముతోను, చంద్రునితోను, బలరామునితోను, మంచుఁగొండతోను, పాములరా జయినయనంతునితోను మల్లిపూవులసమూహముతోను జయింత మని పట్టుదలపట్టుచున్నదై (అనఁగాఁ బయిని చెప్పఁబడిన తెల్లనిపదార్థములవలె నున్నదై) ప్రసిద్ధి కెక్కుచున్నకీర్తియొక్క గొప్పశోభచేతను కప్పఁబడిన బ్రహ్మాండముగలవాఁడా ! (అనఁగా నితనికీర్తి బ్రహ్మాండమున నంతటను నిండి నిబిడీకృత మయి యున్నదనుట.) లక్ష్మి సరస్వతి భూమి అనెడిస్త్రీల చేతను ఆశ్రయింపఁబడినదై ప్రకాశించుచున్న యింటికిఁ దనబాహువులే గడియలుగాఁ గలవాఁడా ! (అనఁగా నితనియింటియందు లక్ష్మీసరస్వతులును, రాజ్యలక్ష్మియు, నున్నా రనియు, ఆయింటనుండి బయటికిఁ బోవకుండఁ దలుపులకు గడియలవలెనే తనబాహువు లడ్డుచుండు ననియు భావము.) ౭౧

తోటకము చరణానతశాత్రవ! సత్త్వగుణా,
భరణా! పరిపాలితబాంధవ! భూ
భరణాహివరేణ్య! కృపానిధి! శౌ
ర్యరమాశ్రిత ! సత్కవిరాజనుతా ! ౭౨

తా. పాదములమీఁదను బడినశత్రువులు గలవాఁడా ! సత్త్వమనెడి గుణమే అలంకారముగాఁ గలవాఁడా ! లెస్సగాఁ బాలింపఁబడిన బంధుజనులు గలవాఁడా ! భూభారమును భరించుటయందు శేషునివంటివాఁడా ! దయకు నిధియైనవాఁడా ! శౌర్యలక్ష్మిచేత నాశ్రయింపఁబడినవాఁడా ! మంచికవీశ్వరులచేతను కొనియాడఁబడినవాఁడా ! ౭౨

# తృ తీ యా శ్వా స ము.

క. శ్రీయువతివ రాహోబల,
నాయక పాదాబ్జసేవనస్థిరకీర్తి!
శ్రీయుత! సముదంచితపు,
ణ్యాయతి! కొండ్రాజువేంకటాద్రినరేంద్రా! ౧

తా. లక్ష్మి యనెడి స్త్రీకి భర్తయయిన—అహోబలనరసింహస్వామి యొక్క పాదపద్మములను సేవించుటచేతను శాశ్వతమయినకీర్తిగలవాఁడా! సంపదతోఁ గూడియున్నవాఁడా! ఒప్పుచుండెడి పుణ్యమును, ఉత్తరకాల వృద్ధియును గలవాఁడా! కొండరాజుగారి వేంకటరాజా! ౧

—(*) బీజావాపలక్షణము. (*)—

తే. గీ. హస్త మృగశీర్ష మఘలయం దాధనిష్ఠ,
రేవతీతార నుత్తరాత్రితయమునను
ధరణి విత్తిన ధాన్యముల్ దగ ఫలించు,
నిశ్చయం బిది వేంకటనృపవరేణ్య! ౨

తా. హస్తనక్షత్రమునందును, మృగశీర్షనక్షత్రమునందును, మఘానక్షత్రమునందును, ధనిష్ఠానక్షత్రమునందును, రేవతీనక్షత్రమునందును, ఉత్తరఫల్గునీనక్షత్రమునందును, ఉత్తరాషాఢానక్షత్రమునందును, ఉత్తరభాద్రానక్షత్రమునందును భూమియందు విత్తనములు చల్లినపక్షమున నవి చక్కఁగా ఫలించును. వేంకటరాజా! ఈమాట నిశ్చయము. ౨

తే. గీ. రూఢి పుష్య పునర్వసు రోహిణులను,
మహిని విత్తిన వరియుఁ జామయును నెసఁగు
నరయ మూలర్క్షమున విత్తినట్టిపైరు,
లన్నియు ఫలించు నని రెట్టఁ డవనినాథ! 3

తా. పుష్యనక్షత్రమునందును, పునర్వసునక్షత్రమునందును, రోహిణీనక్షత్రమునందును, భూమియందుఁ జల్లిన వడ్లును, చామలును సమృద్ధిగాఁ బండును. మూలనక్షత్రమునఁ జల్లినధాన్యము లన్నియును ఫలించు నని వేంకటరాజా! రెట్టఁ డన్నాఁడు. ౩

సీ. అశ్వినిఁ బుబ్బఁ బూర్వాషాఢ నార్ద్రఁ బూ
ర్వాభాద్ర విత్తినఁ బ్రత్తి చెలఁగు
శతతారయందు విశాఖను విత్తినఁ
గందమూలేక్షువుల్ గడు ఫలించు
రహి మీఱ శ్రవణతారకయందుఁ జల్లినఁ
జెన్నంగివరి ఫలసిద్ధిఁ జెందుఁ
దాంబూలవల్లి యుత్తరయందు నాటినఁ
బ్రబలుచు నుండు నపారముగను

తే గీ. కృత్తికను హస్తతారను విత్తినట్టి,
సెనగ విలసిల్లు ధరణిని జనులు దనియ
భరణి విత్తిన గోదుమల్ ఫలిత మగును,
తిమ్మభూపాలు వేంకటాద్రిక్షితీంద్ర! ౪

తా. తిమ్మరాజుగారి వేంకటరాజా! అశ్వినీనక్షత్రమునాఁడును, పుబ్బనక్షత్రమునాఁడును, పూర్వాషాఢానక్షత్రమునాఁడును, ఆర్ద్రానక్షత్రమునాఁడును, పూర్వభాద్రానక్షత్రమునాఁడును, ప్రత్తివిత్తులు నాటినపక్షమున నవి మొలచి చక్కఁగాఁ బెరిఁగి ప్రత్తి బాగుగాఁ బండును. శతభిషఙ్నక్షత్రమునాఁడును, విశాఖానక్షత్రమునాఁడును నాటఁబడిన (భూమిలోపలఁ బెరుఁగు) దుంపదినుసులును, చెఱకుతోఁటలును లెస్సగా ఫలించును. సంతోష మొప్పునట్లు శ్రవణనక్షత్రమునాఁడు మొలవవేసిన చెన్నంగి యనెడివడ్లు చక్కఁగాఁ బండును. ఉత్తరఫల్గునీనక్షత్రమునాఁడు తములపాకుతీగలు నాటినయెడల హద్దు మితి లేకుండ నవి పెరుఁగును. కృత్తికానక్షత్రమునాఁ

డును, హస్తనక్షత్రమునాఁడును చల్లిన సెనగలు భూమియందలిజనులు తృప్తిని బొందులాగునఁ బ్రకాశించు ననఁగా హెచ్చుగాఁ బండును. భరణినక్షత్రము నాఁడు నాటినయెడల గోదుమలు ఫలించును. అనఁగా నాయానక్షత్రము నాఁ డాయాగింజలు నాటవలె ననుట. ౪

తే. గీ. సెనగ పుబ్బను విత్తినఁ జెడును మఱియు,
నార్ద్ర విత్తినఁ దెవులుచే నణఁగిపోవుఁ
జిత్త విత్తిన వేవేగఁ జెఱుచు మిడత,
లనియె రెట్టఁడు సకలవిద్యావిదుండు. ౫

తా. పుబ్బనక్షత్రమునాఁడు సెనగవిత్తనములు చల్లినపక్షమున, ఆపంట పండక చెడిపోవును. ఆర్ద్రానక్షత్రమునాఁ డవి చల్లినయెడల నేదేని జబ్బు తగిలి యాచేను పెరుఁగక చెడును. చిత్తనక్షత్రమునాఁడు సెనగవిత్తనములు నాటినచో నాపైరు నతివేగముగ మిడుతలు తినివేయును. ఇట్లని వేంకటరాజా ! రెట్టఁ డన్నాఁడు. ౫

సీ. జగతిని గోదుమల్ మృగశీర్ష తారను
విత్తిన మృగము లుద్వృత్తిఁ దినును
జ్యేష్ఠను విత్తిన సిద్ధింప దాపంట
పండినఁ జోరులపాలఁ బడును
ప్రత్తి యాశ్లేషను విత్తిన నొకపాటి
ఫల మంతె కాని యగ్గలము గలుగ
దటు గాన నక్షత్ర మరయక విత్తినఁ
బండినట్టులె యుండి బెండువోవు
తే. గీ. శతభిషక్తారయందు విశాఖయందు,
నగిసె మునుగయు విత్తిన నెగడనీక
పుర్వు వట్టును మిగుల నద్భుతము గాఁగ,
ననియె రెట్టఁడు సకలవిద్యావిదుండు. ౬

తా. వేంకటరాజా ! భూమియందు మృగశీర్షనక్షత్రమునాఁడు చల్లినగోదుమ పంటను మృగములు తృప్తిగాఁ దినిపోవును. అవి జ్యేష్ఠానక్షత్రమునాఁడు చల్లినను పంట పండవు. ఒకవేళఁ బండినను ఆపంట దొంగలపా లగును. ఆశ్లేషనక్షత్రమునఁ బ్రత్తివిత్తనములు నాటినచో కడు స్వల్పముగానే ఫలించును గాని ఫలింపవలసినంతగా ఫలింపదు. కాఁబట్టి నక్షత్రము మంచిదో కాదో ఆలోచింపక విత్తనములు వేసినపక్షమున నవి పండినట్లే యగపడి బెం డయిపోవును. శతభిషఙ్నక్షత్రమునను, విశాఖానక్షత్రమునను, అగిసె గింజలును, మునుగవిత్తనములును నాటినయెడల నాసస్యములను వృద్ధి నొందనీకుండ మిక్కిలి యాశ్చర్యముగా పురుగు పట్టి పాడుచేయు నని రెట్టకవీశ్వరుఁ డన్నాఁడు. ౬

క. క్రూరగ్రహంబు లుండిన,
తారల నుపరాగయుక్తతారలయందుం
గోరికి విత్తిన ధాన్యము,
లారయ నెవ్వియు ఫలింప వనె రెట్టఁ డిలన్. ౭

తా. క్రూరగ్రహము లున్ననక్షత్రములయందును, గ్రహణములతోఁ గూడిన నక్షత్రములయందును అక్కఅగలిగి మొలవవేసినసస్యము లాలోచింపఁగా నేవియును ఫలింప వని రెట్టఁ డన్నాఁడు. ౭

తే. గీ. అరసి చూడంగఁ బాపగ్రహంబు లున్న,
లగ్నమున వారు వీక్షించులగ్నమునను
విత్తినను లెస్స గా దనె వివిధశాస్త్ర,
నిపుణుఁ డైనట్టి రెట్టఁడు నిశ్చయముగ. ౮

తా. ఆలోచించి చూడఁగా పాపగ్రహము లున్నలగ్నమునందును, ఆపాపగ్రహములు చూచుచున్నలగ్నమునందును విత్తనములు నాటుట మంచిది గాదని సకలశాస్త్రములయందును పండితుఁ డయినరెట్టఁడు నిశ్చయముగా నన్నాఁడు. ౮

తే. గీ. లగ్నమున నైన శుక్రుఁ డాలగ్నమునకు,
సూటిగా సప్తమం బగుచోట నైన
నున్నయెడ విత్తవచ్చు నీయుర్విలోన,
నఖిలధాన్యంబులును వేంకటాద్రిరాజ! ౯

తా. వేంకటరాజా! శుక్రుఁడు లగ్నమం దుండినను, ఆలగ్నమునకు సూటిగా ఏడవయింట నుండినను భూమియం దెల్లధాన్యములును నాట వచ్చును. ౯

క. ఎన్నఁగ శశి కేంద్రంబున,
నున్నను బాపగ్రహంబు లొగి మంచివి గా
కున్నను విత్తిన ధాన్యము,
లన్నియు ఫలియించు వేంకటాధిపతిలకా! ౧౦

తా. వేంకటరాజా! ఆలోచింపఁగా చంద్రుఁడు కేంద్రస్థానంబునం దుండినను, పాపగ్రహములు మంచివి గాకున్నను వేసినసస్యము లన్నియును ఫలించును. ౧౦

సీ. ద్యుమణిచంద్రులు గూడి యున్నలగ్నంబున
నేమియు విత్తరా దెన్ని చూడ
క్షోణిపుత్త్రుఁడు గనుఁగొన్నలగ్నమ్మున
విత్తు వేసినఁ గారి వేగఁ బట్టు
లలి రాహు వీక్షించులగ్నంబునందున
వేసినఁ జీడ యూహ వేగమునను
కైరవహితుఁడు లగ్నంబున నుండంగ
వేసినయనఁటులు వెలయుఁ జాల
తే గీ. నొనర నాచంద్రలగ్నంబు నుష్ణకరుఁడు,
చూడ వేసినఁ బ్రబల వహాచుండు విధుఁడు

లగ్నమున నున్నయట్టి వేళను విత్త,
ఫలము చెన్నొందు వేంకటప్రభువతంస! ౧౧

తా. వేంకటరాజా! సూర్యుఁడును, చంద్రుఁడును కలసి యున్న లగ్నమున నాలోచించి చూడఁగా నేవిత్తనములును చల్లరా దని తెలియవలెను. అంగారకుఁడు చూచుచున్న లగ్నమునం దేవిత్తనములు చల్లినను ఆపయిరులకు వేగముగా తెవులు పట్టును. రాహువు చూచుచున్న లగ్నమునందు విత్తనములు చల్లినయెడల నా సస్యములకు వేగముగానే చీడ పట్టును. చంద్రుఁడు లగ్నమునం దుండఁగా నాటిన యరఁటి పిలుకలు హెచ్చుగా నభివృద్ధి నొందును. చంద్రుఁ డున్నయాలగ్నము నొప్పఁగా సూర్యుఁడు చూచుచుండఁగా విత్తనములు వేసినయెడల నవి ప్రబలములయి చక్కఁగా పండును. చంద్రుఁడు లగ్నమునం దుండఁగా వేసిన యెల్ల విత్తనములును చక్కఁగా ఫలించును. ౧౧

క. దిననాయకుఁ డార్ద్రకు వ,
చ్చినదినమును మొదలు గాఁగ క్షితితలమున వి
త్తిన వన్నియు ఫలియించును,
విను మది తఱి యాటఁజేసి వేంకటనృపతీ! ౧౨

తా. వేంకటరాజా! సూర్యుఁ డార్ద్రానక్షత్రమునఁ బ్రవేశించి నప్పుడు మొదలుకొని భూమియందుఁ జల్లినవిత్తనము లన్నియును, ఆసమయము చాల మంచి సమయ మగుటచేతను వృద్ధి నొంది చక్కఁగా ఫలించును. ౧౨

తే. గీ. శ్రవణతారను జల్లిన రాజనంబు,
లల్పఫల మిచ్చు నార్ద్రపుష్యముల భరణి
నల పునర్వసు రోహిణులందు మఘను,
విత్తిన ఫలించు నెంతయు వేంకటేంద్ర! ౧౩

తా. వేంకటరాజా! శ్రవణనక్షత్రమునందు చల్లినరాజనము లను నొక దినుసుధాన్యము స్వల్పముగా ఫలించును. ఆరుద్ర నక్షత్రమునందును, పుష్యనక్షత్రమునందును, భరణినక్షత్రమందును, పునర్వసు నక్షత్రమందును, రోహిణీనక్షత్రమునందును, మఘానక్షత్రమునందును నాటిన విత్తనము లన్నియు వృద్ధి నొంది చక్కఁగా ఫలించును. ౧౩

తే. గీ. స్వాతిఁ బూర్వత్రయంబున శశి వసింపఁ,
బ్రత్తి విత్తిన ఫలియించు బహుళముగను
జ్యేష్ఠ విత్తిన నసుములు చెలఁగుఁ బంట,
విజయనిస్తంద్ర! కొండ్రాజు వేంకటేంద్ర! ౧౪

తా. విజయమునందు జాగరూకతగల కొండ్రాజుగారి వేంకటరాజా! స్వాతీనక్షత్రమునందును, పూర్వఫల్గునీ (పుబ్బ) నక్షత్రమందును, పూర్వాషాఢా నక్షత్రమందును, పూర్వభాద్రానక్షత్రమునందును, ప్రత్తి గింజలు నాటవేసినపక్షమున హెచ్చుగా ప్రత్తి ఫలియించును. జ్యేష్ఠానక్షత్రమునం దనుములు చల్లినయెడల పంట హెచ్చుగా పండును. ౧౪

తే. గీ. హస్తనక్షత్రమునఁ బెస లార్ద్రి నువ్వు,
లమర నల మూలతారకయందుఁ గంది
స్థిర నమూరాధఁ బ్రత్తి విత్తిన ఫలించు,
వినుము వేంకటనృపవర్య! వినుతశౌర్య! ౧౫

తా. కొనియాడఁబడినశౌర్యముగలవాఁడా! వేంకటరాజా! హస్త నక్షత్రమున పెసరువిత్తనములును, ఆరుద్ర నక్షత్రమునందు నూవు విత్తనములును, మూలనక్షత్రమునాఁడు కందివిత్తనములును, అనూరాధానక్షత్రమున ప్రత్తివిత్తనములును నాటినపక్షమున చక్కఁగా పండును. ౧౫

క. ఇల నశ్విని యందగిసెలు,
నల పూర్వాషాఢయందు నలసందలుఁ దాఁ

దలఁ బొనగూడఁగ విత్తిన,
ఫలియించును వేంకటాద్రిపార్థివతిలకా! ౧౬

తా. వేంకటాద్రిరాజశ్రేష్ఠా! అశ్వినీనక్షత్రమునందు సెనగవిత్తనములును, పూర్వాషాఢానక్షత్రమునందు అలసందవిత్తనములును, మొలవవేసిన పక్షమున నవి చక్కఁగా ఫలించును. ౧౬

క. కోరికి నుత్తరయందు న,
నూరాధను మూల రోహిణుల రేవతిలోఁ
బైరులు పెట్టుట యుత్తమ,
మారసి చూడంగ వేంకటాద్రినృపాలా! ౧౭

తా. వేంకటాద్రిరాజా! ఆలోచించి చూడఁగా, ఉత్తరనక్షత్రమునందును, అనూరాధానక్షత్రమునందును, మూలనక్షత్రమునందును, రోహిణీనక్షత్రమునందును, రేవతీనక్షత్రమునందును విత్తనములు నాటవేయుట చాల మంచిది. ౧౭

క. మఱి యుత్తరలో రోహిణి,
వరుస ననూరాధ నంత్యవరఋక్షమునన్
ధర జొన్నపైరు పెట్టుట,
కర ముత్తమ మనెను రెట్టకవివరుఁ డధిపా! ౧౮

తా. వేంకటరాజా! ఇంకను చెప్పెదము వినుము. ఉత్తరనక్షత్రమునందును, రోహిణీనక్షత్రమునందును, అనూరాధానక్షత్రమునందును, కొసది యగు రేవతీనక్షత్రమునందును, భూమియందు జొన్నవిత్తనములు నాటుట మిక్కిలి మంచిది యని రెట్టకవి యన్నాఁడు. ౧౮

తే. గీ. అశ్విని ధనిష్ఠ శతతార యాశ్రవణము,
మఱి పునర్వసు లెంచంగ మధ్యమములు
పృథ్విలోపలఁ బైరులు పెట్టుటకును,
నిజము కొండ్రాజువేంకటనృపవరేణ్య! ౧౯

తా. కొండ్రాజుగారి వేంకటరాజా! భూమిమీఁదను విత్తనములు నాటుటకు, అశ్వినీనక్షత్రము, ధనిష్ఠానక్షత్రము, శతభిషజ్నక్షత్రము, శ్రవణ నక్షత్రము, పునర్వసునక్షత్రము మధ్యమములు. ఇది నిజము. ౧౯

తే. గీ. జ్యేష్ఠను విశాఖఁ గృత్తికఁ జిత్త నార్ద్ర,
భరణిఁ బూర్వత్రయంబునఁ బైరు లిడిన
నరసి చూడంగ నిష్ఫలం బనఁగఁ బరఁగు,
వితతజయసాంద్ర! కొండ్రాజు వేంకటేంద్ర! ౨౦

తా. విస్తారమయిన జయములతో నిండారిన కొండరాజుగారి వేంకటరాజా! జ్యేష్ఠానక్షత్రమునందును, విశాఖానక్షత్రమునందును, కృత్తికా నక్షత్రమునందును, చిత్తనక్షత్రమునందును, ఆరుద్రనక్షత్రమునందును, భరణి నక్షత్రమునందును, పూర్వఫల్గుని, పూర్వాషాఢ, పూర్వాభాద్రనక్షత్రముల యందును, ఆలోచించి చూడఁగా విత్తనములు నాటిన నిష్ఫలమని చెప్పఁ బడును. అనఁగా పైనక్షత్రములయందు నాటినవి ఫలింపవు. ౨౦

ఆ. వె. మకర సింహ వృషభ మత్స్య కర్కటరాసు,
లుత్తమంబు లందు నొగి సురేజ్యుఁ
డున్న సౌమ్యశుక్రు లున్నను మంచిది,
విత్తనమున కుర్వి వేంకటేంద్ర! ౨౧

తా. వేంకటరాజా! మకరరాశియు, సింహరాశియు, వృషభరాశియు, మీనరాశియు, కర్కటకరాశియు, విత్తనములు చల్లుటకు మంచివి. అవి చల్లునట్టిలగ్నమునందు గురుఁడుండినను, బుధుఁడును, శుక్రుఁడును ఉండినను మంచిది. ౨౧

వ. అదియునుం గాక ఛాయాపుత్త్రుం డగు శని మేషంబున వర్తింప వృషభంబున గురుం డున్నయవసరంబున ధనుర్మా సంబు మొదలు మాఘపర్యంతంబు స్వాతిమూలానురాధ లను మకర మత్స్యకర్కటరాశులను విత్తిన జొన్న లపా రంబుగా ఫలించు నని రెట్టండు నుడివె. ౨౨

తా. ఇంతియే కాక ఛాయాదేవికొడుకయినశని మేషమునం దున్న ప్పుడును, గురుఁడు వృషభరాశియం దున్నప్పుడును, ధనుస్సునందు సూర్యుఁ డు ప్రవేశించినది మొదలుకొని మాఘమాసమువఱకును, స్వాతినక్షత్రమునం దును, మూలనక్షత్రమందును, అనూరాధనక్షత్రమునందును, మకరరాశియం దును, మీనరాశియందును, కర్కటరాశియందును, చల్లినపక్షమున జొన్న పంట హెచ్చుగా ఫలియించు నని రెట్టఁడు చెప్పెను. ౨౨

తే. గీ. అరయఁ దక్కిననక్షత్ర మట్టిరాసు,
లందునను జొన్న వి త్తిన నందు మూఁడు
భాగముల నెఱ్ఱనై చెడుఁ బరఁగ నొక్క
భాగము ఫలించు ననె రెట్టభోగివరుఁడు. ౨౩

తా. ఆలోచింపఁగా, పైన వివరించిననక్షత్రములును, ఆరాసులును గాక మిగిలిన నక్షత్రములయందును, రాసులయందును, జొన్నవి త్తనములు నాటవేసినపక్షమున మూఁడువంతులు పంట యెఱ్ఱఁబడి చెడిపోవును. ఒక్క వంతుమాత్రమే ఫలించును. ౨౩

సీ. తొలుత గంధాక్షతధూపోపహారముల్
గొఱ్ఱుజడ్డిగముల కొసఁగవలయు
హర్షంబుతో జొన్న లాదిగా ధాన్యముల్
వి త్తిన ఫలియించు వెలితి లేక
విత్తుచుండెడువేళ వేగ పగ్గంబు లై
నను మోకు లైనను దునిఁగెనేని
యెద్దులు రొప్పంగ నెద్దులు వడెనేని
యలపంట రాచకార్యములచేత
తే. గీ. సమయు ము న్నెద్దు పడినదోసమ్ముచేతఁ,
జోరులకు నైన నునువునఁ జేరు మఱియుఁ

దగులు నాకాఁపునకు వానితమ్మునకును,
గట్టిగా హాని యనె రెట్టఘనుఁడు మహిని. ౨౮

తా. వేంకటరాజా! ముందుగా గంధము, అక్షతలు, ధూపము, నైవేద్యము, అనునివి దున్నినపొలముమీఁదను దున్నెడుయంత్రమునకును, పిడతకు మూఁడుగొట్టము లమర్పఁబడి విత్తనములు చల్లుట కుపయోగించు యంత్రవిశేషమునకును సమర్పింపవలయును. అటుపయిని సంతోషముతో జొన్నలు మొదలయిన విత్తనములు నాటినపక్షమున తక్కువ గాకుండ ఫలియించును. విత్తనములు చల్లుచున్నప్పుడు వేగముగా పగ్గము లయినను, మోకు లయినను తెగిపోయినట్లయినను, ఎద్దులు మూల్గినను, ఎద్దులు పడిపోయినను, ఆపండినపంట రాచకార్యములచేతను పాడయిపోవును. ముందుగా ఎద్దుపడిపోయిన దోషముచేతను ఆపంట దొంగలపాల నయినను పడును. ఇంతేకాకుండ, పండించెడుకాఁపునకును, వానితమ్మునకును గట్టిగా కీడు తగులు నని రెట్టపండితుఁ డన్నాఁడు. ౨౮

సీ. విత్తఁబోయినవేళ విను పైఁడికంటి దా
  పల రొప్పి నిలిచిన వలపటికిని
గాడిద ముంగిస కాకంబు వోయిన
  శునకంబు వామదిక్కునకుఁ జనినఁ
జెలఁగి పుణ్యాంగనల్ సేసలు చల్లిన
  ముదమున వేదముల్ చదువుచున్న
విత్తెడునప్పుడు వృషభంబు లెడమగాఁ
  జాలువాఱిన మఱి చాలు దిరిగి
వచ్చునే నెద్దులు వలపలఁ దిరిగియు
  వచ్చి గీమును జేర వచ్చుతఱిని
ధాన్యంబు దీర్ఘ నవారిగాఁ బైరవ
  శ్యంబును ఫలియించుఁ జక్కఁగాను

తే. గీ. రెట్టకవివర్యుఁ డీరీతి మట్టు దెలిసి,
గట్టిగాఁ బల్కె నిలలోన దిట్టఁ డగుచు
సరసు లెల్లరు విని చాల సంతసింప,
నర్థికల్పక! వరవేంకటాద్రిభూప! ౭౫

తా. యాచకులకుఁ గల్పవృక్షమువంటివాఁడా! శ్రేష్ఠుఁడ వయిన వేంకటరాజా! విత్తనములు చల్లుటకుఁ బోవుచున్నసమయమున, పైఁడికంటి యనుపక్షి యెడమవయిపున కూసి నిలిచినను, కుడివయిపునకు గాడిదగాని, ముంగిసగాని, కాకిగాని పోయినను, కుక్క యెడమదిక్కునకుఁ బోయినను, సంతోషించి పుణ్యస్త్రీలు (ముత్తయిదువలు) సేసలుచల్లినను, సంతోషముతో బ్రాహ్మణులు వేదములు పఠించుచున్నను, విత్తనములు చల్లుచున్నప్పు డెద్దు లెడమదిక్కుగా చాలు పోవునట్లు చేసినను, మఱియు చాలు తిరిగి వచ్చినను, ఎద్దులు కుడిప్రక్కగా తిరిగి వచ్చినను, అట్లు వచ్చి యింటికిఁ జేరుకొనుటకై వచ్చునప్పుడు కాకి తీర్చినను ఆపైరు హెచ్చుగాను, తప్పకుండను చక్కఁగాను పండును. రెట్టఁ డనుకవీశ్వరుఁ డీలాగున మట్టు తెలిసికొని సరసు లగువార లందఱును విని యెంతో సంతోషించునట్లు ధైర్యముగలవాఁ డయి పలికియున్నాఁడు. ౭౫

తే. గీ. కవియు సౌమ్యుండు నున్నలగ్నమున నైనఁ,
జంద్రుఁ డున్నట్టియానవాంశముల నైన
నివ్వసుధఁ గల్గుధాన్యమ్ము లెవ్వి యైన
విత్తిన ఫలించుఁ గొండ్రాజువేంకటేంద్ర! ౭౬

తా. కొండరాజుగారి వేంకటరాజా! శుక్రుఁడును, బుధుఁడును ఉన్న లగ్నమునం దయినను, చంద్రుఁడు ఉన్నటువంటియానవాంశములయం దయినను ఈభూమిమీఁదను గలిగిన ధాన్యము లేవి చల్లినను తప్పక ఫలించును. ౭౬

చ. అమరగురుండు లగ్నమునయందు వసింపఁగ విత్తుటల్ చతు
ర్థమున మెలంగఁ బైరుతఱి దప్పక కాయుట సప్తమంబునం
దమరఁగ వేగనాపయిరు లాయత పెట్టుట మంచి దెంతయున్
విమలగుణాఢ్య! తిమ్మపృథివీపతి వేంకటరాజశేఖరా! ౨౭

తా. నిర్మలము లయినగుణములచేత నొప్పువాఁడా! తిమ్మరాజుగారి వేంకటరాజా! దేవతలకు గురువయిన బృహస్పతి లగ్నమునం దుండఁగా విత్తనములు చల్లుటయును, నాల్గవయింట నుండఁగా పైరు కాలము తప్పకుండఁగా కాయుటయును, సప్తమస్థానమునం దుండఁగా, వేగముగా ఆ పైరులు జాగ్రత్త పెట్టుకొనుటయును చాల మంచిది. కాఁబట్టి గురుబలమును చక్కఁగా విచారించి మఱియు విత్తనములు చల్లవలె ననుట. ౨౭

సీ. కోరి పండినపంట కోయఁ బోయెడు వేళ
వలపంటఁ గాకంబు వచ్చి కట్టు
కట్టున్న దక్షిణాంగంబునఁ జేష్టలు
గావించినను పారి కలుగుఁ బంట
మేటిధేనుంగులు మించుటద్దంబులు
ననఁటికంబంబులు నట్టు పూర్ణ
కలశంబులును వన్నె గట్టినకోకలు
వీక్షింప ధాన్యసువృద్ధి మఱియు

తే. గీ. నట్టి ధాన్యంబు లెటువంటి యడ్డు లేక
యిల్లు చేరును గాఁపుల కింపు మీఱ
రసికమందార! పెదతిమ్మరాట్కుమార!
వేంకటక్ష్మాప! సర్వదిగ్వినతభూప! ౨౮

తా. రసికులకుఁ గల్పవృక్షమువంటివాఁడా! పెద్దతిమ్మరాజుగారికుమారుఁడా! సర్వదిక్కులయందును నమ్రులయిన రాజులుగలవాఁడా! వేంకటరాజా! కోరికగల్గి పండినపంటలను కోయుటకుఁ బోవుచుండునప్పుడు

కాకి కుడిప్రక్కకు వచ్చి కఱ్ఱు కఱ్ఱని కూసినను, దానికుడియవయవములయం దేదేని చేష్టచేసినను పంట విస్తారముగా లభించును. మఱియు, మంచియేనుఁగులుగాని, మంచియద్దములుగాని, అరఁటికంబములుగాని, ఆప్రకారముగానే నిండినకుండలుగాని, పన్నెలుకట్టినకోకలుగాని యెదురయినపక్షమున ధాన్యములు మంచి వృద్ధిగా లభించును. మఱియు నట్లు హెచ్చుగా పండినధాన్యములు ఏవిధమయినహానియు లేకుండఁ బండించినకాఁపునకు సంతోషము హెచ్చుగాఁ గలుగునట్లు చక్కఁగా నింటికిఁ జేరును. ౭౮

ఆ. వె. పైరు గోయఁబోవఁ బాటింప విధవ కుం,
దేలు నగ్ని కసవు తెలికజాతి
వారిఁ జూచి రేని వారికి నాపంట,
దక్క దనియె రెట్టఁ డక్కజముగ. ౭౯

తా. పండినచేను కోయుటకు పోవునప్పుడు, ఆలోచింపఁగా ముండమోపిగాని, చెవులపిల్లిగాని, నిప్పుగాని, కసవుగాని, తెలుకులవాండ్లుగాని యెదురుగా వచ్చినపక్షమున పండించుకొన్నవారి కాపంట దక్క దని రెట్టఁ డాశ్చర్యముగా నన్నాఁడు. ౭౯

—* అర్ఘలక్షణము. *—

సీ. భావించి కన నమావాస్యయందున నింద్ర
ధనువు వానయు గర్జితంబు మెఱపు
గాలియు మొదలుగాఁ గలదశ ధాతువుల్
మఱియును బరివేషమండలమున
నల్లని రేఖలు నలు వొంద నుండిన
నగ్గువ యగును ధాన్యంబు మిగుల
వరుస నీచెప్పినగుఱుతు లాదినమునఁ
గాక తక్కిననాఁడు గలిగియున్న

తే. గీ. విస్మయం బావహిల్ల నుర్వీతలమున,
డామరము సంభవించు దృఢంబుగాఁగ
ననియె రెట్టఁడు సకలవిద్యావిదుండు,
వినుము కొండ్రాజుతిమ్మయ వేంకటేంద్ర! ౩౦

తా. కొండరాజుగారితిమ్మరాజుగారివేంకటరాజా! విను మిఁక వెల లనుగుఱించి చెప్పెదము. ఆలోచించి చూడఁగా, అమావాస్యనాఁడు, ఇంద్రధనుస్సు, వర్షము, ఉఱుములు, మెఱపులు, గాలి మొదలుగాఁ గలిగిన పదిధాతువులును, అంతేకాక, సూర్యచంద్రులకుఁ గట్టినగుళ్లయందు నల్లని రేఖలును ప్రకాశించున ట్లుండినపక్షమున ధాన్యము మిక్కిలి చౌకగా నుండును. క్రమముగా నీపయిని చెప్పినగుఱుతు లమావాస్యనాఁడుగాక, మిగతదినములయం దగపడినపక్షమున నాశ్చర్యము కలుగునట్టుగా భూమి యందు డామరము—అనఁగా, కొల్లమొదలయిన దేశోపద్రవము సంభవించు నని గట్టిగా సకలవిద్యల నెఱిఁగిన రెట్టఁ డన్నాఁడు. ౩౦

సీ. క్రమముతోఁ జైత్రమాసమున నమావాస్యఁ
బద్మమిత్త్రుఁడు వృషభప్రవేశ
ముల నొంద నాగుఱుతులు నుండెనా వెసఁ
బైరులు లెస్సగా ఫలముఁ జెందుఁ
గందమూలాదులు గలుగు నానెలలోన
ధారుణిఁ దఱుఁగవు ధరలు మఱియు
వైశాఖమున నమావాస్యను రవి మిథు
నముఁ జేర నట్టిచిహ్నములు గల్గఁ

తే. గీ. గొలుచు లవణాదిరసవర్గములును దఱఁగి,
యమ్ము షణ్మాసపర్యంత మద్భుతముగ
నుర్విలోపల రత్నాకరోక్తమతము,
వినుము కొండ్రాజుతిమ్మయ వేంకటేంద్ర! ౩౧

తా. కొండ్రాజుగారితిమ్మరాజువేంకటరాజా! క్రమము తప్పకుండ సూర్యుఁడు చైత్రబహుళామావాస్యనాఁడు వృషభరాశియందుఁ బ్రవేశింపఁగా, మీఁదిపద్యమునందుఁ జెప్పఁబడిన యింద్రధనుస్సు మొదలయినగుఱుతు లుండినపక్షమునను ఆసంవత్సరమున లెస్సగా పంటలు పండును. భూమిలోఁ బెరిఁగెడిదుంపదినుసులు మొదలయినవి ఫలించును. ఆనెలలో ధరలు తగ్గవు. అంతేకాక వైశాఖమాసమునందలి యమావాస్యనాఁడు సూర్యుఁడు మిథునరాశియందుఁ బ్రవేశింపఁగా, అపుడు వెనుకటిగుఱుతు లున్నను ధాన్యాదులును, ఉప్పు మొదలయినరసపదార్థములును తక్కువవెలల కమ్మఁ డగును. ఈఫల మాఱునెలలవఱకును ఉండును. ఇది యాశ్చర్యకరమే. ఇది రత్నాకరమను గ్రంథమునఁ జెప్పఁబడిన మతము. ౩౦

తే. గీ. వరుస జ్యేష్ఠంబునం దమావాస్య నట్టి,
చిహ్నములు గల్గి యున్న నీక్షితిని ధాన్య
చయము కడు నగ్గు వై యుండు జనులు చెలఁగ,
వినుము కొండ్రాజుతిమ్మయవేంకటేంద్ర! ౩౧

తా. కొండరాజుగారితిమ్మరాజుగారి వేంకటరాజా! ఇంకను వినుము. వరుసగా జ్యేష్ఠబహుళామావాస్యనాఁడు వెనుకటిలక్షణము లుండినప్పటికిని ఈభూమియందు జనులు సంతోషించునట్లు ధాన్యాదులు మిక్కిలి చౌకగా అమ్మఁబడుచుండును. ౩౧

సీ. ఆషాఢమాసంబునం దమావాస్యను
దెలియ నాగుఱుతులే కలిగి యున్న
ఘృతము తేనియ నూనె శ్రీగంధమును మొద
లైనవస్తువు లెల్ల నాదినములఁ
గొని దాఁచ నఱువదిదినములనాఁటికి
నినుమడిలాభ మగు నెన్ని చూడ

శ్రావణంబున సూర్యచంద్రులు గూడినఁ
బూర్వోక్త చిహ్నముల్ పొసఁగియున్న
తే. గీ. నాదినములందు నేనుంగు లశ్వములును,
పైఁడి వెండియు మరకతప్రభృతిమణులు
గొనఁగ మఱి యైదునెలలకు నినుమడిగను,
లాభ మెసఁగును వేంకటేలాతలేంద్ర! 33

తా. వేంకటరాజా ! ఆషాఢబహుళామావాస్యనాఁడు ప్రకటముగాఁ దెలియఁన ట్లాలక్షణములే కలిగియున్న పక్షమున నేయి, తేనె, నూనె, మంచిగంధము, మొదలయినవస్తువుల నాదినములలోఁ గొని నిలువచేసినపక్షమున రెండునెలలనాఁటికి రెండురెట్లు లాభము గలుగును. ఆలోచించి చూడఁగా, శ్రావణబహుళామావాస్యనాఁడు సూర్యుఁడును, చంద్రుఁడును గూడియుండఁగా వెనుకఁ జెప్పఁబడినలక్షణము లగపడినయెడల, ఆదినములలో మదపుటేనుఁగులు, గుఱ్ఱములు, బంగారము, వెండి, మరకతములు మొదలగు రత్నములు కొన్నట్టయితే కొన్నమఱియైదునెలలనాఁటికి రెండింతలు లాభము కలుగును. 33

సీ. భాద్రపదంబునఁ బరఁగునమావాస్య
నాచిహ్నములు గల్గ నాదినమున
జొన్నలు లోహముల్ జోకతోఁ గొని దాఁచ
మాసత్రయమున కిమ్మడి లభించు
నాశ్వయుజ్మాసంబునం దమావాస్యను
మునుపటిగుఱుతులు మొనసి యున్న
నులవలు మాణిక్యములును కఁబళ్లుఁ గుం
కుమ కుసుంబపుఁబువుల్ గొనిన నెలకు
తే గీ. లాభ మినుమడి యనె యశోలాభనిరతుఁ,
డగుచు శ్రీసూర్యనారాయణాంఘ్రిపద్మ

వందనాసక్తుఁ డగు రెట్టఁ డంద ముగను,
వినుము కొండ్రాజుతిమ్మయ వేంకటేంద్ర! ౩౪

తా. కొండరాజుతిమ్మరాజుగారి వేంకటరాజా! ఇంకను వినుము. భాద్రపదబహుళామావాస్యనాఁడు పైని సూచింపఁబడిన గుర్తు లుండిన యెడల, ఆదినములలో జొన్నలును, ఇనుము మొదలగు లోహములును కొని నిలువ యుంచిన పక్షమున మూఁడు నెలలపైని రెట్టింపుగా లాభము గలుగును. ఆశ్వయుజమాసమున అమావాస్యనాఁడు వెనుకటిపదిలక్షణములును స్పష్టముగా నగపడినట్టయిన, ఆదినములలో ఉలవలు, రత్నములు, కంబళ్లు, కుంకుమపూవు, కుసుంబపువ్వు మొదలయినవి కొని యుంచినట్టయితే నెలదినములనాఁటికి రెట్టిగా లాభము గలుగు నని కీర్తిలాభమునం దాసక్తిగలవాఁ డగుచు శ్రీమంతుఁ డయిన సూర్యనారాయణమూర్తియొక్క పాదపద్మములకు వందనములు చేయుటయందాసక్తి గలవాఁ డయిన రెట్టన్నకవీశ్వరుఁ డని యున్నాఁడు. ౩౪

సీ. అరయఁ గార్తికమున నమవస వృశ్చిక
రాశికి నాగ్రహరాజు వచ్చి
యుండంగఁ దొలిగుర్తు లొగిఁ గల్గి యుండినఁ
గందమూలాదికబృందములును
గుఱిరైయెనరత్నముల్ గొనిన మాసత్రయ
మ్మున కవి ఫలియించు నినుమడిగను
రహిమించుమార్గశీర్షమ్మునమావాస్య
నినుఁడు ధనూరాశి కేఁగు దేర
తే. గీ. నట్టిగుఱుతులు గనుపట్టినట్టియపుడు,
శంకు పవడంబు ముత్యముల్ గుంకుమయును
గొనిన షాణ్మాసమున కందు కినుమడిగను,
గలుగు లాభంబు వినుము వేంకటనృపాల! ౩౫

తా. వేంకటరాజా! ఇంకను వినుము. కార్తికబహుళామావాస్య నాఁడును, వృశ్చికరాశియందు సూర్యుఁడు ప్రవేశించినప్పుడును, వెనుకటి గుఱుతులు గనుపడినట్టయిన దుంపదినుసులు మొదలగునవియును, రత్నములును కొని నిలువ యుంచుకొన్నపక్షమున మఱిమూఁడు నెలనాఁటి కవి రెండురెట్లుగా లాభమును గలిగించును. మార్గశిర్ష బహుళామావాస్యనాఁడును, సూర్యుఁడు ధనూరాశియందుఁ బ్రవేశించినప్పుడును వెనుకటి గుర్తులు కనుపడినట్టయితే ఆదినములలో శంఖములు, ముత్యములు, కుంకుమపూవు కొని నిలువ చేసినయెడల ఆఱునెలలనాఁటికి రెండింతలుగా లాభము గలుగును. ౩౫

సీ. పౌషమాసంబునఁ బరఁగునమావాస్య
మకరాన నైనఁ గుంభమున నైన
దినరాజు చేరంగ మునుపటిగుఱుతులు
గనిపింప ధాన్యలోహనికరంబు
గొని రెండునెలల కమ్మిన నినుమడిలాభ
మౌ నెంచి చూడంగ మాఘమాస
మున నమావాస్యయం దినుఁడు మీనముఁ జెందఁ
దొలుతటిచిహ్నముల్ గలుగునేని
తే. గీ. కందమూలములును మానికములు నినుము,
ననుములును రసచయములు నపుడు కొనిన
నాలునెలలకు నమ్మిన నందువలన,
వినుము ముమ్మడి ధన మగు వేంకటేంద్ర! ౩౬

తా. వేంకటరాజా! ఇంకను జెప్పెదము వినుము. పౌషబహుళామావాస్యనాఁడును, మకరరాశియందుఁగాని, కుంభరాశియందుఁగాని సూర్యుఁడు ప్రవేశించినప్పుడును, వెనుకఁ జెప్పఁబడిన లక్షణము లగపడినట్టయిన ధాన్యాదులు, లోహములు కొని యుంచి రెండునెల లయినతరువాత నమ్మినపక్షమున నాలోచించి చూడఁగా రెండింతలు లాభము గలుగును.

మఱియు మాఘబహుళామావాస్యనాఁడును, మీనరాశియందు సూర్యుఁడు ప్రవేశించినప్పుడును మీఁదిలక్షణము లగపడినచో, అప్పుడు దుంప దినుసులును, మాణిక్యములును, ఇనుమును, అనుములును, రసవర్గములును కొన్న యెడల ఆఱునెలలపైని అమ్మితే వానివలన మూఁడింతలు లాభము గలుగును. ౩౬

సీ. పొలుపొంద ఫాల్గునంబున నమావాస్యనాఁ
డలతొంటిగుఱుతులే యలరియున్న
దవసంబుఁ గొని మఱి దగ నాల్గునెలల క
మ్మిన లాభ మరయంగ నినుమడి యగు
నయ్యమావాస్యాంతమందుఁ బాపగ్రహ
మ్ములు వచ్చినను దారణలు నశించు
నందు శుభగ్రహం బలరంగ నున్నను
నెఱి కొల్చు నగ్గు వౌ నిక్కముగను
నయ్యమవస ముప్పదహముల కైన మం
చిది యగు నది ముప్పది దినములకుఁ

తే. గీ. దక్కు వై యున్నఁ గా దది ధరణిప్రజకు,
మించి యుండిన శుభ మగు మేటిప్రజకు
ననియె రెట్టఁడు సకలవిద్యావిదుండు,
వినుము కొండ్రాజుతిమ్మయవేంకటేంద్ర! ౩౭

తా. కొండ్రాజు తిమ్మరాజుగారి వేంకటరాజా! ఇంకను వినుము. ఇంపు గలుగునట్లు ఫాల్గునబహుళామావాస్యనాఁడు వెనుకటిగుఱుతు లగపడినయెడల నప్పుడు ధాన్యము కొని యుంచుకొని నాలుగునెల లయిన తరువాత నవి యమ్మినట్టయితే రెండింతలు లాభము గలుగును. ఆయమావాస్య యంతమునందు పాపగ్రహములు వచ్చి చేరినట్టయితే ధరలు చాల తక్కువ యగును. ఆసమయమున శుభగ్రహములు వచ్చి చేరిన ట్టయితే

ధాన్యము నిశ్చయముగా చవుక యగును. ఆయమావాస్య పూర్తిగా ముప్పది రోజులకు వచ్చినట్టయితే మంచిది. ముప్పదిదినములకు తక్కువ యయినట్టయితే అది భూమియందలి జనులకు మంచిది గాదు. ముప్పదిరోజులకు పైగా నమావాస్య వచ్చినట్టయితేను ప్రజలకు మంచి శుభములు గలుగునని సకలవిద్యల నెఱింగిన రెట్టన్నపండితుఁ డనియున్నాఁడు. ౩౭

సీ. పున్నమరాతిరి సన్నపుటుఱుములుఁ
దుంపరవానయు ధూమ్రవర్ణ
మగుపరివేషంబు నంధకారము గప్పి
పొగఁ బోలిన ట్లున్న మొగులలోన
నొండు రెండును జుక్క లుండినఁ బడమట
బలభేదిచాపంబు నలుగడలను
మెఱపులు గలిగిన మేదిని దారణల్
చాలంగఁ గల్గు నచ్చైత్రమందుఁ
బున్నమరాతి రాచిన్నియల్ గలిగిన
ధాన్యంబు ప్రత్తియు దాఁచవలయు
తే. గీ. నెసఁగ నాల్గవనెల కమ్మ నినుమడించు,
ననియె రెట్టఁడు దిట్టఁడై యచ్చెరువుగ
సరసు లగువార లౌ నన జాటి వినుము,
వేంకటక్ష్మాతలేంద్ర! భూవినుతకీర్తి. ౩౮

తా. భూమియందలి జనులచేతను కొనియాడఁబడుచున్న కీర్తిగలయో వేంకటరాజా! పున్నమనాఁటిరాతిరివేళను చిన్నయుఱుములును, తుంపరవానయు, పొగరంగుగల పరివేషము, చీఁకటి గ్రమ్మి పొగవలె నున్న మేఘములలో నుండి యక్కడక్కడ ఒకటి రెండు నక్షత్రములును అగపడినట్టయితేను, ఇంద్రధనుస్సును, నాలుగుదిక్కులయందును మెఱపులు మెఱసినను భూమియందు ధరలు చాల హెచ్చుగా నుండును. ఆసంవత్సరపు

చైత్రపూర్ణిమనాఁడు పూర్వము చెప్పఁబడినగుర్తు లగపడినట్టయిన ధాన్యము, ప్రత్తి కొని దాఁచియుంచవలెను. అవి నాలుగు నెలలు దాఁటిన పిదప నమ్మినట్టయితే రెండు రెట్లు లాభము గలుగు నని సరసు లగువా రందఱును ఔనని యనునట్లు రెట్టనపండితుఁడు చాటి చెప్పినాఁడు. ౩౮

సీ. పొందుగా వైశాఖపూర్ణిమరాత్రి నా
 గుర్తు లుండినఁ బ్రత్తి కుసుమ పెసలు
పరిమళద్రవ్యముల్ బహుళంబుగాఁ గొని
 యెనిమిదినెలల కమ్మిన ఫలంబు
లష్టగుణం బగు నట జ్యేష్ఠమాసంపుఁ
 బూర్ణిమనాఁ డట్టి పోల్కి యుండఁ
గొని నాల్గునెలల కమ్మిన లాభ మిమ్మడి
 యగు మఱి రాచకార్యములు గలుగు
తే. గీ. నెఱయ నాషాఢపూర్ణిమానిశను దొంటి
 గుఱుతు లుండిన రాగులు గోధుమలును
 యవలు గొని యుంచఁ ద్రిగుణ మౌ నందు ఫలము,
 నాల్గునెలలకు వేంకటనరవరేణ్య! ౩౯

తా. వేంకటరాజా! వైశాఖపూర్ణిమనాఁటిరాత్రి ముప్పదియెనిమిదవ పద్యమునందుఁ జెప్పినలక్షణము లగపడినచో అప్పుడు ప్రత్తి, కుసుమలు, పెసలు, సువాసనద్రవ్యములును అధికముగాఁ గొని యుంచుకొని యెనిమిది నెలలు దాఁటిన తరువాత నమ్మినట్టయితే యెనిమిది రెట్లుగా లాభము గలుగును. మఱియును జ్యేష్ఠపూర్ణిమదినమున నాలక్షణములే యగపడినట్టయితే అప్పుడు ధాన్యము కొని యుంచి నాలుగు నెలలు దాఁటినపై నమ్మినపక్షమున రెండింతలు లాభించును. రాజకార్యములును గలుగును. మఱియు నాషాఢపూర్ణిమనాఁ డాగుర్తు లగపడినట్టయిన నప్పుడు

రాగు లనఁగా చోళ్లు, గోధుమలు, యవలు కొని నిలువచేసి నాలుగు నెల లయినతరువాత నవి యమ్మితే మూఁడు రెట్లు లాభము కలుగును. ౩౯

సీ. శ్రావణపూర్ణిమా రాత్రి నాగుఱుతులు
కలిగినఁ దైలంబుఁ గందమూల
ఫలములుఁ గొని యుంచ నెలనాఁటి కిల నొక
పాలు ఫలము గల్గు భాద్రపదము
నందుఁ బున్నమరేయి నాగుర్తు లుండినఁ
గైదువుల్ సీసంబు గంధకంబు
ముత్తియంబులు బాణములు తుపాకులు పెటు
లుప్పు ధాన్యము గొని యుంచి పిదప
తే. గీ. మెఱయ నెనిమిదినెలల కమ్మినను లాభ,
మష్టగుణ మగు నిక్కువ మరసి చూడ
భానువంశప్రదీప ! శుంభత్ప్రతాప!
వినుము కొండ్రాజుతిమ్మయ వేంకటేంద్ర! ౪౦

తా. సూర్యవంశమునకు దీపమువంటి వాఁడవును, ప్రకాశించుచున్న ప్రతాపముగలవాఁడవును, అగునో కొండ్రాజు తిమ్మరాజుగారి వేంకటరాజా ! ఇంకను చెప్పెదము వినుము. శ్రావణ పూర్ణిమనాఁటిరాతిరి వెనుకటి పద్యమునందు చెప్పఁబడినలక్షణము లగపడినచో, అప్పుడు నూనె, దుంప దినుసులు, పండ్లు మొదలగునవి కొని యుంచితే నెలదినములనాఁటికి కొంచెముగా లాభించును. భాద్రపదపూర్ణిమనాఁటిరాతిరి యాలక్షణములే యగపడినట్లయిన, అపుడు, ఆయుధములు సీసము, గంధకము, ముత్యములు, బాణములు, తుపాకులు, పెట్లుప్పు, ధాన్యము కొని నిలువచేసి యెనిమిదినెలలయినతరువాత నమ్మినచో నిజముగా నెనిమిదిరెట్లు లాభము గలుగును. ౪౦

సీ. అశ్వయుజ్మాసంబునందుఁ బున్నమరేయి
నాగుఱుతులు గల్గ నపుడు దేనె

గోదుమల్ వరిగలు కొఱ్ఱలు నేయియుఁ
గొని నాల్గునెలల కమ్మినయెడలను
బరఁగంగ నైదుపాళ్ళరయ లాభము గల్గు
రెట్టనిమత మిది గట్టిగాను
కార్తికపూర్ణిమం గడువేడ్క రజనిని
మునుపటిగుఱుతులు గనుచు వేగ
తే. గీ. విల్లు నంబులుఁ గంబళ్ళు నల్లవరుల,
గొలుచుఁ బగడంబు స్వర్ణముం గొని ముదమున
నాలునెలలకు నమ్మిన నైదుపాళ్ళు,
లాభ మొనగూడు వేంకటేలాతలేంద్ర! ౪౧

తా. తిమ్మరాజుగారి కుమారుఁడ వయిన యోవేంకటరాజా! ఆశ్వయుజపూర్ణిమనాఁటిరాత్రి వెనుకటి గుర్తు లున్నట్టయిన, ఆనాఁడు తేనె, గోదుమలు, ఆరుగలు, కొఱ్ఱలు, నేయి యివి కొని నిలువచేసి మఱినాలుగు నెలలు పోయినతరువాత నమ్మినయెడల నైదురెట్లు లాభము గలుగును. ఇది రెట్టనిమతము. తప్పనిది. కార్తికపూర్ణిమనాఁటిరాత్రి వెనుకటి లక్షణము లగపడినచో ధనుస్సులు, బాణములు, కంబళ్లు, నల్లనివడ్లు, పగడాలు, బంగారము కొని యుంచి యాఱునెలలమీఁదట నమ్మినట్టయితే అయిదింతలు లాభము చేకూరును. ౪౧

సీ. చెలువు మీఱఁగ మార్గశీర్షపూర్ణిమయందుఁ
దొలుతటిగుఱుతులు గలిగియున్నఁ
జక్కెర తేనె యాజ్యము శుంఠిఁ గొని నాల్గు
నెలల కమ్మినఁ జాల ఫలము గలుగుఁ
బౌషపూర్ణిమను మున్నటి గుర్తులే కల్గఁ
గ్రముకముల్ సంకు కుంకుమయుఁ దగర

మరుదైనవన్నెలు పరిమళద్రవ్యముల్
గొనిన మాసయత్రంబునకు నైదు
తే. గీ. పాళ్లు లాభంబు చేకూరుఁ బరఁగ మాఘ
పూర్ణిమ నమాస నాచిహ్నములును గలుగఁ
గొలుచు రసవర్గములు గొన్న నెలలు మూఁట
నధికముగ ఫల మగు వేంకటాద్రిభూప! ౪౨

తా. వేంకటరాజా! సొగ సధిక మగునట్లుగా, మార్గశీర్ష పూర్ణిమా దినమున వెనుకటి గుర్తులు కలిగి యున్నయెడల నప్పుడు పంచదార, తేనె, నేయి, సొంటి కొని యుంచుకొని నాలుగునెలలు దాఁటినపై నమ్మితే చాల లాభించును. పౌషపూర్ణిమనాఁడు మీఁదిగుర్తు లగపడినచో, అప్పుడు పోఁకచెక్కలు, శంఖములు, కుంకుమ, తగరము ఆశ్చర్యకరము లయినరంగులు, సువాసనద్రవ్యములు కొని యుంచుకొని మూఁడునెలలు ముగిసినతరువాత నమ్మితే అయిదింతలు లాభించును. మాఘశుక్ల పూర్ణిమనాఁడు వెనుకటిగుర్తు లుండినచో, అపుడు ధాన్యము, రసవర్గములును కొని మూఁడునెలలు గడచినతరువాత నమ్మితే హెచ్చుగా లాభము చేకూరును. ౪౨

చ. పనివడి తొంటిచిహ్నములు ఫాల్గునపూర్ణిమయందు రాతిరిం
గనుపడియుండ గంధకము కంచుఫలంబులుకందమూలముల్
గొనిమటస ప్తమాసములకుం గ్రయమిచ్చినలాభ మొప్పఁగా
నినుమడి యౌను దిమ్మధరణీశ్వరు వేంకటరాజశేఖరా! ౪౩

తా. తిమ్మరాజుగారి వేంకటరాజా! అక్కడగల్గి ఫాల్గునపూర్ణిమ నాఁటిరాతిరి వెనుకఁ జెప్పఁబడిన గుర్తు లగపడినయెడల, అప్పుడు గంధకము, కంచు, పండ్లదినుసులు, దుంపదినుసులును కొని యుంచి యేడునెలలు దాఁటినతరువాత నమ్మినట్టయితే రెండింతలుగా లాభించును. ౪౩

సీ. రాజిల్ల నలమీనరాశిని బున్నమ
నాఁ డేడుగ్రహములు గూడెనేని

ప్రజలకు హాని యగు ద్విజరాజును శుభగ్ర
హములు చూచిన శుభం బావహిల్లు
ధారణల్ హెచ్చును గ్రూరగ్రహంబులు
గనుఁగొన్న దవసంబు గడుఁ దఱుఁగును
భువి నొక్కమత మిది పున్నమ ముప్పది,
దినముల కైనను దృఢము గాఁగ
తే. గీ. సమము ధారణ లొక్కఘస్రంబు కొఱఁత,
యయిన ధారణములు దక్కు వగు మఱొక్క
దిన మధిక మైన ధారణల్ ఘనము గాఁగ
నగ్గు వౌ నని రెట్టన యార్యసుతుఁడు. ౪౪

తా. ప్రకాశించునట్లుగా మీనమాసమునందలి పున్నమనాఁడు, ఏడు గ్రహములునుండి యుండినపక్షమున జనులకు కీడు గలుగును. చంద్రుని శుభగ్రహములు చూచినట్లయిన శుభము గలుగును, ధరలు హెచ్చును. ఆచంద్రుని క్రూరగ్రహములు చూచినట్టయితే ధర లధికముగా తగ్గిపోవును—అనునిది యొకమతము. ఆపున్నమ సరిగా ముప్పదిదినములకు తటస్థించెనేని ధరలు సమానముగా నుండును. ఒక్క దినము తక్కువయయిన అనఁగా నిరువదితొమ్మిదిదినములకు పున్నమ వచ్చినపక్షమున ధరలు తక్కువ యగును. ఒక్కదినము హెచ్చయినపక్షమున ధరలుహెచ్చయినను హెచ్చును. చౌక యయిన నగును—అని పెద్దలచేఁ గొనియాడఁబడిన రెట్టపండితుఁ డన్నాఁడు.

సీ. ఉత్తరాషాఢయు నుత్తరభాద్రయు
హస్త పునర్వసు వశ్వినియును
జిత్త యుత్తర యనఁ జెలఁగునియ్యేడుతా
రల వాయుదిక్కున గ్రహణ మైన
నరులకుఁ జిన్న వాండ్రకు వ్యాధి గల్గును
ధాన్యంబు దఱుఁగు యుద్ధంబు లగును

గోపంబు బహుళంబు కొంచె మౌ వానయుఁ
దర్కించి చూడంగ ధరణియందు
తే. గీ సరవి నీచెప్పినట్టిదోషములలోన,
నొక్క టైనను దాఁకు నీయుర్వియందు
నత్యుదగ్రతఁ బక్షత్రయమ్ములోన,
ననియె రెట్టఁడు సకలవిద్యావిదుండు!. ౮౫

తా. వేంకటరాజేంద్రా ! ఇంకమీఁద గ్రహణములఫలాఫలములను చెప్పెదము వినుము. ఉత్తరాషాఢ, ఉత్తరభాద్ర, హస్త, పునర్వసు, అశ్విని, చిత్త, ఉత్తర అనునీయేడు నక్షత్రములయందును, వాయుమూలయందుండి గ్రహణము గలిగినట్టయిన, ప్రజలకును, బాలురకును, రోగములు తటస్థించును. ధాన్యములు తగ్గిపోవును. యుద్ధములు తటస్థించును. నరులకుఁ గోపము హెచ్చగును. వానలు తక్కువగాఁ గురియును. ఆలోచించి చూడఁగా భూమియందు వరుసగా నీచెప్పిన దోషములలో నొకదోష మయినను మిగుల భయంకరముగా నలువది యైదు దినములలోఁ దప్పక కలుగు నని సకల విద్యల నెఱిఁగినరెట్టఁ డనియున్నాఁడు. ౮౫

సీ. జ్యేష్ఠ పూర్వాభాద్ర కృత్తిక భరణి పు
ష్యంబును మఘయు విశాఖ యనెడు
నల సప్తతారల నాగ్నేయమందున
గ్రహణ మైనను శిశుప్రకరములకు
వ్యాధులు వొడము ధాన్యంబులు దఱుఁగును
రాలవానయు నెండ రాచబాధ
ఘన మగు వర్షంబు గలుగుఁ గేవలమును
గురియ కుండును వృష్టి గువలయమున
తే. గీ. సరవి నీచెప్పినట్టిదోషములలోన,
నొక్క టైనను దాఁకును నిక్కువముగ

నక్షత్రగ్రహణ బక్షుత్రయమ్ములోన,
ననియె రెట్టఁడు వేంకటావనిమహేంద్ర! ౪౮

తా. వేంకటరాజా! జ్యేష్ఠ, పూర్వభాద్ర, కృత్తిక, భరణి, పుష్యమి, మఘ, విశాఖ—అనునీయేడు నక్షత్రములయందును ఆగ్నేయదిక్కున గ్రహణము కలిగినట్టయిన శిశువులకు రోగములు కలుగును. ధాన్యములు తఱిఁగిపోవును. రాలవానలు గురియును. ఎండలు మెండుగాఁ గాచును. రాజులవలనఁ బ్రజలకు గొప్పబాధలు గలుగును. వర్షములు గురియును. లేదా వానలు కురియకయైనను ఉండును. వరుసగా నీచెప్పినట్టి దోషములలో నిజముగా నొక్కటి యైనను మూఁడుపక్షములలో మిగుల భయంకరముగా తటస్థించి తీరు నని రెట్టఁడను పండితుఁ డన్నాఁడు. ౪౮

సీ. స్వాతి పూర్వాషాఢ శతతార యాశ్లేష
యార్ద్ర రేవతి పుబ్బ యనెడుసప్త
నక్షత్రములయందు నైరృతదిశనుండి
గ్రహణ మైనను శిశుప్రకరములకు
హాని యాఁ గోపంబు లలరు నీర్వయి రెండి
సమయు ననూరాధ శ్రవణము నభి
జి ద్ధనిష్ఠలు మృగశీర్షము మూల రో
హిణు లనఁగా భువి నెసఁగునట్టి
తే. గీ. ఈడునక్షత్రములయందు నెంచి చూడఁ,
గడఁగి యీశాన్యదిశనుండి గ్రహణ మైన
క్షోణిప్రజలకు నెంతయు శుభము దనరు,
ననియె రెట్టఁడు సకలవిద్యావిదుండు. ౪౭

తా. స్వాతి, పూర్వాషాఢ, శతతార, ఆశ్లేష, ఆర్ద్ర, రేవతి, పుబ్బ, అనెడి యీయేడునక్షత్రములయందును నిర్ఋతిదిక్కుననుండి గ్రహణము గల్గినట్టయిన శిశువులకు కీడు సంభవించును. జనులకు కోప మధిక మగును. నీటి

యాధారమునఁ బండుపయిరులు నీరులేక చెడిపోవును. అనూరాధ, శ్రవణము, అభిజిత్తు, ధనిష్ఠ, మృగశిర, మూల, రోహిణి—అని భూమియందుఁ బ్రసిద్ధములయిన యీయేడునక్షత్రములయందును ఆలోచించి చూడఁగా ఈశాన్య దిక్కునుండి గ్రహణము పట్టినట్టయిన భూమియందలి ప్రజలకు మిక్కిలిగా శుభములు గలుగు నని సకలవిద్యలందును పండితుఁ డయిన రెట్టకవి యన్నాఁడు. ౪౭

తే. గీ చైత్రమున జ్యేష్ఠ ఫాల్గున శ్రావణముల,
నర్కసోమోపరాగంబు లైన రుజలు
భూభ్రమణ మద్భుతంబులు పుట్టు ధరణి,
నాయకులు నొత్తు రనె రెట్టనప్రభుండు. ౪౮

తా. వేంకటరాజా! చైత్రమాసమునఁగాని, జ్యేష్ఠమాసమునఁగాని, ఫాల్గునమాసమునందుఁగాని, శ్రావణమాసమునందుఁగాని సూర్యగ్రహణముగాని, చంద్రగ్రహణముగాని సంభవించినపక్షమున రోగములు కలుగును. భూమి తిరుగుట మొదలయిన యాశ్చర్యములు గలుగును. రాజులు నొత్తురు—అని రెట్టప్రభు వన్నాఁడు. ౪౮

క. ఒకమాసంబున సోమది,
నకరగ్రహణములు గలిగినఁ జగడము లౌ
సకలనృపులు నొత్తురు పా,
యక శోణితనదులు వాఱు ననె రెట్టఁ డిలన్. ౪౯

తా. వేంకటరాజా! ఒకనెలలో సూర్యగ్రహణము, చంద్రగ్రహణము సంభవించిన పక్షమున యుద్ధములు తటస్థించును. ఎల్లరు రాజులును నొత్తురు. భూమిపయిని విడువక రక్తపునదులు పాఱును—అని రెట్టఁ డన్నాఁడు. ౪౯

—(*) ఆకస్మికలక్షణము. (*)—

సీ. శిశువులు ముదముతోఁ జెఱువులు గట్టిన
వట్టిగుంటను దేమ పుట్టెనేని

గుడకుంభమును నుప్పుకడవ ద్రవించిన
శిఖి యాడుచును గూఁతఁ జేసెనేని
చీమలగమి గ్రుడ్లతో మిట్ట లెక్కినఁ
గకుబంతముల మంచు గప్పెనేని
మేఘంబు జలముతో మీఁదఁ గుండలదొంతు
లొండొండ పెట్టిన ట్లుండెనేని
తే. గీ. కూడి యందందుఁ దూనియ లాడెనేని,
యంబుఘట మురివ్వ నిడఁ జుమ్ము రనియెనేని
గలుగు బహువృష్టి యాకస్మికంబు గాఁగఁ,
దిమ్మభూపాలువేంకటాద్రిక్షితీంద్ర ! ౫౦

తా. తిమ్మరాజుగారి వేంకటరాజా ! బాలురు సంతోషముతోఁ గూడి చెఱువులు కట్టినను, నీరు లేని గుంటయందు తడి పుట్టినను, బెల్లపుఁ గుండయు, ఉప్పుకుండయు చెమర్చినను, నెమిలి యాడుచుఁ గేకలు వేసినను, చీమలగుంపు తమగ్రుడ్లతోఁగూడ మెట్టప్రదేశముల కెక్కినను, దిగంతములయందు కావిరి కప్పినను, మేఘములు నీటితో నిండి యొకదానిమీఁద నొకటి కుండలు దొంతులు పెట్టినట్టు లుండినను, గుంపుగాఁ జేరి యక్కడక్కడ తూనీఁగ లాడినను, నీటికుండ భూమిమీఁద నుంచినప్పుడు జుమ్మని ధ్వని చేసినను ఆకస్మికముగా—అనఁగా, తలఁపని తలఁపుగా హెచ్చువర్షము గురియును. ౫౦

వ. మఱియు నెప్పుడుఁ దప్పక పట్టెడుపట్టసంబు రేపకడఁ బట్టి చూచినఁ దుప్పువట్టి యుండినను, శునకంబులు గృహంబుల మీఁదను నదీతటాక మధ్యంబులయందును గూఁతలుపెట్టినను, అడవియీఁగలు పశువులఁ దఱిమి తఱిమి గఱచినను, నోగిరంబు వేగిరంబ బాగుదప్పినను, పిచ్చుకలు మొదలగు పులుఁగుల బలంగంబులు పచ్చిక విచ్చలవిడి మేయుచున్నను

పాడిమట్టిలో జంట గూడి పొరలినను, శుకనికరంబులు సుఖకరంబు లగుతమతమగూండ్లు విడిచి యాకసంబున కెగసినను, కాకులాకసంబున కెగిరినను మిన్నుఁజూచినను ఱెక్క లార్చినను, పిల్లు లుల్లంబున మల్లడిగొని మొల్లంబున నేల మూర్కొనుచు బుస్సుబుస్సు మనినను, నల్లని యీఁగలు మ్రోఁతతోఁ దోఁపులఁ గట్టిననీటిపై మూఁగినను, పుడమి నడుసు బుడబుడఁ బొంగినను, భుజగవ్రజంబులు కుంజ పుంజంబుల నెక్కినను, గొఱియకదుపులు సమస్థలంబుననుండి మిట్ట కెక్కినను, జలంబులనుండి మత్స్యంబులు బైటఁ బడినను, బడిన జలచరంబులు చవిచెడినను, మృగప్రకరంబులు తలలు వంచి కూఁత లిడినను, శరీరంబులు గదలించు చుండినను, మాపటివేళఁ గుండేలు నక్క యిత్తిపా మూసరవెల్లి బల్లి మొద లగునవి పులివలెఁ గూర్చుండినను శరీరంబు గదలించినను, ఆకులు దినుమృగంబు లాకులు దినుచుఁ దమతమ నెలవుల నిలిచినను, పక్షులు సమీపంబున నున్నగ్రుడ్లు మిట్టలఁ బెట్టినను, వర్షంబు గల దని రెట్టఁడు నిశ్చయించి చెప్పె. ౫౧

తా. ఇంకను చెప్పెదము వినుము. ఎల్లప్పుడును తప్పకుండఁ బట్టుకొనుచుండెడి పట్టెస మనఁగా అడ్డకత్తి ప్రొద్దునఁ బట్టుకొని చూడఁగానే త్రుప్పు పట్టి యగపడినను, కుక్కలు ఇండ్లమీఁద నెక్కియు, ఏటిలోనికిఁగాని, తటాకములోనికిఁగాని చేరియు మొఱిఁగినను, అడవియీఁగలు పశువులను తఱిమితఱిమి కఱచినను, వంటకములు వేగముగానే తిన వీలులేకుండఁ జెడిపోయినను, పిచ్చుకలు మొదలయిన పక్షులగుంపులు పచ్చికను విచ్చలవిడిగా మేయుచున్నను, అవి పాడిమంటిలోపల జతలుగాఁ గూడి పొరలినను, చిలుకలగుంపులు సుఖమును కలిగించు తమతమగూండ్లు విడిచిపెట్టి యాకాశ

మున నెగిరినను, కాకు లాకసముమీఁద నెగిరినను, అవి యాకాశమువయిపు చూచుచున్నను, ఱెక్క లల్లార్చినను, పిల్లలు మనస్సులలో ఆగటపడుచు తఱచుగా నేల వాసన చూచుచు బుస్సుబుస్సు మనుచున్నను, నల్లని యీఁగలు ధ్వనిచేయుచు, తోఁటలకుఁ గట్టిననీటిమీఁదను మూఁగినను, భూమియందలి బురద బుడబుడ మని పొంగినను, పాములసమూహము, డొంకలమీఁది కెగఁబ్రాఁకినను, గొల్లలమందలు సమస్థలముననుండి మెఱకప్రదేశముల కెక్కినను, నీటనుండి చేఁపలు బయటఁ బడినను, ఆపడినచేఁపలు రుచి చెడినను, మృగములసముదాయము తలలు వంచుకొని కూఁతలు పెట్టినను, అవి తమశరీరములను కదలించుచున్నను, రాత్రివేళను చెవులపిల్లి, నక్క, ఇఱ్ఱి, పాము, ఊసరవెల్లి, బల్లి మొదలగు జంతువులు పులి కూర్చున్నట్లు కూర్చుండినను, అవి తమశరీరములను కదలించినను, మఱియును, ఆకులు తిని జీవించెడి మృగము లాకులు మేయుచు తమతమయుండుచోట్ల నిలువఁబడినను, పక్షులు తమగ్రుడ్లను చేరువగా నున్న మెట్టప్రదేశములకుఁ దీసికొని పోయి యక్కడ వాని నుంచినను, తప్పకవాన కురియు నని రేట్టఁడు నిశ్చయించి చెప్పియున్నాఁడు. ౫౧

చ. జనతతి వానకై కడు విచారము నొందఁగ నీరుకోళ్ళుగొ
బ్బున దివినుండి యచ్చటను భూమికి వ్రాలిన మారుతంబుగ్ర
న్ననధర మ్రోయఁగావిసరినంగురియుఁ బహువృష్టిగొబ్బునన్
వనధిగభీర! తిమ్మనృపవర్యుని వేంకట రాజశేఖరా! ౫౨

తా. సముద్రునివలె గాంభీర్యముగలవాఁడా! తిమ్మరాజుగారి వేంకటరాజా! మనుజులు వానకోసము విచారమును పొందుచుండఁగా, నీరుకోళ్లాకాశముననుండి భూమిమీఁదికి వ్రాలినను, గాలి భూమి ధ్వనిచేయునట్లు వీచినను హెచ్చుగా వాన కురియును. ౫౨

క. ధరణీచక్రం బదరఁగ,
నుఱుముచు వీచినను బ్రజల కొదవును రోగో

త్కరములు దుర్భిక్షాదులుఁ,
గర మరుదుగ ననియె రెట్టకందర్పుఁ డిలన్. ౫౩

తా. వేంకటరాజా! భూమియంతయు అదరునట్లు ఉఱుముచు గాలి వీచిన పక్షమున ప్రజలకు పలువిధములయిన రోగములు పుట్టును. ఇంతేకాదు కఱవు మొదలయిన యాపదలుకూడఁ దటస్థించు నని రెట్టఁడను మన్మథుఁ డన్నాఁడు. ౫౩

సీ. పరఁగఁ గార్తెలయందుఁ బగలు వర్షింపక
రాత్రుల నధికవర్షంబు గలిగి
వివరింప నాకార్తె వెడలిపోయెడుతొలి
నాఁటిదినంబున నరులు చూడ
నర్కమండల మెఱ్ఱనై పరివేషంబు
గట్టిన ట్లుండినఁ గమలహితుని
కరము లప్పుడు వానకాళ్ళచందంబునఁ
గానిపించినను నిక్కంబుగాను
తే. గీ. ధారుణీనాయకులకుఁ దథ్యంబు గాఁగ,
నఖిలదిక్కులయందును నార్తి యొదవుఁ
బంటవలఁతికి ప్రేఁగుగాఁ బంట యొసఁగు
గాఢకీర్తిప్రతాప! వేంకటమహీప! ౫౪

తా. గాఢమయిన కీర్తియుఁ బ్రతాపమునుగల యోవేంకటరాజా! ఒప్పునట్లు కార్తెలయందు పగటిపూఁట వానలు గురియక రాత్రులయందు హెచ్చుగా కురిసినను, ఆలోచింపఁగా, ఆకార్తె ముగియుటకు ముందు దినమున మనుజులు చూచునట్టుగా సూర్యమండల మెఱ్ఱగా నుండి గుడికట్టిన యట్టు లుండినను, సూర్యునికిరణము లాసమయమున వానకాళ్లలాగున నగపడినను నిజమగునట్టులుగా రాజులకు నెల్లదిక్కులయందును పీడలు గలుగును. భూమికి బరువగు లాగున మిక్కిలిగా పంటలు పండును. ఇది నిజము. ౫౪

తే. గీ. గొప్పవడగండ్లు పడఁగ నెక్కుడుగ నపుడె,
గాలి విసరంగఁ బిడుగులు నేల రాలఁ
గ్రూర మగురక్తవర్షంబు గురిసెనేని,
పుట్టు దుర్భిక్షదశ యనె రెట్టఁ డిలను. ౫౫

తా. పెద్దపెద్దవడగండ్లు పడునప్పుడు హెచ్చుగా గాలివీచినను, పిడుగులు పడినను, భయంకరముగా నెత్తురువాన గురిసినను కఱవు తప్పక తటస్థించు నని రెట్టఁ డన్నాఁడు. ౫౫

క. అరుణోదయమున వర్షము,
గురియఁగఁ గడు నెఱ్ఱనైన క్రొమ్మెఱుఁ గడరం
బోరిపోరి పిడుగులు రాలిన,
ధరణీశులు నొత్తు రనియెఁ దా రెట్టఁ డిలన్. ౫౬

తా. అరుణోదయసమయమున వాన గురిసినను, ఆకాశమునం దంతటను ఎఱ్ఱఁగా నుండెడి క్రొత్తమేఘము వ్యాపించినను, తఱచుగా పిడుగులు పడినను రాజులు నొత్తు రని రెట్టఁ డన్నాఁడు. ౫౬

మ. అహితారణ్యదవాగ్నికీల ! నయలేఖాచార్యసంకాశ ! స
త్యహరిశ్చంద్ర ! కటాక్షసంగతదయామాత్రాత్తార్థిజాలా! దిశా
సహరిద్దంతురకీర్తిచందన! నరేశశ్రేష్ఠ ! యత్యంతధ
న్య! హరిధ్యానగరిష్ఠహృన్నళిన! దానక్షాత్రతేజోనిధీ!౫౭

తా. శత్రువు లనియెడియరణ్యములకు దావాగ్నిజ్వాలలవంటివాఁడా! నీతియందు దేవతలగురువయిన బృహస్పతితోఁ సరియైనవాఁడా ! సత్యమున హరిశ్చంద్రునివంటివాఁడా! కడకంటిచూపులతోఁ గూడినదయచేతను రక్షిం

పఁబడినయాచకసమూహము గలవాఁడా! దిగ్దిగంతరములయందు వ్యాపించిన కీర్తియనెడి చందనము గలవాఁడా! రాజులలో శ్రేష్ఠుఁడా! మిగుల ధన్యుఁడా! శ్రీహరిధ్యానముచేతను మిగుల గురువయిన హృత్పద్మముగలవాఁడా! దానమునకును, క్షాత్రమునకును, తేజస్సునకును నిధియైనవాఁడా! ౫౭

పంచచామరము. క్షమాధృతక్షమా! మహాభుజాపరాక్రమ క్రియా
కుమారకల్ప! దానకల్ప! కుంభినీశ! పాపసం
గమావధూమణీకుమార! కాంతిపంకజాహితా!
సమానకౌరవాధినాథ! సప్తసంతతీశ్వరా! ౫౮

తా. ఓర్పుచేతను ధరింపఁబడినభూమి గలవాఁడా! గొప్పదియగు బాహుపరాక్రమముయొక్క వ్యాపారముచేతను కుమారస్వామితో సమానుఁడా! దానమునకుఁ గల్పవృక్షమువంటివాఁడా! భూమికిఁ బ్రభువయిన వాఁడా! పాపసంగమ్మయనెడి స్త్రీరత్నమునకుఁ గుమారుఁడా! కాంతియందు చంద్రునివంటివాఁడా! మానమునందు దుర్యోధనునితో సమానుఁడా! సప్తసంతానములకును ప్రభువా! ౫౮



# చతుర్థాశ్వాసము.

క. శ్రీవిమలతర! యహోబల,
దేవకథాకర్ణనైకధీగరిమ! సుధీ!
పావనగుణభూషణ! భ,
ద్రావహ! కొండ్రాజువేంకటాద్రినరేంద్రా! ౧

తా. ఐశ్వర్యముచేతను నిర్మలమయినవాఁడా! అహోబలనరసింహస్వామియొక్క కథలను వినుటయందే ముఖ్యముగాఁ బ్రవర్తించుచున్న బుద్ధియొక్క గౌరవము గలవాఁడా! మంచిబుద్ధిగలవాఁడా! పవిత్రములయిన గుణములే అలంకారములుగాఁ గలవాఁడా! ఆశ్రితులకును, రాజ్యమునకును క్షేమమును గలుగఁజేయువాఁడా! కొండ్రాజుగారి వేంకటరాజా! ౧

—(*) గ్రహచారలక్షణము. (*)—

సీ. ఒకరాశి నెల యుండు నొప్పఁగా సూర్యుండు
బుధభార్గవుల్ మఱి భూమిజుండు
నెలమీఁద నఱ యుంద్రు నిర్జరాచార్యుండు
పదిరెండునెల లుండు భానుజుండు
ముప్పదినెల లుండు మొగి రాహు కేతువు
లిరువదినెల లుంద్రు హిమకరుండు
తర్కింప నట దినద్వయమును బదునైదు
గడియలు జగతిఁ బ్రఖ్యాతముగను
తే. గీ. క్రమముతోడుత గ్రహములగతులఁ దెలిసి,
తెలుపవలయును శుభములు ధీరవరులు
జన్యనిశ్శంక జగదభిశాసనాంక!,
ప్రాభవోపేంద్ర! వేంకటపార్థివేంద్ర! ౨

తా. జన్యనిశ్శంక.—జగదభిశాసన—అనుబిరుదులచేతను అంకితమయినవాఁడా! ప్రభుత్వమునం దుపేంద్రునివంటివాఁడా! రాజేంద్రుఁడవగు వేంకటరాజా! సూర్యుఁ డొప్పునట్టుగా నొకరాశియందు ముప్పదిదినములుండును. బుధుఁడును, శుక్రుఁడును, అంగారకుఁడును నలువదియైదుదినములొకరాశియం దుందురు. దేవతలకు గురువయినబృహస్పతి సరిగా పండ్రెండునెల లొకరాశియం దుండును. సూర్యునికొడుకయినశని ముప్పదినెల లనఁగా రెండున్నఱసంవత్సర మొక్కరాశియందుండును. రాహుకేతువు లొకసంవత్సరము, ఎనిమిదినెలలుమాత్ర ముందురు. ఆలోచింపఁగా చంద్రుఁ డొకరాశియందు రెండుదినములపయిని మఱిపదునైదుగడియలుండును. కావున నేయే గ్రహము లెచ్చటనెచ్చట నెంతెంతకాలమువఱకు నుండునో ఆయాసంగతులన్నియు తెలిసికొని స్పష్టముగా పండితులు శుభములను దెలుపఁదగుదురు. ౨

క. హిమభూధరంబు మొదలుగ,
విమలస్థితి మించుజాహ్నవీనదివఱ క
య్యమృతాంశుతనయు క్షేత్రము,
విమలాభేద్యప్రతాప! వేంకటభూపా! 3

తా. విమలమయి భేదింపరానిదయిన ప్రతాపము గలవాఁడా! వేంకటరాజా! హిమవత్పర్వతము మొదలుకొని నిర్మలమయినస్థితితో నొప్పుచుండెడి గంగానదివఱకును చంద్రునికొడుకయిన బుధునిక్షేత్ర మని తెలియఁదగును. 3

క. అలవింధ్యశిఖరి యాదిగఁ,
గలుషవ్రజహారణ యయిన గౌతమిదాఁక
దలఁపఁగ శుక్రక్షేత్ర,
మ్మలఘుబలాటోప! వేంకటాద్రిమహీపా! ౪

తా. అధికమయిన బలముయొక్క యాటోపము గలవాఁడా! వేంకటాద్రిరాజా! వింధ్యపర్వతము మొదలుకొని పాపముల నన్నిటిని

హరించునదియైన గోదావరీనదివఱకును ఆలోచింపఁగా శుక్రునిక్షేత్ర మని
తెలియఁదగును. ౪

క. గుఱుతుగ దురితోత్కరసం,
హర యగునాపరమగంగ యాదిగ లంకా
పురిదనుకఁ గుజక్షేత్రము,
హరిభక్తివిశాల! వేంకటాద్రినృపాలా! ౫

తా. హరిభక్తిచేతను గొప్పవాఁడవయిన వేంకటాద్రిరాజా! పాపములసమూహమును పోఁగొట్టునదియైన యాగోదావరీనది మొదలుకొని లంకాపట్టణమువఱకును అంగారకక్షేత్ర మని తెలియఁదగును. ౫

క. ఒకరాశిని శన్యంగా,
రకు లుండినఁ గఱవు దోఁచు రాజులకుఁ దగం
బ్రకటంబుగఁ గలహము లగు,
నకలంకగుణాఢ్య! వేంకటాద్రిమహీపా! ౬

తా. కలంకములేని గుణములతో ఒప్పుచున్న వేంకటాద్రిరాజా! శని—అంగారకుఁడును ఒక్కరాశియందుఁ జేరినట్టయితే కఱవు సంభవించును. రాజులకు స్పష్టముగాఁ గలహము లధిక మగును. ౬

ఆ. వె. కడఁగి యొక్కరాశి గ్రహములు మూఁడున్న,
రాజులకును నాల్గు గ్రహము లున్న
భూసురులకుఁ గీడు పుట్టును నిశ్చయ,
మ్మనియె రెట్టఁ డార్యు లభినుతింప. ౭

తా. వేంకటరాజా! ఒక్కరాశియందు మూఁడు గ్రహము లుండిన పక్షమున రాజులకు కీడు కలుగును. ఒక్కరాశియందు నాలుగుగ్రహములు చేరియున్నపక్షమున బ్రాహ్మణులకు కీడు కలుఁగును. ఇది తప్ప నని పెద్దలు కొనియాడునట్లు రెట్టఁ డనినాఁడు. ౭

క. ధ్రువముగ నొకరాశిని రా,
హువుతోడుత నైదుగ్రహము లుండిన వానల్
భువి లేక చెడును బ్రజ యనెఁ,
గవిజననుతుఁ డైనరెట్టకందర్పుఁ డిలన్. ౭

తా. వేంకటరాజా! నిశ్చయముగా ఒక్కరాశియందు రాహువుతోఁగూడ నయిదుగ్రహములు చేరియుండినట్టయితే భూమియందు వానలు కురియక ప్రజలు చెడిపోవుదు రని కవీశ్వరులచేతను కొనియాడఁబడినవాఁ డగురెట్టఁ డనుమన్మథుఁ డన్నాఁడు. ౭

క. గురుఁడు బుధుఁ డొక్కరాశిని,
దిరముగ నుండినను వసుమతీస్థలి వానల్
పరిపూర్ణంబుగఁ గురియును,
హరిసేవాధుర్య! వేంకటాధిపవర్యా. ౮

తా. శ్రీహరిని సేవించుభారమును వహించినవాఁడా! వేంకటరాజా! గురుఁడును, బుధుఁడును ఒక్కరాశియందు స్థిరముగా నిలిచి యున్నపక్షమున భూతలమునందు సమృద్ధిగా వానలు గురియును. ౮

సీ. ఇనుఁడు ముందు బుధుండు వెనుకను నడుమను
గవి యున్న మహి నంబు గలుగ దంద్రు
హరిదశ్వుముందట నంగారకుం డైన
శశి యైన నడచిన క్షామ మగును
సుర్వీజశశిగురు లొకరాశి నుండినఁ
దనరును మూఁడేండ్లదాఁకఁ గఱవు
కుజకావ్యశనిబుధగురు లొకచో నున్న
రోహిణియందు నాలోహితాంగుఁ
తే. గీ. డరయ వక్రించి యుండిన నగును వఱపు,
మఱియు భౌముండు దేవతామాత్యుఁ డొక్క

రాశి నుండినఁ గలవును రణము లొదవుఁ,
దప్ప దిది యనె రెట్టకందర్పుఁ డిలను.                    ౧౦

తా. వేంకటరాజా! ముందర సూర్యుఁడును, వెనుకను బుధుఁడును, మధ్యను శుక్రుఁడును ఉన్నట్టయితే భూమియందు నీరుండ దని చెప్పుదురు. సూర్యునకు ముందర నంగారకుఁడుగాని, చంద్రుఁడుగాని నడచినట్టయితే కలవు తటస్థించును. అంగారకుఁడు, చంద్రుఁడు, గురుఁడు—వీ రొక్క రాశియం దుండినపక్షమున మూఁడేండ్లవఱకును కలవు తటస్థించును. అంగారకుఁడును, శుక్రుఁడును, శనియు, బుధుఁడును, గురుఁడును ఒక్కరాశియం దుండినను, అంగారకుఁడు రోహిణియందు వక్రించినను వానలు గురియవు. ఇంతే కాదు. అంగారకుఁడును, బృహస్పతియు నొక్కరాశియం దుండిన పక్షమునఁ గలవును, యుద్ధములును తటస్థించును. రెట్టమన్మథుఁ డీచెప్పిన ఫలములు తప్ప వని యన్నాఁడు.                    ౧౦

క. గురుభౌములనడుమ శనై,
శ్చరుఁ డుండిన హానియగుఁ బ్రజకు మఱి కుజుఁడా
గురుభృగుల నడుమ నుండిన,
నరుదుగ క్షామంబు వచ్చు ననె రెట్టఁ డిలన్.                    ౧౧

తా. వేంకటరాజా! బృహస్పతికిని, అంగారకునకును మధ్యను శని గ్రహ ముండినట్టయితే ప్రజలకు కీడు కలుగును. బృహస్పతికిని, శుక్రునకును నడుమను అంగారకగ్రహ ముండినపక్షమున నాశ్చర్యమయినకలవు వచ్చు నని రెట్టఁ డన్నాఁడు.                    ౧౧

క. దినకర భౌములనడుమను,
శని యుండిన మిగుల వేగ సమయుదురు ధరా
జను లెల్ల నిక్కువం బిది,
యనియె రెట్టనకవీంద్రుఁ డార్యులు వొగడన్.                    ౧౨

తా. వేంకటరాజా! సూర్యునకును, అంగారకునకును మధ్యను శనిగ్రహ ముండినచో మనుజులు వేగముగానే చత్తురు. ఇది నిజము—అని పెద్దలు పొగడునట్టుగా రెట్టకవీంద్రుఁ డన్నాఁడు. ౧౨

ఆ. వె. భరణి న_స్తమించుభౌముఁ డుండఁగ రాహు,
వతనిఁ గూడెనేని యధికముగను
క్షామబాధ యొప్పు భూమిపై ననియెను,
బట్టభద్రు లెన్న రెట్టఘనుఁడు. ౧౩

తా. వేంకటరాజా! భరణినక్షత్రమునం ద_స్తమించుచున్న అంగారకుఁ డుండఁగా, అతనితో రాహువు కలసినట్టయితే హెచ్చుగానే కఱవు వలనిబాధ కలుగునని పట్టభద్రు లెన్నునట్టుగా రెట్టపండితుఁ డన్నాఁడు. ౧౩

క. గురుశని లొకచో నుండిన,
నరుదుగ సంవత్సరత్రయముదాఁకఁ గడుం
దెరువులు చెడుఁ బసు లణఁగును,
ధరణీస్థలి ననియె రెట్టధన్యుఁడు వేడ్కన్. ౧౪

తా. వేంకటరాజా! గురుఁడును, శనియును ఒకరాశియం దుండినట్టయితే ఆశ్చర్యముగా మూఁడేండ్లవఱకును మిక్కిలిగా దారులు చెడిపోవును. పశువులు చచ్చిపోవును—అని రెట్టఁ డనెడి ధన్యాత్ముఁడు వేడుకతో నన్నాఁడు. ౧౪

ఆ. వె. మున్ను చంద్రుఁ డతనివెన్నున గురుభార్గ,
వులును వెనుక రవియుఁ బొలుపు మిగుల
నుండిరేని భూమి మెండుగా వానలు,
గురియు ననియె రెట్టకోవిదుండు. ౧౫

తా. వేంకటరాజా! ముందర చంద్రుఁడును, అతనివెనుకను గురుఁడును, శుక్రుఁడును, వారివెనుకను సూర్యుఁడును ఉండినట్టయితే భూమియందు హెచ్చుగా వానలు కురియు నని రెట్టపండితుఁ డన్నాఁడు. ౧౫

తే. గీ. శుక్రుఁ డీశాన కెదు రైనచోటఁ గాక,
యర్కజునిఁ గూడి యెచ్చట నైన నున్నఁ
జాలఁ గురియును వర్షంబు మేలు భువికి,
వినుము కొండ్రాజుతిమ్మయవేంకటేంద్ర! ౧౬

తా. కొండ్రాజు తిమ్మరాజుగారి వేంకటరాజా! ఇంకను జెప్పెద ము వినుము. శుక్రుఁ డీశాన్యదిక్కున కెదురుగాఁగాక మఱి యేదిక్కున నయినను శనితోఁ గూడి యుండినపక్షమున హెచ్చుగా వాన కురియును. భూమికి మేలు కలుగును. ౧౬

క. రాత్రించరగురుచంద్రులు,
మిత్రక్షేత్రముల నున్న మిగుల శుభం బౌ
ధాత్రీజనులకు వైభవ,
వృత్రాహిత ! తిమ్మరాజువేంకటనృపతీ! ౧౭

తా. వైభవమునందు దేవేంద్రునివంటివాఁడా! తిమ్మరాజుగారి వేంకటరాజా! శుక్రుఁడును, చంద్రుఁడును మిత్రక్షేత్రముల నుండినట్ట యితే భూమియందలి జనులకు మిగుల శుభములు గలుగును. ౧౭

తే. గీ. గురుభృగుశశాంకు లొక్కటఁ గూడి యున్న,
ధరణిసుతదైత్యగురులముందఱను దేవ
మంత్రి నడచినఁ గలదు సమగ్రవృష్టి,
విమలగుణసాంద్ర ! తిమ్మయవేంకటేంద్ర! ౧౮

తా. నిర్మలములయిన గుణములతో నిండారినవాఁడా! తిమ్మరాజు గారి వేంకటరాజా! గురుఁడును, శుక్రుఁడును, చంద్రుఁడును ఒక్కరాశి యం దుండినను, అంగారకునకును, శుక్రునకును ముందర గురుఁడు నడచినను సంపూర్ణమయిన వాన కురియును. ౧౮

సీ. శనికి ముందుగ సురాచార్యుండు నడచినఁ
బ్రజలకు నాయేఁడు భయము గల్గు

గురుఁడును గుజశనైశ్చరులు నొండొరులను
జూచు చుండినఁ గడుఁ జోద్యముగను
హిమగిరిసేతుమధ్యముననుగల్గిన
నృపులు యోధులు నొత్తు రపరిమితము
గురుశనిశుక్రులు గూడి యుండిన మఱి,
గంగ యాదిగ మంచుగట్టుదాఁక
తే. గీ. స్ఫోటకంబులు మొదలగు భూరిరోగ,
పుంజములచేత భూమిని బుట్టుజనులు
సమయుదు ర టంచుఁ జెప్పె నిశ్చయము గాఁగఁ,
దజ్జ్ఞుఁ డైనట్టి రెట్టకందర్పుఁ డుర్వి. ౧౯

తా. వేంకటరాజా ! శనికి ముందర గురుఁడు నడచినపక్షమున, ఆసంవత్సరమున ప్రజలకు భయములు కలుగును. బృహస్పతియును, శనియును, అంగారకుఁడును ఒకరి నొకరు చూచుచున్నట్టయితే మిక్కిలి ఆశ్చర్యకరముగా హిమవత్పర్వతమునకును, సేతువునకును మధ్యనున్న రాజులును, భటులును పరిమితి లేకుండ నొప్పి పొందుదురు. గురుఁడును, శనియును, శుక్రుఁడును ఒక్క రాశియందు చేరి యుండినట్టయితే గంగానది మొదలుకొని హిమవత్పర్వతము వఱకును స్ఫోటకములు మొదలయిన గొప్ప రోగములచేతను భూమియందుఁ బుట్టియున్నజనులు చనిపోవుదు రని ఆశాస్త్రము నెఱిఁగిన రెట్టకందర్పుఁడు నిశ్చయముగా చెప్పియున్నాఁడు. ౧౯

క. దైతేయగురుఁడు బుధుఁడును,
స్వాతీస్థితు లైనయపుడు వానలు గురియున్
శీతాంశుఁడు తోఁ జన నుఁ,
ర్వీతలమున వాన గురియు వేంకటనృపతీ! ౨౦

తా. వేంకటరాజా ! శుక్రుఁడును, బుధుఁడును స్వాతీ నక్షత్రమునందున్నసమయమున వానలు గురియును. వారితో చంద్రుఁడుకూడ నడచినను వానలు కురియును. ౨౦

తే. గీ. హేవళంబివత్సరమున నినసుతుండు,
కుంభమున నుండఁగా సురగురుఁడు సింహ
రాశి నుండిన నొకపాలు ప్రజలు నిలిచి,
గిట్టుదురు మూఁడుపాళ్ళని రెట్టఁ డనియె. ౨౧

తా. వేంకటరాజా! హేవలంబిసంవత్సరమున సూర్యుని కొడుకయినశని కుంభరాశియం దుండఁగా, బృహస్పతి సింహరాశియం దుండినట్టయితే మూఁడువంతులు ప్రజలు చనిపోయి, ఒక్కవంతు ప్రజలు నిలిచియుందు రని రెట్టఁ డన్నాఁడు. ౨౧

చ. క్షితిఁబరిధావివర్షమున సింహమునన్ శనియుండఁగా బృహస్పతి యలవృశ్చికంబునను బాగుగ నుండినఁ గృష్ణవేణి నిర్గతజలయౌ రుజార్తిని ధరాప్రజ నొచ్చును జోరబాధలున్ సతతము గల్గియుండును నిజంబనె రెట్టఁడు విస్మయంబుగన్.

తా. వేంకటరాజా! భూమియందు, పరీధావి సంవత్సరమున సింహరాశియందు శనిగ్రహ ముండఁగా, బృహస్పతి యనుగ్రహము వృశ్చికరాశియం దుండినట్టయితే కృష్ణానదియందలి జల మంతయును బోవును. భూమియందలిప్రజలు రోగబాధలచేతను నొత్తురు. దొంగలవలని బాధలును ఎల్లప్పుడును కలిగి యుండును. ఇది నిజమే యని యాశ్చర్యము గలుగునట్టు రెట్టఁ డన్నాఁడు. ౨౨

చ. నలువుగఁ గ్రోధివత్సరమునన్ శని మీనమునన్ వసింపఁగా వలమరి కన్యకన్ గురుఁడు వచ్చినఁ దస్కరరోగబాధలన్ నలుగుదు రుర్విలోజనులు నర్మదనుండి హిమాద్రిదాఁక వెగల్గమగు క్షామ మౌననియె గట్టిగ రెట్టన ధారుణీస్థలిన్. ౨౩

తా. వేంకటరాజా! క్రోధిసంవత్సరమున శనిగ్రహము, మీనరాశియందుండఁగా, కన్యారాశియందు గురుఁడు ప్రవేశించి యుండినట్టయితే భూమియందలిజనులు దొంగలవలని బాధలచేతను, రోగములవలని బాధల

చేతను నలిగిపోవుదురు. నర్మద మొదలుకొని హిమాలయము లేక మేరువు వఱకును అధిక మయిన క్షామము సంభవించును—అని గట్టిగా రెట్టఁ డనుదిట్టఁ డనియున్నాఁడు. ౨౩

చ. అనిమిష రాజమంత్రి ప్రభవాబ్దమునం దలకన్యనుండఁగా
నినజుఁడు గూడెనేని గణియింపఁగ నర్మదయొద్దనుండి శీ
తనగముదాఁక వాన యొకతావున లేక ధరాజనంబు లీ
ల్గును గడు వింతగా ననియెలోకులు మెచ్చఁగ రెట్టఁడిమ్మునన్.

తా. వేంకటరాజా! దేవతలకుఁ బ్రభువగు యింద్రునికి మంత్రి యయినగురుఁడు ప్రభవసంవత్సరమునందు కన్యారాశియం దుండఁగా, అతనితో శనిగ్రహము కలసినట్టయితే ఆలోచింపఁగా నర్మద మొదలుకొని మంచుగొండవఱకును ఒక్కచోట నయినను వర్షము కురియక భూమియందలి జనులు చచ్చిపోవుదు రని మిగుల నాశ్చర్యము గలుగునట్టులు లోకులు మెచ్చునట్లు రెట్టఁ డనియున్నాఁడు. ౨౪

తే గీ. అరయ నక్షత్రరాసులయందు నొకట,
నమరగురునకు శని సప్తమమున నైన
నెనిమిదింటను నైన నుండినను వృష్టి,
గలుగు ననియెను రెట్టఁడు ఘనయశుండు. ౨౫

తా. వేంకటరాజా! ఆలోచింపఁగా నక్షత్రములయందుఁగాని, రాసులయందుఁగాని యొకచోటను గురునకు శని సప్తమస్థానమునందైనను, అష్టమస్థానమునందైనను ఉండినట్టయితే వర్షము గురియు నని గొప్పకీర్తిగలవాఁ డయిన రెట్టపండితుఁ డన్నాఁడు. ౨౫

క. శనిరాహుసూర్యభూమిజు,
లొనరఁగ నొకరాశి నున్న నుర్వీవలయం
బునఁ గలహంబులు పుట్టును,
విను దప్పదు తిమ్మరాజువేంకటనృపతీ! ౨౬

తా. తిమ్మరాజుగారివేంకటరాజా! వినుము. శని, రాహువు, సూర్యుఁడు, అంగారకుఁడును ఒప్పునట్టుగా ఒక్కరాశియం దుండినట్లయిన భూమియందు కలహములు తటస్థించును. తప్పదు. ౨౬

క. రవిశీతకిరణగీష్పతి,
కవిబుధు లొకరొకరిఁ జూచు కనుఁగొనుచున్నన్
భువి లేదు భయము జనులకుఁ,
బ్రవిమలయశ! వేంకటాద్రిపార్థివవర్యా. ౨౭

తా. నిర్మలమయిన కీర్తిగలవాఁడా! వేంకటాద్రిరాజశ్రేష్ఠా! సూర్యుఁడు, చంద్రుఁడు, గురుఁడు, శుక్రుఁడు, బుధుఁడు—అనునీగ్రహములలో నొకగ్రహమునింటిని మఱొకగ్రహము చూచుచుండినట్టయితే భూమియందలి జనులకు భయము లేదు. ౨౭

తే. గీ. చిత్తతారను స్వాతి నాశ్లేషయందు,
నాదిఁ గడపట గురుఁ డస్త మందెనేని
నుదితుఁ డగునేని కడు న్యాయ ముడుగు నుర్వి,
నడరు నన్యాయ మనె రెట్టఁ డఖిలవిదుఁడు. ౨౮

తా. వేంకటరాజా! చిత్తనక్షత్రమునందును, స్వాతినక్షత్రమునందును, ఆశ్లేషనక్షత్రమునందును మొదటిభాగమునందును కడపటిభాగమునందును గురుఁ డుదయించినను, అస్తమించినను భూమియందు మిక్కిలిగ న్యాయ ముడిగిపోవు ననియు, అన్యాయ మధిక మగు ననియు, సమస్తము తెలిసిన రెట్టఁ డన్నాఁడు. ౨౮

ఆ. వె. శని స్వభావగతిని జరియింప గురుఁడు వ,
క్రించెనేని పంట మించఁబోదు
జగడములుఁ దెవుళ్లు నగుఁ బెక్కు లుర్విలో
ననియె రెట్టసుకవి యార్యు లెన్న. ౨౯

తా. వేంకటరాజా! శని స్వభావగతి చేతను సంచరించుచుండఁగా, గురుఁడు వక్రించినట్టయితే పంట లధికముగా పండవు. భూమియందు పలు విధములయిన జగడములును, రోగములును సంభవించు నని పెద్ద లెంచు నట్టుగా రెట్టకవీశ్వరుఁ డన్నాఁడు. ౨౯

క. అలమోదుగుపూచాయయు,
వలనుగఁ బుట మిడిన పసిఁడివన్నెయురీతిన్
వెలసి కుజుం డుదయించిన,
విలసిల్లును వాన జగతి వేంకటనృపతీ! ౩౦

తా. వేంకటరాజా! కుజగ్రహము మోదుగుపూవువన్నె గలిగియు, పుటము వేసినబంగారురంగుగల్గియు ఉదయించినట్టయితే భూమియందు వానలు కురియును. ౩౦

చ. అనువుగ శీతభానుసుతుఁడాశ్వయుజమ్మునయందుఁగార్తికం
బున నుదయించినన్ రుజలు పోరులుక్షామమువచ్చుడామరం
బున హృదయవ్యథ ల్గలుగుభూప్రజనొచ్చునుగార్గ్యమౌనిసె
ప్పినయది యామతంబనియెఁ బెద్దలు మెచ్చఁగ రెట్టఁడిమ్మహిన్.

తా. వేంకటరాజా! ఒప్పునట్టుగా చంద్రునికొడుకు కనఁగా బుధుఁ డాశ్వయుజమాసమునందుఁ గాని, కార్తికమాసమునందుఁ గాని ఉదయించినట్టయితే రోగములు, యుద్ధములు, కఱవు, తటస్థించును. కొల్ల మొదలయిన దేశోపద్రవముచేతను మనసులకుఁ గష్టములు గలుగును. భూమియందలిజనులు నొత్తురు. ఈమతము గార్గ్యుఁ డనుమునీశ్వరుఁడు చెప్పిన దని యాభూమి యందలిపెద్దలు మెచ్చులాగున రెట్టఁ డనియున్నాఁడు. ౩౧

తే. గీ. శ్రావణాషాఢములయందు సౌరి యుదయ,
మందినను క్షామ మడరును వ్యాధు లొదవు
నావులకుఁ గీడు దోఁచు రత్నాకరోక్త,
మైనమత మనె రెట్టఁ డహీనమతిని. ౩౨

తా. శ్రావణమాసమునందుఁ గాని, ఆషాఢమాసమునందుఁ గాని, శని యుదయించిన ట్టయితే కఱవు సంభవించును. రోగములు కలుగును. ఆవులకు హాని కలుగును. ఇది రత్నాకరమునందు చెప్పఁబడిన మత మని మంచి బుద్ధితోఁ రెట్టఁ డన్నాఁడు. 3౨

తే. గీ. శ్రావణాషాఢ వైశాఖసమయములను,
శీతకిరణునిపుత్త్రుండు సిరి వహింప
నుదయ మొందిన శుభములు పొదలు నండ్రు,
గానసాహిత్యలోల! వేంకటనృపాల! 33

తా. గానమునందును, సాహిత్యమునందును ఆశగలవాఁడా! వేంకటరాజా! శ్రావణమాసమునందుఁ గాని, ఆషాఢమాసమునందుఁ గాని, చంద్రుని కొడుకయిన బుధుఁడు శోభను వహించున ట్లుదయించిన ట్లయితే జనులకు శుభములు గలుగు నని పెద్ద లందురు. 33

తే. గీ. సౌమ్యుఁ డుదయించుతఱిఁ బైఁడిచాయ కెంపు,
చాయ యుమ్మెత్తపూఁచాయ చెలఁగినట్టు
లున్న మంచిదె పైవర్ణ మెన్న నేది
గాదు ప్రజలకు వినుము వేంకటనృపాల! 3౪

తా. వేంకటరాజా! వినుము. బుధుఁ డుదయించు సమయమున బంగారువంటి రంగు, కెంపువంటిరంగు, ఉమ్మెత్త పువ్వువంటిరంగు ప్రకాశించున ట్టున్నట్టయితే ప్రజలకు మంచిదే కాని, ఆవన్నెలు లేకపోతే మాత్రము మంచిది గాదు. 3౪

క. శతముఖదేశికుఁ డుదయిం,
చుతఱిఁ స్ఫటికంబురీతి సురుచిరధవళ
ద్యుతి నుండు ననియె గార్గ్యుఁడు,
ప్రతిభోజ్జ్వల! వేంకటాద్రిపార్థివతిలకా! 3౫

తా. ప్రతిభచేతను ప్రకాశించువాఁడా! వేంకటాద్రి రాజశ్రేష్ఠుఁడా! దేవేంద్రుని కాచార్యుఁడయిన గురుఁ డుదయించునప్పుడు పటికవలె మిక్కిలి మనోహరమయిన తెల్లనికాంతితో నుండు నని గార్గ్యుఁ డనుముని యన్నాఁడు. ౩౫

సీ. తిలకింప జ్యేష్ఠ యాదిగ నాలుకారల
యందును స్వాతీత్రయంబునందు
శుక్రోదయిం బైన శుభ మగు మఱి శుక్రుఁ
డుదయించి యుండంగఁ ద్రిదశమంత్రి
సప్తమంబున నున్న సరవితో వెలిపంట
పశ్చిమభూమి డెబ్బదియెనిమిది
యోజనంబులమేర రాజిల్లుఁ బంటలు
సరవితోఁ గృష్ణపక్షంబునందు
తే. గీ. మించి పంచమి నలయష్టమీచతుర్ద,
శులను శుక్రోదయం బైన జొన్నచేలు
మేలుగా ఫలియించు భూపాలకులును,
వెలయుదురు వైభవంబుల వేంకటేంద్ర! ౩౬

తా. వేంకటరాజా! ఆలోచించి చూడఁగా, జ్యేష్ఠయనెడి నక్షత్రము మొదలుకొని ఆఱునక్షత్రములయందును, అనఁగా జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణము, ధనిష్ఠ—అనునీయాఱు నక్షత్రములయందును, స్వాతి, విశాఖ, అనూరాధ—అను నీ మూఁడు నక్షత్రములయందును, శుక్రుఁ డుదయించిన ట్టయితే జనులకు శుభములు కలుగును. ఇంతే కాదు. అట్లు శుక్రుఁ డుదయించియున్నప్పుడు గురుఁ డాశుక్రునికి సప్తమస్థానమునం దుండినట్టయితే శుభములు గలుగును. వెలిపంట పండుటయేకాక, పశ్చిమప్రాంతమునందు డెబ్బదియెనిమి దామడవఱకును పంటలన్నియును పండును. ఆశుక్రుడు కృష్ణపక్షమునందలి పంచమినాఁడు గాని, అష్టమినాఁడు గాని, చతుర్దశినాఁడు గాని ఉదయించినపక్షమున

సస్యములు బాగుగా ఫలించును.; రాజులును హెచ్చుగా సంతోషముతోను వైభవముతోను ప్రకాశింతురు. ౩౬

సీ. నలువొంద శుక్రుండు నల్ల నై యున్నను
హెచ్చుఁ బోరులు కడు నెఱ్ఱ నైన
నస్త్రబాధలు గల్గు నాకసం బావన్నెఁ
దనరిన రోగముల్ దనరు మిగుల
నతఁడే హరితవర్ణ మైనఁ దస్కరబాధ
పసపువర్ణము గల్గ భయము గలుగు
భసితవర్ణం బైన వెస దేహబాధలు
పాటిల్లు భువిలోనఁ బ్రజల కెల్ల
తే. గీ సరవి నీవర్ణములు లేక సహజ మైన,
ధవళవర్ణంబునను సుధాధాము మించి
యుండెనేని సుభిక్ష మై యుండు నెపుడు,
బలజితనృగేంద్ర ! వేంకటపార్థివేంద్ర! ౩౭

తా. బలముచేతను సింహములను జయించినవాఁడా ! వేంకటరాజా! శుక్రుఁడు నల్లనివర్ణము గలవాఁడయి యున్నయెడలను, యుద్ధము లధికమగును. మిగుల నెఱ్ఱనిరంగు గలవాఁ డయి యున్నపక్షమున, భూమియందలి ప్రజల కాయుధములవలన బాధలు గలుగును. ఆకాశ మారంగుగలది యయినయెడలను మిగుల రోగములు కలుగును. ఆశుక్రుఁడే ఆకుపచ్చరంగు గలవాఁ డయినపక్షమున దొంగలవలన బాధలు గలుగును. పసుపుపచ్చరంగు గలవాఁ డయి యాశుక్రుఁ డున్నపక్షమున భయములు గలుగును. శుక్రుఁడు బూడిదరంగు గలవాఁ డయినట్టయితే దేహములకు బాధలు గలుగును. వరుసగా నిపుడు చెప్పినరంగులు లేక శుక్రుఁడు తనకు సహజమయిన తెల్లని కాంతితో చంద్రుని మించినవాఁడయి యున్నట్టయితే యెల్లప్పుడును కఱవులు లేక భూమి యంతయు సుభిక్షముగ నుండును. ౩౭

సీ. శని యుదయించుచోఁ జారువైదూర్యకాం
 తితోడ నగిసెపూచాయతోడ
నలరి యున్న సుభిక్ష మగు నెఱ్ఱనై యున్న
 బహువిధప్రహరణభయము గలుగు
భసితవర్ణంబునఁ బరఁగుచు నుండిన
 డామరవ్యథ మహోద్దామ మగును
నల్లనై యుండిన నలుకువ వాటిల్లు
 బహువన్నియలు గనుపట్టి యున్న

తే. గీ. ఘనతరశ్వాసకాసరోగములచేత,
దారుణస్ఫోటకామయదశలచేత
సత్తుగా భూమిజనములు నొత్తు రనిరి
నాగరకుఁ డైనయా రెట్టనప్రభుండు. ౩౮

తా. వేంకటరాజా! శని ఉదయించునప్పుడు సొగసయిన వైదూర్యమణియొక్క కాంతివంటికాంతితోను, అవిసెపూవన్నెవంటి వన్నెతోను ప్రకాశించుచు ఉన్నపక్షమున భూమి సుభిక్షము గలదియై ప్రకాశించును. ఎఱ్ఱనికాంతి గలవాఁడయి యున్నపక్షమున అనేకవిధములయిన యాయుధములవలన బాధలు గలుగును. ఆశని బూడిదరంగు గలవాఁడయి యొప్పుచున్నట్టయితే కొల్లమొదలయిన దేశోపద్రవమువలనిబాధ మిక్కిలి గొప్పగా నుండును. అతఁడు నల్లనికాంతి గలవాఁడయి యుండినపక్షమున జనులకు నలుకువ సంభవించును. ఆశని పెక్కురంగులు గలవాఁడయి యగపడినట్టయితే భూమియందలిజనులు మిగుల గొప్పవి యగు శ్వాసము—కాసము అనురోగములచేతను, భయంకరమయిన స్ఫోటక మనియెడిరోగముచేతను అధికముగా నొత్తు రని నాగరకుఁడయినయారెట్టపండితుఁడు పెద్ద లెంచునట్టుగా ననియున్నాఁడు. ౩౮

సీ. సూర్యునిముందట శుక్రుండు నడచిన
నెసఁగు వానలు భానుభృగులకడను
శని యున్న నట్ల వర్షము కావ్యముందట
వరుస నేగ్రహ మున్న వాన లేదు
మహీసుతుముందట గ్రహరాజు నడచిన
వెలిమొగుల్ దివిఁ బర్వి వృష్టి గురియు
బృందారకాచార్యముందట సౌమ్యుండు
సౌమ్యునిముందట జలజహితుఁడు

తే. గీ. జలజహితుముందటను దైత్యకులగురుండు,
నడచినను వాన గురియు నెక్కుడుగ ధరణి
సాహసాటోప! సూర్యవంశప్రదీప!
తిమ్మభూపాలు వేంకటాద్రిక్షితీంద్ర! ౩౯

తా. సాహసముయొక్కయాటోపముగలవాఁడా! సూర్యవంశమునకు దీపమువంటివాఁడా! తిమ్మరాజుగారి వేంకటరాజా! సూర్యునకు ముందర శుక్రుఁడు నడచుచుండినపక్షమున హెచ్చుగా వానలు కురియును. సూర్యునకును, శుక్రునకును వెనుకభాగమున శని యుండినట్టయితే ఆప్రకారముగానే హెచ్చువర్షము కురియును. శుక్రునకు ముందర నేగ్రహ మున్నప్పటికిని వాన కురియదు. భూమికొడుకయిన యంగారకునిముందర సూర్యుఁడు నడచినయెడల నాకసమునందు తెల్లని మేఘములు వ్యాపించి వర్షించును. దేవతల కాచార్యుఁ డయినగురునిముందర బుధుఁడును, ఆబుధునికి ముందర సూర్యుఁడును, ఆసూర్యునకు ముందర రాక్షసులకు గురు వయిన శుక్రుఁడును నడచిన ట్టయితే భూమియం దధికముగా వానలు కురియును. ౩౯

క. ఇనుముందట భౌముఁడు భౌ,
మునిముందట భృగుకులోత్తముఁడు నడచినఁ దె

ల్లనిమొగులు గప్పి యంతట,
ననువుగ వర్షంబు గురియు నభినుతచరితా! ౮౦

తా. కొనియాడఁబడిన చరిత్రగల యోవేంకటరాజా! సూర్యునికి ముందరభాగమునందు భూమికొడు కంగారకుఁడును, ఆయంగారకునిముందర శుక్రుఁడును, నడచుచుండినపక్షమున నాకసమునందు తెల్లనిమబ్బులు వ్యాపించి భూమియం దంతటను కావలసినంతగా వాన కురియును. ౮౦

తే. గీ. తమ్మినెచ్చెలికానిముందటను బుధుఁడు,
బుధునిముందట దేవతాపూజ్యుఁ డరయ
మైత్రితో నున్న మేదినీమండలమునఁ,
గల్గుఁ దుంపరవాన వేంకటనృపాల! ౮౧

తా. వేంకటరాజా! పద్మములకు స్నేహితుఁడయిన సూర్యునిముందర బుధుఁడును, ఆబుధునిముందర దేవతలకుఁ బూజింపఁదగినవాఁ డయినగురుఁడును ఆలోచింపఁగా మిత్రత్వముతో నడచుచున్నపక్షమున భూమండలమున తుంపరవాన మాత్రమే కురియును గాని పెద్దవాన కురియ దన్నమాట. ౮౧

తే. గీ. ధరణిపుత్త్రునిముందటఁ దరణిసుతుఁడుఁ,
దరణిసుతుముందటను బూర్వసురగురుండు
నడచినను వాన గల్గు ఘనంబు గాఁగ,
నుతహరిశ్చంద్ర! వేంకటక్షితితలేంద్ర! ౮౨

తా. కొనియాడఁబడిన హరిశ్చంద్రుఁడు గలవాఁడా! వేంకటరాజేంద్రా! భూమికొడుకయిన యంగారకునిముందర సూర్యునికొడుకయిన శనియును, ఆశనికి ముందుభాగమున, పూర్వసురు లనఁగా రాక్షసులకు గురువయిన శుక్రుఁడును నడచిన ట్టయితే అధికముగానే వానలు కురియును. ౮౨

చ. శని కుజుతోడఁ గూడినను సౌరికిఁ జంద్రుఁడు దోడు రా మహీ
తనయుఁడు వక్రుఁడైన మఱి దానవదేశికుముందటం జరిం

చిన భువి వాన లేదనియె సిద్ధముగా నలగార్గ్యమౌని భూ
వినుతగుణాఢ్య! తిమ్మపృథివీపతివేంకటరాజశేఖరా! ४3

తా. భూజనులచేతను కొనియాడఁబడిన మంచిగుణములతోఁ గూడి యున్నవాఁడా! తిమ్మరాజుగారి వేంకటరాజా! శని అంగారకునితోఁ గలసి యుండినను, శనికి చంద్రుఁడు తోడు వచ్చినను, అంగారకుఁడు వక్రించినను, అతఁడు రాక్షసుల కాచార్యుఁ డయిన శుక్రునియొక్క ముందుభాగమున సంచరించినను భూమిమీఁదను వాన కురియ దని గార్గ్యుఁ డనుముసీశ్వరుఁడు సిద్ధాంతముగ ననియున్నాఁడు. ४3

క. గ్రహమాలికలోపల నల,
గ్రహపతి లేకుండెనేని కలుగదు ఫల మా
మిహిరుం డుండిన ఫల మగు,
నహితద్విపసింహ! వేంకటాధిపసింహా! ४४

తా. శత్రువు లనియెడు నేనుఁగులకు సింహమువంటివాఁడా! వేంకటరాజా! గ్రహమాలికాయోగము సంభవించినప్పు డాగ్రహముల మాలికయందు సూర్యుఁడు లేకున్నపక్షమున దానికిఁ గలుగవలసినఫలము కలుగదు. ఆతఁ డున్నచోఁ దప్పక ఫలము కలుగును. ४४

క. గ్రహమాలికలో మున్నుగ,
మహికొమరుఁడు నడచినఁ బ్రమాదంబు శుభ
గ్రహములు ముందఱ నడచిన,
బహుశుభ మగు వేంకటాద్రిపార్థివతిలకా! ४౫

తా. వేంకటరాజేంద్రా! వెనుకటి గ్రహముల మాలికయందు ముందుగా భూమికొడు కయినయంగారకుఁడు నడచుచుండెనేని ప్రమాదము తటస్థించును. అట్లు కాక, శుభగ్రహములే ముందర నడచిన పక్షమున నధికముగా శుభము కలుగును. ४౫

సీ. అసురదేశికుఁ డుత్తరాషాఢ నేనియు
మఘుతార వక్రత మలసి యున్న
సముదితుం డైన నస్తమితుఁ డై యుండిన
దారణల్ దఱుఁగు యుద్ధములు గలుగు
వర్షముల్ లేవు భూవరులకు భయము లౌ
నంగారకుండు సింహంబునందు
నైన వృషభధనుర్మీనరాసుల నైన
వక్రించి యుండిన వసుధఁ బ్రజలు
తే. గీ. భాగ మొక్కటి దక్కఁ ద్రిభాగ మెల్ల,
నణఁగిపోదురు మఱి స్వాతియందు నతఁడె
వక్రగతి నొందెనేనియు వాన గురియు,
ననియె రెట్టఁడు సకలవిద్యావిదుండు. ౪౮

తా. వేంకటరాజా! రాక్షసుల కాచార్యుఁ డయినశుక్రుఁ డుత్తరాషాఢా నక్షత్రమునం దయినను, మఘానక్షత్రమునం దయినను వక్రించినను, ఉదయించినను, అస్తమించినను వెలలు తగ్గిపోవును. యుద్ధములు తటస్థించును. వానలు కురియవు. రాజులకుభయములు తటస్థించును. అంగారకుఁడుసింహరాశియందయినను, వృషభరాశియం దైనను, ధనూరాశియం దయినను, మీనరాశియం దయినను వక్రించి యున్నట్టయితే భూమియందలిప్రజ ఒక్కవంతు మాత్రము మిగిలి తక్కిన మూఁడువంతులును నశించిపోవును. ఆకుజుఁడు స్వాతీ నక్షత్రమునందు వక్రగతిని పొందినపక్షమున వాన కురియును నని యెల్లవిద్యల నెఱిఁగినరెట్టఁ డన్నాఁడు. ౪౮

క. దనుజాచార్యునిముందట,
శని నడచిన వాన గురియు సంపూర్ణముగాఁ
బెనుచెఱువులు వ్రక్కలుగా
వినమితశాత్రవసమాజ! వేంకటరాజా! ౪౭

తా నమ్రములుగాఁ జేయఁబడినశత్రువుల సమూహము గలవాఁడా! వేంకటరాజా! రాక్షసుల కాచార్యుఁడయిన శుక్రునిముందర శని నడచిన పక్షమునఁ బెద్దపెద్ద చెఱువులు గట్లు తెగిపోయి నీరుబయటికిఁ బోవునట్లుగా గొప్పవర్షములు కురియును. ౪౭

చ. పరువడి సింహమీనవృషభంబుల వృశ్చికచాపరాసులన్
సరసిజమిత్రుజుండు మహిజాతుఁడు వక్రత నున్న డామరం
బురువడి వచ్చువారొకరినొక్కరు చూచుచు నుండినన్వసుం
ధరఁగఱవుద్భవిల్లు నెలనాళ్లకనెన్ గవి రెట్టఁ డింపుగన్. ౪౮

తా. వేంకటరాజా! సింహరాశియం దయినను, మీనరాశియం దయినను, వృషభరాశియం దయినను, వృశ్చికరాశియం దయినను, ధనూరాశియం దయినను పద్మములకు మిత్రుఁడైన సూర్యుని కొడుకు శని గాని, భూమికొడు కయిన యంగారకుఁడు గాని వక్రించియుండినపక్షమున నతివేగముగా కొల్ల మొదలయిన దేశోపద్రవము తటస్థించును. ఆశని కుజులొకరి నొకరు చూచుచున్నట్టయితే భూమియందు నెలదినములనాఁటికిఁ గఱవు తటస్థించు నని యింపుగా రెట్టఁడనియున్నాఁడు. ౪౮

ఆ. వె ఒనరఁ గుజుఁడు శనియు నొకరాశి నుండి వ,
క్రించి రేని నృపులు కినుక లాదవి
యాహవమున నొత్తు రావులు లేఁగలుఁ,
జేటు నొందు ననియె క్షితిపచంద్ర! ౪౯

తా. రాజులలోఁ జంద్రునివంటివాఁడ వయిన యోవేంకటరాజా! ఒప్పునట్టులు, కుజుఁడును, శనియు నొకరాశియందే యుండినవా రయి వక్రించిన ట్టయితే రాజులు కోపములు కలిగి యుద్ధములలోఁ జత్తురు, ఆవులును, లేగపెయ్యలును చేటును పొందు నని రెట్టఁ డన్నాఁడు. ౪౯

తే. గీ. ధరణిసుతుఁడు పునర్వసుతారయందు,
నుదయ మందిన వక్రించి యున్నఁ బంట

లెసఁగుఁ బ్రజ కెల్ల శుభ మావహిల్లి యుండు,
రిపుతమోహంస! వేంకటనృపవతంస! ౫౦

తా. శత్రువు లను చీఁకటికి సూర్యునివంటివాఁడ వయిన యో వేంకటరాజా! భూమికొడు కయిన యంగారకుఁడు పునర్వసు నక్షత్రమునం దుదయించినను, వక్రించినను పంట లధికముగా పండును. ప్రజ లందఱకును శుభములు కలుగును. ౫౦

సీ. శని యొకచోటను దిననాథుతోఁ గూడి
యుండ నచ్చోటనె యుదితుఁ డైన
ఛాయాతనూజుండు చంద్రుని గెల్చిన
నాసౌరిముందట భూసుతుండు
నడచిన వక్రించినను బుధాంగారకా
స్తమయంబునందు వర్షము గురిసిన
మీఁద వానలు లేవు మిత్రతనూజుండు
దానవాచార్యు నుద్ధతి గెలిచినఁ

తే. గీ. బ్రాజ్య మగు మథురాపురప్రాంత రాజ్య,
మునకు వాయువు డామర మెనయుఁ గాని
వాన లే దని వివరించె వరుస గాఁగఁ,
బ్రణుతరఘురామ! వేంకటప్రభులలామ! ౫౧

తా. కొనియాడఁబడిన రఘురాముఁడుగల యో వేంకటరాజా! శని గ్రహ మొక్క రాశియందే సూర్యునితోఁ గలసి యుండినవాఁ డయినను ఆరాశియందే ఉదయించినవాఁ డయినటువంటి ఛాయాదేవికొడు కయిన శని చంద్రుని గెలిచినను, ఆశనిగ్రహముముందరనే భూమికొడు కంగారకుఁడు నడచినను, వక్రించినను, బుధగ్రహమును, అంగారక గ్రహమును అస్తమించు సమయంబున వాన కురిసినను, అటుపయికాలమునందు మఱి వానలు కురియవు. సూర్యునికొడుకు శని రాక్షసులకు గురువయిన శుక్రుని ఔద్ధత్యము

చేత గెలిచినట్టయితే విస్తారమయినమధురాపురక్రాంతమండలిరాజ్యమునందు గాడ్పుబాధయు, కొల్ల మొదలయిన దేశోపద్రవములును తటస్థించునే కాని యచ్చట వాన గురియ దని వరుసగా రెట్టఁడు వివరించి చెప్పెను. ౫౧

సీ. చంద్రమండలము నిర్జరరాజమంత్రి భే
దించిన నల సింధుదేశ మెల్ల
నొగులును మిక్కిలి భృగుఁడు భేదించిన
గురుతరవ్యథ లగుఁ గొలుచు తఱుఁగుఁ
బటువృష్టి లేమిని గుటిలసంపత్తిచే
క్షితిని జోళప్రజాశ్రేణి నొచ్చు
తఱుఁగును ధాన్యంబు ధరలోన మఱియును
గ్రహము లన్నియు వచ్చుఁ గలుగ దంద్రు
తే. గీ. వాన పయిరులు పండవు వరుస రణము,
దనరి రాజులకును మహోద్దామలీల
నగును శోణితనదు లెచ్చు నఖిలనృపులు,
పడుదు రనె రెట్టఁ డార్యులు ప్రస్తుతింప. ౫౨

తా. వేంకటరాజా ! చంద్రునిమండలమును దేవతలకు రాజయిన యింద్రుని మంత్రి యయినగురుఁడు భేదించిన ట్టయితే ప్రసిద్ధ మయిన సింధుదేశ మంతయు మిక్కిలిగా బాధను పొందును. ఆచంద్రునిమండల మును శుక్రుఁడు భేదించినట్టయితే మిగుల గొప్పవి యగుపీడలు కలుగును. ధాన్యము తఱిఁగిపోవును. తగినవర్షములు లేకపోవుటచేతను, కుటిలులసంప దలచేతను భూమియందు చోళదేశపు ప్రజాసముదాయము బాధలను పొందును. ధాన్యములు తఱిఁగిపోవును. ఇంతేకాదు, ఎల్లగ్రహములును గూడి చంద్రమండలమును భేదించినట్టయితే వానలు గురియవు. పంటలు పండవు. క్రమముగా రాజులకు యుద్ధములు తటస్థించి చాల గొప్పగా రక్త

నదులు ప్రవహించును. ఎల్లరాజులును చనిపోవుదురు—ఇట్లని పెద్దలు కొనియాడునట్టుగా రెట్టపండితుఁ డనియెను. ౫౨

క. కృత్తికను బూర్వభాద్ర మ,
ఘోత్తరలను స్వాతిఁ బుబ్బ నొగిఁ బుష్యమునన్
జిత్త విశాఖను శుక్రుఁడు,
హత్తుక మెలఁగినను శుభము లనె రెట్టఁ డిలన్. ౫౩

తా. వేంకటరాజా! శుక్రుఁడు, కృత్తికానక్షత్రమునందుఁ గాని, పూర్వభాద్రానక్షత్రమునందుఁ గాని, మఘానక్షత్రమునందుఁ గాని, ఉత్తరానక్షత్రమునందుఁ గాని, స్వాతీనక్షత్రమునందుఁ గాని, పూర్వఫల్గునీనక్షత్రమునందుఁ గాని, పుష్యనక్షత్రమునందుఁ గాని, చిత్రానక్షత్రమునందుఁ గాని, విశాఖానక్షత్రమునందుఁ గాని, సంచారము చేయుచున్నట్టయితే శుభములు గలుగు (అనఁగా వానలు గురియు) నని రెట్టఁ డన్నాఁడు. ౫౩

తే. గీ హస్తమూలపునర్వసులందు మఱియు,
జ్యేష్ఠ ననురాధ రోహిణీచిత్తలందు
భృగుఁడు నడచిన వర్షముల్ మిగులఁ గురియు,
నిఖిలబుధగణ్య! వేంకటనృపవరేణ్య! ౫౪

తా. ఎల్లపండితులచేతను గణింపఁబడినవాఁడా! వేంకటరాజా! శుక్రుఁడు, హస్తనక్షత్రమునందుఁ గాని, మూలనక్షత్రమునందుఁ గాని, పునర్వసునక్షత్రమునందుఁ గాని; జ్యేష్ఠానక్షత్రమునందుఁ గాని, అనూరాధానక్షత్రమునందుఁ గాని, రోహిణీనక్షత్రమునందుఁ గాని, చిత్తనక్షత్రమునందుఁ గాని, సంచరించుచున్నట్టయితే మిక్కిలిగా వానలు కురియును. ౫౪

తే. గీ. శుక్రుఁ డుదయంబు నొందెడిచోటి కెనిమి
దింట నేడింట మఱి నాలుగింట సొరి
యుండినను వానగురియును దండి గాఁగఁ,
గీర్తిజితచంద్ర! వేంకటక్షితితలేంద్ర! ౫౫

తా. కీర్తిచేతను చంద్రుని జయించిన వేంకటరాజా! శుక్రుఁడుదయించుస్థలమున కెనిమిదవయింటను గాని, ఏడవయింటను గాని, నాలుగవయింటను గాని, శని యుండినట్టయితే కావలసినంతకంటెను అధికముగానే వానలు కురియును. ౫౫

క. శనిదైత్యగురుల నడుమను,
వనజాప్తుఁడు లేకయున్న వర్షంబును లే
దనియె నలరెట్టధన్యుం,
డనఘా! కొండ్రాజువేంకటాద్రినృపాలా! ౫౬

తా. దోషరహితుఁడా! కొండరాజుగారి వేంకటరాజా! శనిగ్రహమునకును, రాక్షసగురువయిన శుక్రగ్రహమునకును మధ్యను పద్మములకు బంధువయిన సూర్యగ్రహము లేకున్నట్టయితే వాన కురియనే కురియదని రెట్టఁడనుధన్యాత్ముఁడనియుండెను. ౫౬

సీ. చంద్రనందనుఁడు వైశాఖమాసమునందు
నుదయించినను వ్యాధు లొదవుఁ బ్రజకుఁ
జర్చింపఁ బౌషమాసంబున నుదయింప
డామరం బధిక మా భూమిలోన
నాషాఢమాసంబునందు శ్రావణమున
నుదయించినను క్షామ మూర్విఁ బుట్టు
నన్యమాసంబులయం దుదయించిన
వానలు గురియు నవ్వారి గాఁగఁ

తే. గీ. బంట గలుగును మోదంబు ప్రజల కెల్ల,
బుధుఁడు భార్గవుఁ డొకరాశిఁ బోరు లేక
యుండిన శైలిన వచ్చు మహోజ్జ్వలముగ,
వృష్టి కొండ్రాజుతిమ్మయవేంకటేంద్ర! ౫౭

తా. తిమ్మరాజుగారి వేంకటరాజా! చంద్రునికొడుకయినబుధుఁడు వైశాఖమాసమునం దుదయించినట్టయితే ప్రజలకు రోగములు కలుగును. అతఁడు ఆలోచింపఁగా, పౌషమాసమునం దుదయించినట్టయితే భూలోకమునందు కొల్ల మొదలయిన దేశోపద్రవము హెచ్చగును. ఆబుధుఁడే ఆషాఢమాసమునందుఁ గాని, శ్రావణమాసమునందుఁ గాని యుదయించినపక్షమున భూమియందు కఱవు తటస్థించును. పైన వివరించిన నెలలయందుఁ గాక యితరములయిన నెలలయం దాబుధగ్రహ ముదయించినయెడల వానలు సమృద్ధిగాఁ గురియును. చక్కఁగా పంటలు పండును. ఎల్లవారికిని సంతోషము గలుగును. బుధశుక్రు లొక్కయింటను జగడము లేక యుండినపక్షమున మిగులఁ బ్రకాశించునట్టుగా వర్షము కురియును. ౫౭

క. సోమజ శుక్రులనడుమను,
భౌముఁడు రవితనయుఁ డున్న బహువర్షంబుల్
భూమండలి లేవనియెను,
ధీమంతుఁడు రెట్టఘనుఁడు ధీరులు మెచ్చన్. ౫౮

తా. వేంకటరాజా! బుధునకును, శుక్రునకును మధ్యమందు అంగారకుఁడును, సూర్యునికొడుకయినశనియును ఉన్నట్టయితే భూమియం దంతగా వానలు కురియ వని బుద్ధిమంతుఁ డయిన రెట్టఁడనుదిట్టఁడు పండితులు మెచ్చునట్టుగా నన్నాఁడు. ౫౮

తే. గీ. ధరణి నారుద్ర నుత్తరాత్రయమునందుఁ,
దనర మఱి రోహిణీమఘాతారలందుఁ
దరణితనయుండు వసియింపఁ దగినపాటి,
వృష్టి గలుగును గొండ్రాజువేంకటేంద్ర! ౫౯

తా. కొండ్రాజుగారివేంకటరాజా! ఆర్ద్రానక్షత్రమునందును, ఉత్తరఫల్గుని, ఉత్తరభాద్ర, ఉత్తరాషాఢ—అనునీమూఁడునక్షత్రములయందును,

రోహిణీనక్షత్రమందును, మఘానక్షత్రమందును సూర్యపుత్త్రుఁ డగు శని యున్నట్టయితే తగుమాత్రమే వర్షించును. ౫౯

క. గ్రహపతి ముందటను శుభ,
గ్రహములు నడచినను వాన గలుగును బంటల్
రహి మించు వచ్చు ధాన్యము,
గృహములకును వేంకటాద్రినృపకులవర్యా! ౬౦

తా. వేంకటరాజా! సూర్యునకు ముందర శుభగ్రహములు నడచిన పక్షమున వానలు కురియును. అధికముగా పంటలు పండును. పండిన ధాన్యము చక్కఁగా నింటికిఁ జేరును. ౬౦

క. సురదైత్యవరుల దేశికు,
లిరుగడలను లోహితాంగు నెనసిన నిల భూ
వరులకు జగడము లౌ ననెఁ,
బరమార్థము వేంకటాద్రిపార్థివతిలకా! ౬౧

తా. వేంకటరాజా! అంగారకునకు రెండువయిపులను దేవతల కాచార్యుఁడయిన గురుఁడును, రాక్షసుల కాచార్యుఁడయిన శుక్రుఁడును ఉన్నట్టయితే భూమియందు రాజులకు యుద్ధములు తటస్థించును. ఇది నిజము—అని రెట్టఁ డన్నాఁడు. ౬౧

క. గురుఁడు మిథునమున నుండఁగ,
సురరిపుదేశికుఁడు నట్టె చూపట్టిన భూ
వరు లాజి నొత్తు రనె నిల,
కరు దగుభయ మనిగొ రెట్టఁ డందఱుఁ బొగడన్. ౬౨

తా. వేంకటరాజా! గురుఁడు మిథునరాశియం దుండఁగా రాక్షసులకు గురుఁ డయిన శుక్రుఁ డక్కడికి వచ్చి చేరినట్టయితే రాజులు యుద్ధములయందు నొత్తు రనియును, భూప్రజ కచ్చెరువుగా భయము కలుగు ననియుఁ నెల్లరును పొగడునట్టుగా రెట్టపండితుఁ డన్నాఁడు. ౬౨

క. రవిబుధుల మించి ముందటఁ,
గవి నడచిన ధరణిలోనఁ గలుగును వానల్
కవిజనకల్పమహీరుహ!,
ప్రవిమలయశ ! వేంకటాద్రిపార్థివతిలకా! ౬౩

తా. కవీశ్వరులకుఁ గల్పవృక్షమువంటివాఁడా ! మిగుల నిర్మలమయిన కీర్తిగలవాఁడా ! వేంకటరాజా ! సూర్యుని, బుధుని అతిక్రమించి ముందుగా శుక్రుఁడు నడచినట్టయితే భూమియందు వానలు కురియును. ౬౩

సీ. చుక్కయు సురగురుం డొక్కరాశిన యుండ,
క్ష్మాకుమారుం డందు లేకయున్న
నల గురుశుక్రు లన్యోన్యము నేడింట
నుండి చూచుచు నున్న నుగ్రరణము
లగును మేఘము పుట్ట దణుమాత్రమును మఱి,
హరిణాంకజుం డార్ద్ర యాది గాఁగ
నైదుతారలయందు నస్తమించిన నుద
యించిన నగ్గువై మించుఁ గొలుచు
తే. గీ. గాలి యధికంబుగా వీచుఁ గలుగు రుజలు,
జనులు సంతోషములు లేక చాల నొగిలి
విడుతు రాత్మీయకర్మముల్ పుడమిలోన,
ననియె రెట్టఁడు సకలవిద్యావిదుండు. ౬౪

తా. వేంకటరాజా ! చుక్క అనఁగా శుక్రుఁడును, దేవతలకు గురువయిన బృహస్పతియు నొక్కరాశియందే యుండఁగా నారాశియందు భూమికొడుకయిన యంగారకుఁడు లేకపోయినను, ఆగురుశుక్రు లొకరి నొకరు ఏడవయింటను ఉండి చూచుచున్నను భయంకరములయిన యుద్ధములు తటస్థించును. అణుమాత్రముగా నయినను ఆకాశమునందు మేఘము లగపడవు. ఇంతే కాదు. బుధుఁ డార్ద్ర మొదలుగా అనఁగా,

అరుద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఘ—అనునీయయిదు నక్షత్రముల యందును అస్తమించినను, ఉదయించినను ధాన్యము చాలఁ జవుక యగును. హెచ్చుగా గాడ్పులు వీచును. రోగములు కలుగును. భూమియందలిప్రజల కేవిధమయిన సంతోషమును లేక చాల నొచ్చిపోయి తమతమ చేయవల సినపనులను విడిచిపెట్టెదరు—అని సకలవిద్యావిశారదుఁ డయిన రెట్టఁ డన్నాఁడు. ౬౪

సీ. సౌమ్యుఁడు మృగశిరశ్శ్రవణధనిష్ఠలఁ
 జరియింపు చున్న నస్తమితుఁ డైన
నుదయించినను వ్యాధు లొదవు వానలు లేవు
 వివిధపీడలఁ బొంది వీరభటులు
కైదువు లన్ని విక్రయ మొనర్చుక కూలి
 పనులకుఁ దిరుగుదు రనుదినంబు
నాచంద్రసుతుఁడె హస్తాది నక్షత్రంబు,
 లాఱింట నుదయమ్ము నందెనేని
తే. గీ. నస్తమితుఁ డైన నీళ్లు లే వనియె నుర్విఁ,
 బ్రజలు నొగులుదు రెనుములపాఁడి లేదు
గొఱియమేఁకలు పిఱుకును గఱవు నెలకుఁ,
 జూపు ననె రెట్టఘనుఁడు ప్రస్ఫుటము గాఁగ. ౬౫

తా. వేంకటరాజా! బుధగ్రహము మృగశీర్షమునందును, శ్రవణ నక్షత్రమునందును, ధనిష్ఠానక్షత్రమునందును సంచరించుచున్నను, అస్తమించి నను, ఉదయించినను రోగములు సంభవించును. వానలు కురియవు. వీరులగు భటు లనేకవిధములయిన బాధలను పొందినవా రయి తమతమ నాయుధ ముల నమ్ముకొని ప్రతిదినమును కూలికిఁ బనులు చేయుటకై తిరుగుచుందురు. ఆబుధగ్రహమే హస్తనక్షత్రమునందును, చిత్తనక్షత్రమందును, స్వాతీనక్ష త్రమునందును, విశాఖానక్షత్రమునందును, అనూరాధానక్షత్రమునందును,

జ్యేష్ఠానక్షత్రమునందును, ఉదయించినను, అస్తమించినను భూమియందు నీరుండ దనియును, ప్రజలు బాధల ననుభవింతు రనియును, ఎనుములపాఁడి యుండ దనియును గొఱ్ఱెలు, మేఁకలు మాత్రమే పాలిచ్చు ననియును, కొలదినములనాఁటికి క్షామము సంభవించితీరు ననియును స్పష్టముగా రెట్టన్న పండితుఁ డన్నాఁడు. ౬౫

చ. నలువుగ నుత్తరత్రయమునన్ భరణిన్ ధరణీజసోమసూ
నులు చరియించినన్ భువిజను ల్ముద మందుదు రెల్లవేళ వా
నలుగురియంగ నావులు ఘనంబుగఁ బాలను బిండు మెండుగాఁ
గలుగదు విడ్వరంబు ధరఁ గల్గు ప్రజాళికిఁ బార్థివోత్తమా!

తా. వేంకటరాజా! అందము గలుగునట్లు ఉత్తరఫల్గుని, ఉత్తరాషాఢ, ఉత్తరభాద్ర—అనునీనక్షత్రములయందును, భరణినక్షత్రమునందును అంగారకుఁడును, బుధుఁడును సంచారముచేసినట్లయితే యెల్లప్పుడును భూమియందలిజనులు సంతోషమును పొందుచుందురు. వానలు కాలమునందుఁ గురియుచుండును. అందువలన నావులు హెచ్చుగా పాలిచ్చును. భూమియందలిప్రజకు రాజులు మొదలగువారివలన నుపద్రవము కలుగదు. ౬౬

తే. గీ. బుధుఁడు పూర్వత్రయంబునఁ బొడమి యున్న,
నస్తమితుఁ డైన నడచిన నగ్గు వాను
ధాన్యములు గల్గు వానలు ధరణిజనులు,
వేడ్కనుందురు కొండ్రాజువేంకటేంద్ర! ౬౭

తా. కొండరాజుగారి వేంకటరాజా! బుధగ్రహము పూర్వఫల్గుని (పుబ్బ) పూర్వాషాఢ, పూర్వభాద్ర—అనునీనక్షత్రములయందు ఉదయించినను, అస్తమించినను, సంచరించినను ధాన్యములు చౌక యగును. వానలు గురియును. భూమియందలిజనులు సంతోషము గలవారయి యుందురు. ౬౭

తే. గీ అశ్వినీరేవతులను మూలాఖ్యతార,
బుధుఁడు పొడమినఁ బాండ్యభూభుజులు నశ్వ

పతులు నొత్తురు గల్గు నపారవృష్టి,
ఖండితారాతిజాల! వేంకటనృపాల! ౬౭

తా. ఖండింపఁబడిన శత్రుసమూహముగల యో వేంకటరాజా! బుధగ్రహము, అశ్వినీనక్షత్రమునందును, రేవతీనక్షత్రమునందును, మూల యనెడి నక్షత్రమునందును ఉదయించినట్టయితే పాండ్యదేశపురాజులును, అశ్వపతులును నొత్తురు. అపారముగ వానలు కురియును. ౬౭

వ. మఱియు మూలాదిచతుర్నక్షత్రంబులయందును, ధనిష్ఠాది షట్తారలయందును, భరణ్యాద్యష్టనక్షత్రంబులందును, మఘాదిపంచనక్షత్రంబులందును, స్వాత్యాదిచతుర్నక్షత్రంబులయందును శుక్రుఁడుదయించుటకు ఫలంబువివరించెదము.

తా. వేంకటరాజా! ఇంకను చెప్పెదము వినుము. మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణము—అనునీనాలుగునక్షత్రములయందును, ధనిష్ఠ, శతభిషము, పూర్వభాద్ర, ఉత్తరభాద్ర, రేవతి, అశ్విని—అనునీయాఱునక్షత్రములందును, భరణి, కృత్తిక, రోహిణి, మృగశీర్ష, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష—అనునీయెనిమిదినక్షత్రములయందును, మఘ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త—అనునీయయిదునక్షత్రములయందును, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ—అనునీనాలుగునక్షత్రములయందును శుక్రుఁడుదయించినట్టయితే అందువలనఁ గలుగు ఫలములను చెప్పెదము. ౬౮

సీ. భృగుజుఁడు భరణి యాదిగ నాల్గుతారలఁ
బొడమినఁ గ్రుంకిన నడుచు చున్నఁ
బసులకుఁ గొఱగాదు పంటలు ప్రబలును,
గల్గును వర్ష మగ్గలము గాఁగ
నలయార్ద్ర యాదిగాఁగల నాలుగుడులందు
నుండిన నడచిన నుదయ మైన

గోదుముల్ మఱి జొన్న కొఱ్ఱలు ఫలియించు,
నదులు పాఱును ద్విజుల్ ముదము గాంతు
తే. గీ. రిల మఘాదికశౌర లైదింటఁ గ్రుంకి,
నను నుదతుఁ డైన మేదిని నడచు చున్నఁ
బ్రజల కావులకును గష్టపాటు గలుగు
వృష్టి యొకపాటి గల దనె రెట్టఁ డిలను. ౭౦

తా. వేంకటరాజా! శుక్రగ్రహము, భరణి, కృత్తిక, రోహిణి, మృగశీర్షము—అనునీనాలుగునక్షత్రములయందును ఉదయించినను, అస్తమించినను, సంచారము చేయుచున్నను పశువులకు మంచిది కాదు. అధికముగా పంటలు పండును. కావలసినంతగా వానలు గురియును. ఆశుక్రగ్రహము, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష—అనునీనాలుగు నక్షత్రములయందును ఉదయించినను, అస్తమించినను, సంచరించినను, గోదుమలు, జొన్నలు, కొఱ్ఱలు—ఇవి బాగుగా ఫలించును. నదులు ప్రవహించుచుండును. ద్విజు లనఁగా మొదటి మూఁడువర్ణములవారు—అని కాని లేదా కేవలము బ్రాహ్మణులే యని కాని చెప్పవచ్చును. వారు సంతోషము గలిగి యుందురు. మఘ, పుబ్బ, ఉత్తర, హస్త చిత్త—అనునీయయిదు నక్షత్రములయందును అస్తమించినను, ఉదయించినను, సంచరించుచున్నను ప్రజలకును, ఆవులకును కష్టములు పఘుట సంభవించును. వర్షము తగుమాత్రముగానే కురియు నని రెట్టఁ డన్నాఁడు. ౭౦

తే. గీ. స్వాతి మొద లగు నాల్గునక్షత్రములను,
దనుజగురుఁ డస్తమించినఁ దనర నడచి
నను నుదయ మైన మేదినీనాయకులకుఁ,
గలుగు జగడంబు లనె రెట్టఁ డలఘుమతిని. ౭౧

తా. వేంకటరాజా! శుక్రుఁడు, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ—అనునీనాల్గు నక్షత్రములయందును అస్తమించినను, సంచరించినను,

ఉదయించినను రాజులకు యుద్ధములు సంభవించు నని గొప్పదియగు బుద్ధి చేతను రెట్టఁ డన్నాఁడు. ౭౧

సీ. మూలాదినక్షత్రములు నాలుగింటను
　　నుశనుఁ డస్తము నొంద నుదితుఁ డైన
నడచుచుండినను వానలు లేవు దారుణల్
　　తలుఁగుటె కాదు యుద్ధములు గలవు
స్వాతి యాదిగను నక్షత్రచతుష్టయి,
　　న స్తమించినను మూలాదితార
లందు నాల్గింట నుదయం బంద మంచిది
　　సరవి మఘాదిపంచకమునందు
తే. గీ. నాదితారాత్రయంబున న స్తమించి,
　　చెలఁగి మూలాదినక్షత్రములను నాలు
　　గింట నుదయించినను జాలఁ గీడు గలుగు,
　　ననియె రెట్టఁడు సకలవిద్యావిదుండు. ౭౨

తా. వేంకటరాజా ! శుక్రుఁడు, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణము—అను నీనాలుగు నక్షత్రములయందును అస్తమించినను, ఉదయించినను, సంచరించినను వర్షములు కురియవు. ధరలు తగ్గిపోవుటే కాక యుద్ధములుగూడ తటస్థించును. మఱియును శుక్రుఁడు స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, అనునీనాలుగు నక్షత్రములయందును అస్తమించినను, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణము—అనునీనాలుగు నక్షత్రములయందును ఉదయించినను చాల మంచిది. మఘ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త—అనునీయయిదునక్షత్రములయందును, అశ్విని, భరణి, కృత్తిక, అను నీమూఁడు నక్షత్రములయందును అస్తమించినను, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణము—అనునీనాలుగు నక్షత్రములయందును శుక్రుఁ డుదయించినను హెచ్చుగా కీడు కలుగును. అని సకలవిద్యలను ఎఱిఁగిన రెట్టఁ డన్నాఁడు. ౭౨

క. దనుజాచార్యుఁడు గ్రుంకిన,
దినమును నాదిగొని సప్త దివసంబులలో
నను వాన గురిసెనేనియు,
విను కురియదు మీఁద వృష్టి వేంకటనృపతీ! ౭౩

తా. వేంకటరాజా! వినుము. శుక్రుఁ డస్తమించిన దినము మొదలుకొని యేడుదినముల లోపలను వాన కురిసిన ట్టయితే అటుపయిని మఱి కురియదు. ౭౩

తే. గీ. ఎన్న శుక్రుండు పొడమిన యేడునాళ్ళ,
లోన వర్షంబు గురిసిన యేని మీఁద
వాన గురియును సతత మవశ్యముగను,
విపులకారుణ్య! వేంకటనృపవరేణ్య! ౭౪

తా. విస్తార మయిన దయగలవాఁడా! వేంకటరాజా! ఆలోచింపఁగా శుక్రుఁ డుదయించిన దినము మొదలుకొని యేడుదినములలోఁగా వాన కురిసిన ట్టయితే యెల్లప్పుడును తప్పకుండ కురియుచుండును. ౭౪

చ. అమవసనాఁడు శుక్రుఁ డుదయంబయిననృలియించు నుర్విజొన్న మొదలుగాఁగ ధాన్యములనారతమర్ఘముగల్గియుండుమోదము శుభముల్ ఘటిల్లుఁబ్రజ ధర్మగతిం జెలఁగున్మరాటదేశమును సుఖంబునన్ మనునిజం బిది వేంకటరాజశేఖరా! ౭౫

తా. వేంకటరాజా! అమావాస్యనాఁడు శుక్రోదయ మయిన ట్టయితే భూమియందు జొన్నలు మొదలయిన సర్వసస్యములును చక్కఁగా ఫలించును. ఎప్పుడును మంచిధరలు కలిగియుండును. ప్రజలు సంతోషము, శుభములు గలిగి ధర్మమార్గమునందు ప్రవర్తింతురు. మహారాష్ట్రదేశమునందలి జనులు సుఖవంతులై జీవింతురు. ౭౫

తే. గీ. మఱియు శ్రావణకార్తికమార్గశీర్ష,
మాసములలోన శుక్రుఁడు మఘువుదిశను

వృషభలగ్నంబునం దుదయించెనేని,
గట్టిగా వాన లే దనె రెట్టఘనుఁడు. ౭౬

తా. వేంకటరాజా! ఇంకను చెప్పెదము వినుము. శ్రావణమాసము నను, మార్గశీర్షమాసముననుు శుక్రగ్రహము తూర్పున వృషభలగ్నమునం దుదయించినపక్షమున వాన కురియ దని రెట్టపండితుఁడు నిశ్చయముగా నన్నాఁడు. ౭౬

చ. రవియును శుక్రుఁడుఁ వృషభ రాశిఁ జరించిన దక్షిణోర్విలో
ధ్రువముగ వాన లేదు మఱి క్రుంగును దారణ లుత్తరాశయం
దవిరళవృష్టి సంఘటిలు నగ్గువయౌఁ గడు ధాన్యసంఘముల్
ప్రవిమలకీర్తిహార! కులపావన! తిమ్మయ వేంకటాధిపా! ౭౭

తా. నిర్మలమయిన కీర్తియే హారముగాఁ గలవాఁడా! కులమును పవిత్రముగఁ జేసినవాఁడా! తిమ్మరాజుగారి వేంకటరాజా! సూర్యుఁడును, శుక్రుఁడును వృషభరాశియందు సంచారము చేయుచుండినపక్షమున దక్షిణ భూమియందు వానలు కురియవు. ధరలు తగ్గిపోవును. ఉత్తరభూముల యందు మిక్కుటముగా నెడతెగని వానలు కురియును. ధాన్యపుదినుసు లన్నియును చాలఁ జవుకగా నుండును. ౭౭

క. దినమణికిని గుడిదిక్కున,
దనుజగురుం డస్తమించి తద్వామదిశఁ
దనరఁగఁ బొడమిన మంచిది,
వినయనిధీ! తిమ్మరాజు వేంకటనృపతీ! ౭౮

తా. వినయమునకు నిధివయిన యో తిమ్మరాజుగారి వేంకటరాజా! సూర్యునకు కుడివయిపున శుక్రుఁ డస్తమించి, యా సూర్యుని కెడమవయిపున నుదయించినపక్షమున ప్రజలకుఁ జాల మంచిది. ౭౮

తే. గీ. అశ్వినీమఘుతారల నలకుజుండు,
దక్షిణస్థలి నడచిన ధరకుఁ గొదవ

యుత్తరాశఁ జరించిన నొప్పు శుభము,
వినుము కొండ్రాజుతిమ్మయ వేంకటేంద్ర! ౭౯

తా. కొండరాజు తిమ్మరాజుగారి వేంకటరాజా! ఇంకను చెప్పెదము వినుము. అంగారకగ్రహము, అశ్వినీనక్షత్రమునందును, మఘానక్షత్రమునందును దక్షిణభాగమునందు సంచారము చేసిన పక్షమున భూమియందలి ప్రజలకు మంచిది గాదు. అట్లు కాక, ఉత్తరభాగమునందు సంచరించిన ట్టయితే మిక్కిలి మంచిది. ౭౯

క. హిమకరనందను ముందట,
నమరాహితమంత్రి యుదయ మందిన సంపూ
ర్ణముగా వర్షము గురియును,
విమలప్రతిభాకలాప! వేంకటభూపా! ౮౦

తా. నిర్మలమయిన బుద్ధివిశేషమే అలంకారముగాఁగల యో వేంకటరాజా! చంద్రునికొడుకయిన బుధునిముందుభాగమున దేవతలకు శత్రువులయిన రాక్షసులకు మంత్రియగు శుక్రుఁడుదయించిన పక్షమున భూమికిఁ గావలసినంత వాన కురియును. ౮౦

సీ. తలఁప భరణ్యాదితారలు తొమ్మిది
యుత్తరవీథి నా నుర్విఁ బరఁగుఁ
బూర్వాదినక్షత్రములు తొమ్మిదియును మ,
ధ్యమవీథి యనఁగఁ బ్రఖ్యాతి నెసఁగు
దక్షిణవీథి నాఁ దనరుఁ బూర్వాషాఢ
యాదిగా నవసంఖ్య నలరుతార
లూహింపఁగా శుక్రుఁ డుత్తరవీథిలోఁ
జెలఁగిన నుత్తమఫల మొసంగు
తే. గీ నలిని మధ్యమవీథిలో నడచెనేని,
మధ్యమఫలంబు కడు నధమంబు ఫలము

మించి దక్షిణవీథిఁ జరించె నేని,
ననియె రెట్టఁడు నిటువలె జనులు పొగడ. ౮౧

తా. వేంకటరాజా! భరణి మొదలయిన తొమ్మిది నక్షత్రములు— అనఁగా, భరణి, కృత్తిక, రోహిణి, మృగశీర్షము, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఘ—అనునీనక్షత్రములు తొమ్మిదియును ఉత్తరవీథి యనఁగా భూమియం దొప్పుచుండును. పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, మూల—అనునీతొమ్మిది నక్షత్రములును మధ్యవీథి యని ప్రఖ్యాతిని పొంది యున్నవి. పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణము, ధనిష్ఠ, శతభిషము, పూర్వభాద్ర, ఉత్తరభాద్ర, రేవతి, అశ్విని యను నీతొమ్మిది నక్షత్రములును దక్షిణవీథి యని చెప్పఁబడును. ఆలోచింపఁగా శుక్రుఁ డుత్తరవీథియందు సంచారము చేయుచున్నపక్షమున నతఁ డుత్తమ మయిన ఫలముల నిచ్చును. అతఁడు చక్కఁగా మధ్యవీథియందు సంచరించు చుండినపక్షమున మధ్యమ మయినఫలముల నిచ్చును. అతఁడు దక్షిణవీథియందు సంచరించుచుండిన యెడల మిగుల నధమ మయిన ఫలముల నిచ్చును—అని రెట్టఁడు జనులు పొగడున ట్లన్నాఁడు. ౮౧

తే. గీ. చిత్త ననురాధఁ బుష్యభాశ్లేషలందు,
నమరగురుఁ డుండఁ దగ శుక్రుఁ డంద యుదితుఁ
డయిన రుజ లగు జనులకు నాహవముల,
నృపులు మడియుదు రనియెను రెట్టఁ డిలను. ౮౨

తా. వేంకటరాజా! దేవతలకు గురువయిన బృహస్పతియనుగ్రహము చిత్తనక్షత్రమునందును, అనూరాధానక్షత్రమునందును, పుష్యమీనక్షత్రమునందును, ఆశ్లేషానక్షత్రమునందును ఉండఁగా నానక్షత్రములయందే శుక్రగ్రహ ముదయించినపక్షమున జనులకు రోగములు కలుగును. యుద్ధములయందు రాజులు చచ్చిపోవుదురు—అని రెట్టఁ డన్నాఁడు. ౮౨

తే. గీ. దక్షిణోత్తరవీథుల ధవళకరుని,
సుతుఁడు నడచిన నరులకు సొంపు మిగులు
వాన గురియును మిగుల నవ్వారి గాఁగఁ,
బ్రకటవిభవేంద్ర ! వేంకటరాజచంద్ర! ౮౩

తా. ప్రకటమయిన వైభవమునందు దేవేంద్రునివంటివాఁడవయిన యో వేంకటరాజచంద్రుఁడా ! పైనఁ జెప్పఁబడినట్టి దక్షిణవీథియందుఁ గాని, ఉత్తరవీథియందుఁ గాని చంద్రునికొడుకయిన బుధుఁడు నడచినపక్షమున మనుజులకు శుభము లధికముగఁ గలుగును. మిక్కిలి హెచ్చుగా వానలు కురియును. ౮౩

తే. గీ. రణపరాజితమై యున్నగ్రహము కడు వి,
వర్ణమై దక్షిణాశకు వచ్చు గెలిచి
నట్టిగ్రహ ముత్తరస్థలియందు నడచుఁ,
గాంతి యెంతయుఁ గల్గి వేంకటనృపాల ! ౮౪

తా. వేంకటరాజా ! గ్రహములయుద్ధమునందు పరాజయమును పొందియున్న యేగ్రహ మయినను మిక్కిలి వెలవెలపోవుచున్నదయి దక్షిణ దిక్కునకు వచ్చును. యుద్ధమునందు జయమును పొందినగ్రహము మిక్కిలి కాంతిగలది యయి ఉత్తరదిక్కునందు నడచుచుండును. ౮౪

సీ. అర్కనూనుఁడు లోహితాంగుని గెల్చినఁ
దనరుఁ బంటయును యుద్ధములు కల్గు
నంగారకుఁడు కైరవాప్తుని గెల్చినఁ
గడు నధికంబుగా గాలి వీచు
శుక్రుఁడు శనిభౌమసోమతనూజుల
గెల్చినఁ బ్రజలకు క్షేమ మొదవు
గురుఁడు శనైశ్చరక్షోణిజబుధుల గె
ల్చిన శుభం బై యుండు ననుదినంబు

తే. గీ. జలజవైరి యీముఫ్వురఁ గెలిచెనేని,
కొంచెముగఁ బంట వాటిల్లుఁ గువలయమున
నరసి చూడంగ నీనిర్ణయంబు మిగుల,
దనియె రెట్టఁడు సకలవిద్యావిదుండు. ౮౫

తా. వేంకటరాజా! సూర్యునికొడుకగుశని యంగారకుని జయించినపక్షమున పంటలు హెచ్చుగా పండును. రాజులకు యుద్ధములు తటస్థించును అంగారకగ్రహము కలువలకు బంధువయిన చంద్రగ్రహమును జయించిన ట్టయితే మిక్కిలి హెచ్చుగా గాలి వీచును. శుక్రగ్రహము శని, అంగారకుఁడు, చంద్రునికొడుకగు బుధుఁడు—అనునీగ్రహములను జయించినపక్షమునఁ బ్రజలకు క్షేమము కలుగును. గురుఁ డనుగ్రహము, శని గ్రహమును, భూమికొడుకయిన యంగారకగ్రహమును, బుధగ్రహమును జయించినపక్షమునఁ బ్రతిదినమును మనుజులకు శుభములు గలుగుచుండును. పద్మములకు విరోధియగు చంద్రగ్రహము శనికుజబుధులను జయించినయెడల భూమియందు వానలు కురియక కొంచెముగానే పంటలు పండును. ఇందుఁ జెప్పఁబడినయీనిర్ణయ మంతయు నాలోచించి చూడఁగా తప్ప దని సకల విద్యల నెఱింగినరెట్టపండితుఁ డన్నాఁడు. ౮౫

క. దనుజగురుం డిందుని గెలి,
చిన వానలు గలుగు రుజలచేత ధరిత్రీ
జను లెల్ల మిగుల నొగులుదు,
రనియెఁ రెట్టనకవీంద్రుఁ డద్భుత మొదవన్. ౮౬

తా. వేంకటరాజా! రాక్షసులకు గురువయిన శుక్రగ్రహము చంద్ర గ్రహమును గెలిచినపక్షమున వానలు కురియును గాని భూమియందలిజను లందఱును రోగములచేతను చాల బాధలు పొందుదురు—అని రెట్టనకవీ శ్వరుఁ డాశ్చర్యము కలుగునట్టుగా నన్నాఁడు. ౮౬

క. సితకరుఁడు కుజుని గెల్చిన,
నతిశయముగ వాన పంట లమరును ధాత్రీ
పతులకు మైత్రి ఘటిల్లును,
వితరణవిద్యాకలాప ! వేంకటభూపా ! ౮౭

తా. దానవిద్యయే యలంకారముగాఁగల యో వేంకటరాజా ! చంద్రగ్రహము, అంగారకగ్రహమును జయించినయెడలను అధికముగా వానలు కురియును. పంటలు సమృద్ధిగాఁ బండును. రాజుల కన్యోన్యము స్నేహము కల్గును. ౮౭

తే. గీ. మహితనూజుండు దక్షిణమార్గమందు,
నడచినను వర్షములు లేవు నరులు బెదర
రాజవిడ్వర మొదవు ధరాతలమున,
ననియె రెట్టఁడు సకలవిద్యావిదుండు. ౮౮

తా. వేంకటరాజా ! భూమికొడుకయిన యంగారకగ్రహము దక్షిణ వీథియందు నడచినపక్షమున వానలు కురియవు. మనుజులు బెదరునట్లుగా భూమియందు రాజులవలన నుపద్రవము గలుగును—అని సర్వవిద్యలయందును పండితుఁ డయినరెట్టఁ డనియున్నాఁడు. ౮౮

తే. గీ. దివిజరిపుదేశికుండు స్వాతీత్రయమున,
నుండఁగా నందె గురుని మార్తండసుతుఁడు
గెలిచినను వాన గురియుఁ బంటలును గలుగు,
విమలగుణసాంద్ర ! తిమ్మయవేంకటేంద్ర ! ౮౯

తా. నిర్మలములయిన గుణములచేతను నిండారియున్న యో వేంకట రాజా ! దేవతలకు శత్రువులయినరాక్షసులకు గురువయిన శుక్రుఁడు స్వాతి, విశాఖ, అనూరాధ—అనునీమూఁడునక్షత్రములయందును ఉండునప్పుడు, ఆనక్షత్రములయందే గురుగ్రహమును సూర్యునికొడుకయిన శనిగ్రహము జయించినట్లయితే వానలు సమృద్ధిగా కురియును. కావున, పంటలు పండును.

సీ. అంగారకుండును బృహస్పతి నుశనుని
  సౌరి గెల్చిన వాన చాలఁ గొడముఁ
బరఁగు యుద్ధములు భూప్రజలును ధనధాన్య
  ములు గల్గి వ్యాధుల నలఁగుచుండ్రు
చంద్రుండు దేవతాచార్యు గెల్చిన మేఘ
  వితతి యుండుఁ గాని వృష్టి లేదు
గీష్పతి యమృతాంశు గెల్చిన వానలుఁ
  బంటలు నెసఁగును భార్గవుండు
తే. గీ. జిష్ణుమంత్రిని గెల్చిన క్షితితనూజుఁ,
  డలశనైశ్చరు గెల్చిన నఖిలనృపులు
  శత్రుసంహార మొనరించి జయము గల్గి,
  వెలయుదురు సంతసంబున వేంకటేంద్ర! ౬౦

తా. వేంకటరాజా! అంగారకగ్రహము, బృహస్పతిగ్రహమును, శుక్రగ్రహమును, శనిగ్రహమును జయించినపక్షమున కావలసినంతగా వానలు కురియును. యుద్ధములు సంభవించును. భూమియందలిప్రజలు ధనధాన్యసమృద్ధి కలవారయి యుందురుగాని రోగములచేతను పీడింపఁబడుచుందురు. చంద్రగ్రహము దేవతల కాచార్యుఁడయిన గురుగ్రహమును జయించినట్టయితే ఆకాశమునందు మేఘములు వ్యాపించుచుండు నంతే కాని వాన కురియదు. ఆబృహస్పతిగ్రహము చంద్రగ్రహమును గెలిచిన పక్షమున వానలు కురియును. హెచ్చుగా పంటలు పండును. శుక్రగ్రహము దేవేంద్రుని మంత్రియగు గురుగ్రహమును జయించినను, భూమికొడుకయిన యంగారకగ్రహము శనిగ్రహమును జయించినను ఎల్లరు రాజులును శత్రువులను సంహరించి జయముగలవా రయి సంతోషముతో వెలయుదురు. ౬౦

క. ఛాయాపుత్త్రుఁడు తారా,
  నాయకునిఁ గెలిచెనేని నలుదిక్కుల వా

లాయము క్షామంబగు ననె,
ధీయుక్తుం డైన రెట్టధీరుఁడు వేడ్కన్. ౯౧

తా. ఛాయాదేవికొడుకయిన శని చుక్కలరాజయిన చంద్రగ్రహమును జయించినపక్షమున నాలుగువయిపులను తప్పక కఱవు తటస్థించు నని బుద్ధితోఁ గూడినవాఁ డయినరెట్టపండితుఁడు వేడుకతో నన్నాఁడు. ౯౧

తే. గీ. కావ్యుఁ డుదయంబు నొంది యేగ్రహము నైన,
గెలిచెనేనియు శుభములు గలుగుఁ జాల
నోడెనేనియుఁ గురియదు దీయుర్వి వాన,
కపటవైరివిఘాల ! వేంకటనృపాల ! ౯౨

తా. కపటముగల శత్రువులను భేదించినవాఁడా ! వేంకటరాజా ! శుక్రుఁ డుదయమును పొందినవాఁ డయి యేగ్రహము నయినను గెలిచిన పక్షమునఁ జాల శుభములు గలుగును. ఆతఁ డేగ్రహముచేత నయినను ఓడిన పక్షమున భూమియందు వాన కురియదు. ౯౨

తే. గీ. ద్యుమణికి ద్వితీయ మగుచోట నున్న కావ్యు,
రవికి నెడ మగుచో నున్నదివిజగురుని
సౌరి గెలిచినఁ బ్రజలకు జనపతులకు,
హాని యౌ ననె రెట్టఁ డహీనమతిని. ౯౩

తా. వేంకటరాజా ! సూర్యునకు రెండవయింట నున్న శుక్రునిని, సూర్యున కెడమవయిపున నున్న దేవతాచార్యుఁడయిన గురునిని శని గెలిచినపక్షమునఁ బ్రజలకును, రాజులకును హాని సంభవించు నని గొప్పదియగు బుద్ధిచేతను రెట్టఁ డన్నాఁడు. ౯౩

తే. గీ. అరయ మఘ నైన స్వాతీత్రయము నైన,
నినజుఁ డుండంగ నతని కాతింట సూర్యుఁ
డున్న క్షామంబు వచ్చు నత్యుగ్రముగను,
ననియె రెట్టఁడు గణితవిద్యావిదుండు. ౯౪

తా. వేంకటరాజా! ఆలోచింపఁగా, మఘానక్షత్రమునం దయినను, స్వాతి, విశాఖ, అనూరాధ యనునీమూఁడు నక్షత్రములయం దయినను సూర్యపుత్త్రుఁ డయిన శని యున్నపక్షమునను, అతని కాఱవయింటను సూర్యుఁ డున్నపక్షమునను మిగుల భయంకరముగాఁ గఱవు తటస్థించు నని గణితవిద్య నెఱిఁగిన రెట్టపండితుఁ డన్నాఁడు. ౯౪

క. ఆరాక్షసకులగురుఁ డం,
గారకు గెలిచినను వాన గల్గు శుభంబుల్
చేరును ధాత్రీప్రజలకుఁ,
బౌరుషనిధి! వేంకటాద్రిపార్థివతిలకా! ౯౫

తా. పౌరుషమునకు నిధివయిన యోవేంకటరాజా! రాక్షసకులమునకు గురుఁ డయినయాశుక్రుఁ డంగారకుని గెలిచినయెడల వానలు కురియును. భూమియందలి ప్రజలకు శుభములు చేకూరును. ౯౫

క. శని యశ్వినియం దుండినఁ,
దనరును వర్షంబు సన్నధాన్యము లలరున్
బెనుపొందుఁ గాశిరాజ్యము,
వినమితరిపురాజవితతి! వేంకటనృపతీ! ౯౬

తా. శత్రువులయిన రాజులసమూహమును నమ్రులయినవారినిగాఁ జేసికొన్నయోవేంకటరాజా! శని, అశ్వినీనక్షత్రమునం దుండినయెడల వర్షములు కురియును. సన్నధాన్యములు చక్కఁగా ఫలించును. కాశీరాజ్యము వృద్ధి నొందును. ౯౬

చ. శని భరణిం జరించినను జంద్రజభానుమహీసుతాదు లా
యనకును సప్తమస్థలమునందు వసించిన దక్షిణోర్వి దాఁ
దనరు సమృద్ధిచే మిగులఁ దక్కినచోట్లను గొంచె మాఫలం
బును జల మల్పవృష్టియును బుట్టు ననె న్మతి రెట్టఁ డిమ్మహిన్.

తా. వేంకటరాజా ! శనిగ్రహము భరణినక్షత్రమునందు సంచరించుచుండినను, బుధుఁడు, సూర్యుఁడు, అంగారకుఁడు మొదలయినగ్రహములు శని యున్నయింటి కేడవయింట నుండినను దక్షిణదేశము మిక్కిలి పాఁడి, పంట గలిగి యొప్పుచుండు ననియు, తక్కినదేశములందు పంటలు తక్కువ యగు ననియు, నీరును తక్కువగానే యుండు ననియు, వాన చాల స్వల్పముగానే కురియు ననియు రెట్టపండితుఁ డన్నాఁడు. ౯౭

చ. ఇనజుఁడు కృత్తిక న్మెలఁగ హెచ్చును వ్యాధులు పంటలేనియ
ట్లనె కనిపించి పైరులు ఫలంబుల నిచ్చును గల్గు వర్షముల్
దనియఁగఁ జైత్రమాసమున దారణ లెంతయుఁ గల్గు మీఁదనొ
క్కనెలకు నగ్గువౌ ననెను గట్టిగ రెట్టఁడు ప్రాజ్ఞులౌనన౯. ౯౮

తా. వేంకటరాజా ! సూర్యునికొడుకు శని కృత్తికానక్షత్రమునందు సంచరించునప్పుడు రోగములు హెచ్చుగా నుండు ననియు, పంటలు పండనియట్లే యగపడి సస్యములు సమృద్ధిగా పంటల నిచ్చుననియు, వానలు సమృద్ధిగాఁ గురియు ననియు, సరకు నిలువచేసినవారు తృప్తిని పొందునట్టుగా చైత్రమాసమున ధర లధికముగా నుండి, మఱొక్కనెల దాఁటినతరువాతను ధాన్యాదులు చౌక యగు ననియు ప్రాజ్ఞులు మెచ్చునట్టుగా రెట్టపండితుఁడు గట్టిగా నన్నాఁడు. ౯౮

చ. రవితనయుండు రోహిణిఁ గరంబుగ నుండినఁ జైత్రకంబున౯
దవసము హెచ్చు మర్త్యులకుఁ దద్దయు నుబ్బసపుం దెవుళ్లు సం
భవిలును గౌతమీనదిని బంటలు రాజిలు నన్యభూముల౯
ధ్రువముగ వాన లేదనియెఁ బ్రోడతనంబున రెట్టఁడిమ్మహి౯.

తా. వేంకటరాజా ! సూర్యునికొడుకయిన శని రోహిణీనక్షత్రమునం దుండినట్టయితే చైత్రమాసమునందు ధాన్యములు హెచ్చుగా లభించు ననియును, ఉబ్బసపు (కాస)రోగములు సంభవించుననియును, గోదావరీనదీ ప్రాంతములయందు పంటలు బాగుగా పండు ననియు, కడమ దేశముల

యందు నిశ్చయముగ వానలు కురియ వనియు రెట్టఁడు ప్రౌఢతనముతో నన్నాఁడు. ౯౯

క. మృగశీర్షను శని యుండఁగఁ,
దగఁ గార్తికచైత్రములను దవసము హెచ్చున్
జగడము లగు నరపతులకు,
విగతాహిత! తిమ్మరాజువేంకటనృపతీ! ౧౦౦

తా. పోయినశత్రువులుగలవాఁడా! తిమ్మరాజుగారి వేంకటరాజా! మృగశీర్షనక్షత్రమునందు శని యుండినపక్షమున, కార్తికమాసమునందును, చైత్రమాసమునందును ధాన్యము హెచ్చుగా లభించును. రాజులకు యుద్ధములు కలుగును. ౧౦౦

తే. గీ. ఆర్ద్రయందు శనైశ్చరుం డలరెనేని,
యినసుతానర్మదాతటనృపులు నొత్తు
రెక్కుడగుఁ బంట లుత్తరదిక్కునందు,
హెచ్చు దారణ లనె రెట్టఁ డేపు మీఱ. ౧౦౧

తా. వేంకటరాజా! ఆర్ద్రానక్షత్రమునందు శని యుండినట్టయితే సూర్యునికూఁతురయిన యమునయను నదియొక్కయు, నర్మదయొక్కయు నొడ్డయం దుండెడిరాజులు నొత్తు రనియును, పంట లధికముగా పండు ననియును, ఉత్తరదేశమునందు ధరలు హెచ్చగు ననియును రెట్టఁ డన్నాఁడు.

క. తరణిజుఁడు పునర్వసువునఁ,
జరియింపఁగ సర్వసస్యచయ మమరును భీ
కరరుజలను నొగులుదు రు,
త్తరకోసలమనుజు లనియెఁ దగ రెట్టఁ డిలన్. ౧౦౨

తా. వేంకటరాజా! సూర్యునికొడుకు శని పునర్వసునక్షత్రమునందు సంచరించు చుండఁగా నెల్లసస్యములును చక్కఁగా ఫలించు ననియును,

ఉత్తరకోసలదేశమునందలి ప్రజలు భయంకరములయిన రోగములచేతను పీడింపఁబడుదు రనియును రెట్టఁ డనినాఁడు. ౧౦౨

తే. గీ. సౌరి పుష్యమిఁ జరియింప స్వల్పవృష్టి,
యగు ఫలించును సన్నధాన్యములు ప్రజలు
తలఁకుచుందురు దవసంబుదారణలకు,
గార్గ్యమత మిది వినుము వేంకటనృపాల! ౧౦౩

తా. వేంకటరాజా! వినుము. శని పుష్యనక్షత్రమునందు సంచరింపఁగా వర్షము కొంచెముగాఁ గురియును. సన్నధాన్యములు ఫలించును. మనుజులు ధాన్యపుధరలు హెచ్చగుటంజేసి భయపడుచుందురు. ఇది గార్గ్యుఁడనుమునిమతము. ౧౦౩

తే. గీ. అసితుఁ డాశ్లేష నుండంగ నలరుఁ బంట,
నరులు సుఖమున నుంద్రు ధాన్యములు దఱుఁగు
నలఁగియుందురు మాళవనాయకులును,
గార్గ్యమత మిది యనె రెట్టకవివరుండు. ౧౦౪

తా. వేంకటరాజా! నల్లనివాఁడయిన శని యాశ్లేషయను నక్షత్రమునం దుండఁగా పంటలు పండును. మనుజులు సుఖవంతు లగుదురు. ధాన్యములు తగ్గిపోవును. మాళవదేశపురాజులు నలఁకువను పొందెదరు. ఇదియును గార్గ్యునిమతమే యని రెట్టఁ డన్నాఁడు. ౧౦౪

మ. జలజాప్తాత్మజుఁ డామఘ న్నెలఁగినన్ సౌరాష్ట్రభూపాలకుం
డులయంబౌ మఱివృక్షజాలము చెడున్నొచ్చుం బ్రజాశ్రేణివ్యా
ధులచే వేవిధబాధలందఱుఁగు నెందున్ ధాన్యముల్ ధాత్రిఁబం
టలుస్వల్పంబులు వానలేదనియె రెట్టం డార్య లౌరా యనన్.

తా. వేంకటరాజా! పద్మముల కాప్తుఁ డయిన సూర్యుని కొడుకు శని మఘానక్షత్రమునం దుండిన ట్టయితే సౌరాష్ట్రదేశపురాజు చనిపోవు

ననియును, వృక్షములు చెడిపోవు ననియును, ప్రజాసముదాయము రోగముల చేతను పలువిధములయిన బాధలచేతను నొచ్చిపోవు ననియును, ఎచ్చోటను ధాన్యములు తగ్గిపోవు ననియును, పంటలు మిగులఁ దక్కువగానే పండు నని యును, వానలు కురియ వనియును పెద్దలవు నన రెట్టఁ డనెను. ౧౦౫

మ. రవిసూనుం డల పుబ్బనుండినను వర్షం బల్పమౌ ధూమకే
తువుదోఁచుం దగుపాటిపంట లెసఁగున్ దుర్భిక్షమౌ వేఁగినా
టవిభుల్నొత్తురుగౌతమీతటులఁబాటిల్లున్ రుజల్సస్యముల్
భువిలో నబ్దము వాన లే దనియె నేర్పుల్మీఱ రెట్టం డిలన్.

తా. సూర్యునికొడుకయినశని పుబ్బనక్షత్రమం దుండఁగా నామేఁట వానలు తక్కువగా కురియు ననియు, తోఁకచుక్క కనుపడు ననియును, తక్కువగానే పంటలు పండుననియును, కఱవుసంభవించు ననియును, వేఁగీ దేశపుప్రభువులు నొత్తు రనియును, గోదావరీతీరములందు రోగములు కలుగు ననియును, పంటలు పండ వనియును, భూమియం దొక్కసంవత్స రమువఱకును వానలు కురియ వనియు నేర్పు లొప్పునట్టుగా రెట్టఁ డన్నాఁడు.

ఉ. భానుజుఁ డుత్తరన్మెలఁగఁ బంటలుచాలఁగ సంఘటిల్లు గం
గానదిప్రాంత మేలుమహికాంతుఁడునొచ్చునడంగుదారణల్
మానకమున్నె ధాన్యముసమగ్రముగాఁగొని దాఁచఁగావలెన్
వానలు గల్గియుండు ననె వన్నెగ రెట్టఁడు ధారుణీస్థలిన్.

తా. వేంకటరాజా! సూర్యునికొడుకు శని యుత్తరనక్షత్రమునందు సంచరించు చుండఁగా పంటలు హెచ్చుగాఁ బండుననియును, గంగాతీర ప్రాంతము నేలుచుండురాజు నొచ్చుననియును, ధరలు తగ్గిపోవుననియును, ఏమో యని యుపేక్షచేయక ముందుగానే కావలసినట్టుగా ధాన్యములు కొని దాఁచుకొనవలయు ననియును, వానలుమాత్రము కురియుననియును, రెట్టఁ డనియెను. ౧౦౬

క. మిహిరజుఁడు హస్తతారను,
రహిఁ మెలఁగఁగ వాన గల్గుఁ బ్రజలకు శుభ మా
మహిఁ గొలు చగ్గువ యగు నృపు,
లహితులచే హాని గాంతు రనె రెట్టఁ డొగిన్. ౧౦౭

తా. వేంకటరాజా! సూర్యునికొడుకు శని హస్త నక్షత్రమునందు సంచరించునప్పుడు వానలు కురియును. ప్రజలకు శుభములు కలుగును. భూమియందు ధాన్యములు చవుకయగును. రాజులు శత్రురాజులవలనఁ గీడు పొందెదరు—అని రెట్టఁ డన్నాఁడు. ౧౦౮

తే. గీ. ఇనసుతుఁడు చిత్త మెలఁగిన నెసఁగు వాన,
ప్రబలు వెనుకటిపంటలు ప్రజకు లెస్స
యగ్గు వై యుండు మిగుల ధాన్యములు కొన్ని,
దేశములయందు వేంకటాద్రిక్షితీంద్ర! ౧౦౯

తా. వేంకటరాజా! సూర్యునికొడుకయిన శని చిత్తనక్షత్రమునందు సంచరించినపక్షమున వానలు చక్కఁగాఁ గురియును. వెనుకటిపంటలు సమృద్ధిగా పండును. ప్రజలకు మేలుకలుగును. కొన్నిదేశములయందు ధాన్యములు మిగుల చౌకగా నుండును. ౧౦౯

తే. గీ. వనజహితుపట్టి స్వాతికి వచ్చియున్నఁ,
బొలియు గంగానదీప్రాంతభూవిభుండు
గురియుఁ దగుపాటివాన యగ్గు వగుఁ గొలుచు,
జనులు సుఖు లౌదు రనె రెట్టఘనుఁడు వేడ్క. ౧౧౦

తా. వేంకటరాజా! పద్మములకు హితుఁడయిన సూర్యునికొడుకు శని స్వాతీనక్షత్రమునందుచేరి సంచారము చేయునప్పుడు గంగానదీప్రాంత భూముల నేలురాజు చనిపోవును. తగుమాత్రముగా వానలు కురియును. ధాన్యములు చవుక యగును. జనులు సుఖముగలవా రగుదురు—అని రెట్ట పండితుఁ డన్నాఁడు. ౧౧౦

చ. సరసిజమిత్త్రపుత్త్రుఁడు విశాఖఁ జరింపఁగ నంత్యకార్తెలన్
గురియునువానదారణలు క్రుంగును దక్షిణభూమిఁ దోఁచుభీ
కరముగ ధూమకేతు వల కన్నడసీమ ఫలించుఁ గొంత యు
చ్చెరువుగమాళవేంద్రుఁడు కృశించునవెన్నఁటి రెట్టఁడిమ్మహిన్.

తా. వేంకటరాజా! పద్మములకు స్నేహితుఁడయిన సూర్యునికొడుకు శని విశాఖానక్షత్రమునందు సంచరించుసమయమున తుదికార్తెలయందు వానలు కురియును. ధరలు తగ్గిపోవును. దక్షిణదేశమునందు భయంకరముగా తోఁకచుక్క యగపడును. కొంత యాశ్చర్యము గలుగునట్లు కన్నడదేశము ఫలించును. మాళవదేశపురాజు కృశించిపోవును—అని రెట్టఁ డన్నాఁడు.

సీ. రవితనూభవుఁ డనూరాధ నుండినఁ జైత్ర
మున ధాన్య మగ్గ మౌ జనులు చెలఁగ
నామీఁదఁ దక్కు వౌ నటమీఁద నెక్కు వౌ
నామీఁదఁ దఱుఁగును నంత్యమునను
ధూమకేతువు దోఁచు దుస్తరంబుగ మహా
డామడామరములు సంభవించుఁ
దేంకణభూభర్త పొంకంబు చెడి పోవుఁ
దగుపాటివాన మధ్యమఫలంబుఁ
తే. గీ. గలుగు దక్షిణమేదినీతలమునందు,
సమధికవ్యాధిసంఘంబు సంభవిల్లుఁ
దప్ప దనియెను సకలవిద్యాప్రవీణ,
శ్రీధురీణుండు రెట్టకందర్పుఁ డిలను. ౧౧౨

తా. వేంకటరాజా! సూర్యునికొడుకు శని యనూరాధానక్షత్రమునం దున్నపక్షమున చైత్రమాసమునందు జనులు సంతోషించునట్లు ధాన్యము చవుకయగును. చైత్రము దాఁటినతరువాతను ధర యెక్కువ యగును. తరువాతను మరియు హెచ్చును. మఱికొంతకాల మయినవెనుక మరలఁ దగ్గి

పోవును. అతఁ డానక్షత్రముతుదను సంచరించునపుడు తోఁకచుక్క యగపడును. కాలము గడచుటకుఁ గష్టముగా గొప్పక్షామము సంభవించుటయే కాక కొల్ల మొదలయిన దేశోపద్రవముకూడ సంభవించును. టేంకణదేశరాజు యొక్క పొంకము చెడిపోవును. వాన తగుమాత్రముగాఁ గురియును. ఫలము మధ్యమరీతి నుండును. దక్షిణదేశమునందు హెచ్చుగా పలువిధములయిన రోగములు సంభవించును. పైనఁ జెప్పినఫలములు తప్పవని సకలవిద్యలయందును ప్రావీణ్యము గలిగియున్నవాఁడగు మన్మథునిఁబోలు రెట్టఁ డన్నాఁడు.

ఉ. వారక జ్యేష్ఠయందు శని వర్తిలఁ బంటలు స్వల్పముం గదున్
దారణ తగ్గు వ్యాధు లగు నర్మదక్రేవల సస్యముల్ జలా
ధారమునన్ ఫలించు మఱి దక్కినభూములనేటికాల్వలన్
బైరులు లెస్సయౌనని యెఁ బ్రాజ్ఞుఁడు రెట్టఁడు నిశ్చయంబుగన్.

తా. వేంకటరాజా ! జ్యేష్ఠానక్షత్రమునందు శని సంచరించుచుండఁగా పంటలు తక్కువగా పండును. ధరలు తగ్గిపోవును. రోగములు సంభవించును. నర్మదాప్రాంతభూములు మాత్రము జలాధారమునఁ బండును. మిగతప్రదేశములయందు ఏటికాల్వలవలన సస్యములు లెస్సగా పండు నని పండితుఁడయిన రెట్టఁడు నిశ్చయించి చెప్పినాఁడు. ౧౧౩

మ. శని మూలర్క్షమునం జరించినను సస్యంబుల్ ఫలించున్ జనిం
చును గోదావరిదక్షిణోర్విని రుజాస్తోమంబు తద్దేశరా
జనిలోశత్రులచేతనొచ్చుధనధాన్యస్ఫూర్తిమించున్గదున్
వెనుకంబెట్టినపైరు పండ దనియెన్ రెట్టండుభూపాలకా !

తా. వేంకటరాజా ! శని మూలనక్షత్రమునందు సంచరించునప్పుడు సస్యములు చక్కఁగా పండును. గోదావరీనదికి దక్షిణభాగమునందు రోగములు సంభవించును. ఆదేశము నేలురాజు యుద్ధమునందు శత్రువులచేతను బాధింపఁబడును. ధనధాన్యములు సమృద్ధిగా నుండును. వెనుకటికాలమునందు వేసినసస్యములు పండవు—అని నేర్పుమీఱ రెట్టపండితుఁ డన్నాఁడు.

మ. జలతారన్ రవిసూనుఁ డుండినను వర్షంబుల్ విజృంభించు రా
జిలు సస్యంబులు ధాన్య మగ్గువయగున్ శ్రీశైలపర్యంతసీ
మలకున్ వ్యాధులు మిక్కిలౌఁ బసులకున్ మర్త్యాధిపశ్రేణికిం
గలుగుం బోరిది గార్గ్యసూక్తమనె లోకజ్ఞుండు రెట్టండిలన్.

తా. వేంకటరాజా! జలనక్షత్రమయిన పూర్వాషాఢయందు సూర్యుని కొడుకు శని యుండఁగా వర్షము లధికముగా కురియును. సస్యములు సమృద్ధిగా పండును. శ్రీశైలప్రాంతమునందలి ప్రదేశములయందు ధాన్యము చవుకయగును. పశువులకు హెచ్చుగా రోగములు సంభవించును. రాజులకు యుద్ధములు తటస్థించును. ఇది గార్గ్యుఁడు చెప్పిన మత మని లోకజ్ఞానముగల రెట్టఁ డన్నాఁడు. ౧౧౫

చ. ఇనజుఁడు వైశ్వతారఁ జరియించిన ధాన్యములెల్లఁ దగ్గిపో
వును వెలిపైరులున్ జెడును పోరులు గల్గును జెర్వులెల్ల నిం
డును వరిపంట గల్గును గడున్ వెలనాటివిభుండు నొచ్చు నా
తనిమహి బోయ లేలుదురు తప్పదనె న్గవి రెట్టఁ డెంతయున్.

తా. వేంకటరాజా! శని కోమటినక్షత్రమయిన యుత్తరాషాఢయందు సంచరించినట్టయితే యెల్లధాన్యములు తగ్గిపోవును. వెలిపయిరులు చెడిపోవును. రాజులకు యుద్ధములు తటస్థించును. ఎల్లచెఱువులును నిండును. వరిపంట హెచ్చుగా పండును. వెలనాటిరాజు చనిపోవును. ఆరాజుభూములను బోయ లేలుచుందురు—ఇది తప్పదని కవియగు రెట్టఁడు గట్టిగా అన్నాఁడు. ౧౧౬

చ. నలినహితాత్మజుండు శ్రవణంబున నుండినఁ దూర్పునాటిలోఁ
గొలఁదిగఁ గల్గువృష్టిమఱికొంచెము పంటలు బోయలావడిన్
దలఁకుచు నుంద్రుతజ్జనులు తక్కినభూములయందు వానవె
గ్గల మగుఁ బైరు లెల్ల నధికంబుగ మించును వేంకటాధిపా!

తా. వేంకటరాజా! పద్మములకు హితుఁడయిన సూర్యునికొడుకు శని శ్రవణనక్షత్రమునం దుండునప్పుడు తూరుపువయిపున నుండుదేశములలో తగుమాత్రముగా వానలు కురియును. పంటలును కొంచెముగానే పండును. ఆదేశపుప్రజలు బోయలు చేయునుపద్రవమువలన భయపడుచుందురు. తూర్పువయిపునఁ గాక తక్కినవయిపులయందు వాన లధికముగానే కురియును. పంటలును లెస్సగానే పండును. ౧౧౭

చ. ఒనర ధనిష్ఠతార శని యుండిన వానలు గల్గు గౌతమీ
దినకరకన్యకానికటదేశము పైరు ఫలించు నగ్గువై
తనరును ధాన్య మంత బెడిదంబుగఁ బుట్టును ధూమకేతువెం
దును దవసంబు తగ్గుఁ జెడుఁ ద్రోవ లనేక గవి రెట్టఁడింపునన్.

తా. వేంకటరాజా! ఒప్పునట్లు శని ధనిష్ఠానక్షత్రమునందు సంచరించునపుడు వర్షములు బాగుగాఁ గురియును. గోదావరీప్రాంతమునందును, సూర్యునికూఁతురయిన యమునానదియొక్క ప్రాంతమునందును ఉన్నభూములయందలి పైరులు చక్కఁగా పండును. ఎల్లధాన్యములును చవుకగా నుండును భయంకరముగా తోఁకచుక్క పుట్టును. ప్రతిప్రాంతమునందును ధాన్యము తగ్గిపోవును. దారులు చెడిపోవును. అని రెట్టఁడింపుగా నన్నాఁడు.

సీ. శతతారకను శనైశ్చరుఁడు చరించినఁ
గార్తిక మాదిగాఁ గల్గు వాన
పాంచాలదేశాధిపతుల వధూటులు
వహ్నిలోఁ బడుదు రవారితముగ
నాదేశముననుండి యటు గాంచిపర్యంత
మును మారిచే నొచ్చు జనచయంబు
గౌతమి నర్మద గంగయు నాదిగా
దక్షిణదేశంబుదాఁకఁ బంట

తే. గీ. గల్గుఁ దక్కినసీమలఁ గల్గు వాన,
గొంచెముగఁ బంట పాటిల్లుఁ గుంజరములు
ఘోటకమ్ములు వెలయును గువలయమున,
ననియె రెట్టఁడు సకలవిద్యావిదుండు. ౧౧౯

తా. వేంకటరాజా! శని శతభిషఙ్నక్షత్రమునందు సంచరించు నప్పుడు కార్తికమాసము మొదలుకొని వానలు కురియును. పాంచాలదేశపు రాజులు చావఁగా వారి స్త్రీలు నిరాటంకముగా నగ్గిలోఁ బడిపోవుదురు. ఆపాంచాలదేశము మొదలుకొని కంచిపర్వతము గలభూమియందలిజనులు మహామారీరోగముచేతను బాధింపఁ బడుదురు. గోదావరి, నర్మద, గంగ మొదలుగా దక్షిణదేశమువఱకును పంటలు పండును. తక్కినప్రదేశముల యందు వానలును తక్కువయే, పంటలును తక్కువయే. ఏనుఁగులు గుఱ్ఱములు భూమియందు హెచ్చుగా నుండును—అని యెల్లవిద్యల నెఱిఁగిన రెట్టఁ డన్నాఁడు. ౧౧౯

సీ. రవితనూజుండు పూర్వాభాద్ర నుండిన
వనధి గౌతములందు వాన గురియు
మొదవులు లెస్సగాఁ బిదుకును నేప్రొద్దు
ఘనముగాఁ బంటలు గల్గి యుండు
గంగామహానిమ్నగాతటంబుననుండి
దక్షిణదేశంబుదాఁకఁ బైరు
లధికఫలంబుచే నలరారును సమస్త
పృథ్వీతలంబు సుభిక్ష మగును
తే. గీ. మగధపాంచాలదేశభూమండలేంద్ర,
సూనువితతికి నెంతయు హాని పుట్టు
నరసి చూడంగ నీ నిర్ణయంబు మిగుల,
దనియె రెట్టఁడు సకలవిద్యావిదుండు. ౧౨౦

తా. వేంకటరాజా! సూర్యునికొడుకు శని పూర్వభాద్రానక్షత్రమునం దుండినపక్షమున సముద్రమునందును, గోదావరియందును వానలు కురియును. ఆవులు సమృద్ధిగా పా లిచ్చును. ఎల్లవేళలయందు పంట లధికముగా పండును. గంగానదీతీరము మొదలుకొని దక్షిణదేశమువఱకును సస్యములు హెచ్చుపంటలతో ప్రకాశించుచుండును. భూమండల మంతయు సుభిక్షముగ నుండును. మగధదేశమును, పాంచాలదేశమును ఏలురాజుల బిడ్డలకు మిగుల హాని కలుగును. ఆలోచించి చూడఁగా, పైనఁ జెప్పఁబడిన నిర్ణయము తప్పదని సకలవిద్యావిశారదుఁడయిన రెట్టకవి యన్నాఁడు. ౧౨౦

తే. గీ. అర్కసుతుఁ డుత్తరాభాద్రయందు మెలఁగఁ,
గలుగు వానలు పంటలు నలరు దక్షి
ణావనిస్థలి మధురరాజ్యం బడంగు,
ననియె రెట్టఁడు సకలవిద్యావిదుండు. ౧౨౧

తా. వేంకటరాజా! సూర్యునికొడుకగుశని, ఉత్తరభాద్రానక్షత్రమునందు సంచరించునప్పుడు వానలు కురియును. పంటలు పండును. దక్షిణదేశమునందలి మధురయనురాజ్యము నశించును—అని సకలవిద్యలనెఱిఁగిన రెట్టఁ డన్నాఁడు. ౧౨౧

క. జలజాప్తసుతుఁడు రేవతి,
నలరినఁ బంటలును స్వల్ప మగు వర్షంబుల్
గలుగవు చెడుఁ గాశీక్షితి,
తలనాయకుఁ డనియె రెట్టధన్యుఁడు వేడ్కన్. ౧౨౨

తా. వేంకటరాజా! పద్మములకు బంధువయిన సూర్యునికొడుకు శని రేవతీనక్షత్రమునందు సంచరించునప్పుడు వానలును గురియవు. పంటలును లెస్సగా పండవు. కాశీదేశపురాజు నశించు—నని రెట్టఁడను ధన్యుఁడు వేడుకగా నన్నాఁడు. ౧౨౨

చ. తలఁపఁగఁ జక్రకోటవసుధాతలమెల్ల సుభిక్ష మౌ శుభం
బు లగును దేవగేహములు పూజలఁబొల్చును మేలుచెందన
క్కలికలుషంబు వాయు నధికంబుగ నుత్తరదేశసస్యముల్
ఫలమున మించు మేషమున భానుజుఁ డుండిన వేంకటాధిపా!

తా. వేంకటరాజా! ఆలోచింపఁగా, మేషరాశియందు సూర్యుని కొడుకయిన శనియుండఁగా, చక్రకోటప్రాంతమునందలి భూప్రదేశ మంతయు సుభిక్షముగ నుండును. ప్రజలకు శుభములు కలుగును. దేవాలయములు ప్రజలకు మేలు చెందునట్లుగా పూజాపురస్కారములతోఁ బ్రకాశించుచుండును. కలివలనఁ గలిగిన కాలుష్యము తొలఁగిపోవును. ఉత్తర దేశమునందలి సస్యములు హెచ్చుగా పంటలతో నొప్పుచుండును. ౧౨౩

తే. గీ. సౌరి వృషభస్థితుం డైనఁ జోరబాధ,
చిచ్చులును గల్గి వెలనాటిసీమ చెడును
తఱుఁగు జొన్నలు వ్యథ గల్గు ధరణిప్రజకు,
ననిరొ రెట్టఁడు సకలవిద్యావిదుండు. ౧౨౪

తా. వేంకటరాజా! సూర్యునికొడుకు శని వృషభమం దుండినట్టయితే ప్రజలకు దొంగలవలని బాధలును, అగ్నిభయములును సంభవించి వెలనాటి ప్రదేశము చెడిపోవును. జొన్నపంట తగ్గిపోవును. భూమియందలి ప్రజలకు పీడలు గలుగును. అని సకలవిద్యల నెఱిఁగిన రెట్టఁడన్నాఁడు. ౧౨౪

క. ఇనజుఁడు మిథునమునకు వ,
చ్చిన గంగాప్రాంతధరణి శ్రీగిరికటకా
వని చెడు నగ్గజపతిసీ,
మను బోయలు మింతు రనిరొ మన రెట్టఁడిలన్. ౧౨౫

తా. వేంకటరాజా! సూర్యునికొడుకు శని మిథునరాశియందు ప్రవేశించినట్టయితే గంగానదీప్రాంతభూములును, శ్రీశైలము మొదలు

కొని కటకమువఱకును గల భూములును చెడిపోవును. ఆగజపతు లేలు భూములయందు బోయ లధికు లగుదు రని మనరెట్టఁ డనెను. ౧౨౫

తే. గీ. కర్కటకరాశి శని యున్నఁ గాంచి గౌత,
మీతటోర్విని బంటలు మిగులఁ జెడును
వేఁగినాటివసుంధరావిభుఁడు నొచ్చు,
నగ్గు వగు ధాన్య మనె రెట్టఁ డలఘుమతిని. ౧౨౬

తా. వేంకటరాజా! శని కర్కటరాశియందు ప్రవేశించిన ట్లయితే కంచిప్రాంతమునందును, గోదావరీతీరభూములయందును పంటలు మిక్కిలిగా చెడిపోవును. వేఁగీదేశము నేలురాజు బాధపడును. ధాన్యము చవుక యగును—అని మంచిబుద్ధితో రెట్టఁడన్నాఁడు. ౧౨౬

క. తరణిజుఁడు సింహ మందినఁ,
గరి హయ నరపతులతోడ గంగాప్రాంతం
బరయ నల పాండ్యదేశం,
బరుదుగఁ జెడు ననియె రెట్టఁ డతులప్రౌఢిన్. ౧౨౭

తా. శని సింహమును చేరినట్లయితే ఏనుఁగులతోను, గుఱ్ఱములతోను, రాజులతోను (లేక గజపతులు, అశ్వపతులు అను వీరితోను) కూడ గంగానదీ ప్రాంతభూమియును, పాండ్యదేశమును ఆశ్చర్యముగాఁ జెడిపోవు నని సాటిలేని ప్రౌఢితో రెట్టఁ డన్నాఁడు. ౧౨౭

తే. గీ. సవితృతనయుండు కన్యను సమత నుండ,
వర్షధాన్యంబు లల్ప మౌ వసుధయందు
నశ్వగోమేషచయములు నణఁగిపోవు,
సకలదేశంబులందును సమర మగును. ౧౨౮

తా. శని కన్యారాశియందు సమత్వముతో నున్నట్లయితే భూమి యందు వానలును పంటలును తక్కువగ నుండును. గుఱ్ఱములు, గోవులు, మేఁకలు ఇవి నశించు. ఎల్లదేశములయందును యుద్ధములు సంభవించును.

క. తులయందు సౌరి యుండిన,
నిలపై వర్షించు ఘనము లెసఁగుదురు జనుల్
వలువలు నగ్గ యగు రా,
జులకున్ సంగరము లగును శూరులు సెలఁగన్. ౧౨౯

తా. శని తులారాశియం దున్నట్లయితే వానలు కురియును, జనులు వృద్ధిగా నుందురు. వస్త్రములు చవుక యవును. శూరులు సంతోషించు నట్లు రాజులకు యుద్ధము లగును. ౧౨౯

క. ఘనుఁ డైన రాజు చచ్చును,
ననుపమవర్షములు గురియు నఖిలధరిత్రిన్
బెనుపుగ నెసఁగును డామర,
మినతనయుఁడు వృశ్చికమున కేఁగిననాఁటన్. ౧౩౦

తా. శని వృశ్చికమునందు ప్రవేశించినప్పుడు దొడ్డరాజు చని పోవును. భూమియందంతటను సాటిలేనివానలు గురియును. కొల్లమొద లయిన యుపద్రవములు హెచ్చగును. ౧౩౦

క. ధనురాశిని శని యుండిన,
ననయము క్షామంబు లధిక మగు నీజగతిన్
బెను పగు యుద్ధమ్ములు ధర,
ననవరతము పైరు మనుజు లలపసులు చెడున్. ౧౩౧

తా. శని ధనుస్సునందు ప్రవేశించినట్టయితే తఱచుగా కఱవులు తటస్థించును. గొప్పయుద్ధము లగును. సస్యములు, మనుజులు, పసులు చెడుట జరగును. ౧౩౧

తే. గీ. మకరమున శని యుండంగ మహిని దూర్పు,
నాటిలో రాజు చచ్చు నానాడు బోయ
లేలుదురు వెన్క వాన సమృద్ధి యగును,
బండు వరి పైరు లనియె రెట్టండు వేడ్క. ౧౩౨

తా. వేంకటరాజా! శని మకరరాశియం దుండునప్పుడు తూర్పు దేశపురాజు చనిపోవును. ఆదేశమును బోయ లేలుదురు. వెనుకటి వానలు సమృద్ధిగా కురియును. వరిపంట బాగుగా పండును—అని సంతోషము తో రెట్టఁ డన్నాఁడు. ౧౩౨

తే. గీ. కుంభమున శని యుండినఁ గుంభినికిని,
వాన ఘన మగుఁ బంటలు పండు మివుల
భీతికి చెడిదంబుగా ధూమకేతు వెసఁగు,
ననియె రెట్టండు భూజను లభినుతింప. ౧౩౩

తా. శని కుంభరాశియం దున్నప్పుడు భూమియందు హెచ్చుగా వానలు కురియును. మిక్కిలిగా పంటలు పండును. భూమియందలి ప్రజకు కష్టము గలుగునట్లు తోఁకచుక్క యుదయించును—అని భూమియందలి జనులు పొగడునట్లు రెట్టఁ డన్నాఁడు. ౧౩౩

క. మీనంబున శని యుండిన,
వానలు పైరులును జెడును వసుమతిమీఁదన్
నానాదేశములందును,
భూనాథులు సంగరమునఁ బొలియుదు రధిపా! ౧౩౪

తా. వేంకటరాజా! శని మీనరాశియందున్నప్పుడు భూమియందు వానలు కురియవు. పంటలు చెడును. ఎల్లదేశములయందును రాజులు యుద్ధములలోఁ జత్తురు. ౧౩౪

మా. శ్రీమదహోబలనాథపదాంబుజసేవనతత్పరభవ్యమతీ!
రామదిలీపయయాతిభగీరథరంతిముఖాధిపనిత్యధృతీ!
హేమమణీవసుధాదికదానసుహృష్టమహీవిబుధప్రతతీ!
ధీమధురోక్తివిశేషవిశారదధీరకవిప్రభులబ్ధకృతీ! ౧౩౫

తా. శ్రీమంతుఁ డయిన యహోబల నరసింహస్వామి యొక్క పాదపద్మములను సేవించుటయం దాసక్తమును, శ్రేష్ఠమును నగు బుద్ధి గల వాఁడా! శ్రీరాముఁడు, దిలీపుఁడు, యయాతి, భగీరథుఁడు, రంతిదేవుఁడు మొదలయిన రాజులయొక్క శాశ్వతమయిన ధైర్యమువంటి ధైర్యము గల వాఁడా! బంగారు, రత్నములు, భూమి మొదలయిన వాని దానములచేతను లెస్సగా సంతోషపెట్టఁబడిన భూదేవతా (బ్రాహ్మణ) సమూహము గల వాఁడా! బుద్ధియందును, మధురములయిన వాక్యవిశేషములయందును నేర్పరులయి పండితులయిన కవీశ్వరులచేతను పొందఁబడిన గ్రంథములు గలవాఁడా! ౧౩౫

భుజంగప్రయాతము. మరాటాంగవంగాంధ్రమత్స్యత్రిగర్తా
దిరాష్ట్రేశసంస్తుత్యతేజోయశస్సు
స్థిరైశ్వర్య! కొండ్రాజుతిమ్మక్షమాభృ
ద్వరేణ్యస్ఫురద్గర్భవారాశిచంద్రా! ౧౩౬

తా. మహారాష్ట్రము, అంగము, వంగము, ఆంధ్రము, మాత్స్యము, త్రిగర్తము మొదలయిన రాష్ట్రముల ప్రభువులచేతను లెస్సగా కొనియాడఁదగిన తేజస్సు, కీర్తి, స్థిరమయిన యైశ్వర్యమును గలవాఁడా! కొండ్రాజు తిమ్మరాజశ్రేష్ఠునియొక్క ప్రకాశించుచున్న గర్భమనెడి సముద్రమునకుఁ జందురుఁడా! ౧౩౬

# పంచమాశ్వాసము.

క. శ్రీనిత్య! యహోబలనగ,
రీనరకేసరిపదాబ్జభృంగ! సవినయా
నూనప్రాభవ! నయవి,
ద్యానిధి! కొండ్రాజువేంకటాద్రినరేంద్రా! ౧

తా. శాశ్వతమయిన యైశ్వర్యము గలవాఁడా! అహోబలనగరము నందు వేంచేసియున్న నరసింహస్వామియొక్క పాదపద్మములయందు తుమ్మెదవంటివాఁడా! వినయముతోఁ గూడిన యధికమయిన ప్రభుత్వము గలవాఁడా! రాజనీతివిద్యకు నిధి యయినవాఁడా! కొండ్రాజుగారి వేంకట రాజేంద్రా! ౧

గురుసంచారఫలము.

ఉత్సాహ. గురుఁడు మేషరాశి నున్నఁ గురియు వాన పంటలుం
బరఁగుఁ గొలుచు ధనము మించు భాసురముగ భువిని భూ
సురులు క్రతువిధానపరత సొంపు మీఱి యుండ్రు భా
స్కరప్రతాప! తిమ్మశౌరిసరస వేంకటాధిపా! ౨

తా. సూర్యునిప్రతాపమువంటి ప్రతాపము గలవాఁడా! తిమ్మరాజుగారి సరసుఁడవయిన వేంకటరాజా! విను మింక గురుసంచారఫలమును చెప్పెదము—గురుఁడు మేషరాశియం దున్నప్పుడు వానలు కురియును. పంటలు పండును. ధాన్యము, ధనము హెచ్చుగా నుండును. భూమియందు ప్రకాశించునట్టుగాఁ బ్రాహ్మణులు యజ్ఞముల నాచరించుటయం దాసక్తిగలిగి సొంపుగా నుందురు. ౨

తే. గీ. వృషభరాశిని గురుఁ డున్న వృజిన మొదవు,
శిశువులకు నావులకుఁ గల్గుఁ జేటు మిగులఁ
బరఁగు రుజ ధరఁ బ్రజలకుఁ బంట లేక,
వ్యర్థ మగు నని రెట్టన వరయశుండు. ౩

తా. వేంకటరాజా ! గురుఁడు వృషభరాశియం దున్నప్పుడు పాపము సంభవించును. శిశువులకును, ఆవులకును మిక్కిలి చెఱుపు గలుగును. మనుజులకు రోగములు సంభవించును. పంటలులేక బాధలు కలుగును—అని శ్రేష్ఠమయిన కీర్తిగల రెట్టఁ డన్నాఁడు. ౩

క. సురగురుఁడు మిథునరాశిని,
జరియించిన ధరణిపతులు శత్రులచేతన్
దురమునఁ గూలుదు రనియెను,
సరసులు మెచ్చంగ రెట్టసత్కవి యధిపా! ౪

తా. వేంకటరాజా ! దేవతల కాచార్యుఁడయిన గురుఁడు మిథునరాశియం దున్నప్పుడు రాజులు శత్రువులచేతను యుద్ధములలో పడిపోవుదురు—అని సరసులు మెచ్చునట్లు రెట్టకవీశ్వరుఁ డన్నాఁడు. ౪

తే. గీ. గురుఁడు కర్కాటకముఁ జేరఁ గొలఁది వాన,
చెఱకు వరియును ఫలియించు సిద్ధముగను
బసులు హెచ్చుగఁ బా లిచ్చుఁ బ్రజలు నొత్తు,
రనియె రెట్టండు సకలవిద్యావిదుండు. ౫

తా. వేంకటరాజా ! గురుఁడు కర్కటరాశియం దున్నప్పుడు వానలు కొలఁదిగా కురియును. చెఱకు, వరి సమృద్ధిగా ఫలించును. పసులు హెచ్చుగా పా లిచ్చును. ప్రజలు రోగాదులవలన నొచ్చియుందురు—అని సకలవిద్యల నెఱిఁగిన రెట్టఁ డన్నాఁడు. ౫

క. శతమఖసచివుఁడు మృగపతి,
గతుఁ డైనం గలహ మా జగతినాథులకున్
క్షితి నల్పవృష్టి యగు జన,
తతి కడు నొచ్చు ననె రెట్టధన్యుం డధిపా! ౬

తా. వేంకటరాజా! దేవేంద్రునిమంత్రియయిన గురుఁడు సింహరాశియం దున్నప్పుడు రాజులకు కలహములు సంభవించును. భూమియందు కొంచెముగా వానలు కురియును. జనులు మిక్కిలి నొచ్చియుందురు—అని ధన్యుఁడయిన రెట్టఁ డన్నాఁడు. ౬

తే. గీ. కన్నెరాశిని గురుఁ డున్న నన్నిధాన్య,
ములును విత్తిన ఫలియించు మొదవు పితుకుఁ
బ్రజలు సద్ధర్మములచేతఁ బ్రబల మెసఁగ,
వెలయుచుందురు కొండ్రాజువేంకటేంద్ర! ౭

తా. కొండ్రాజుగారి వేంకటరాజా! గురుఁడు కన్యారాశియం దున్నప్పుడు చల్లినధాన్యాదు లన్నియు ఫలించును. ఆవులు చాలఁ బాలిచ్చును. ప్రజ లందఱును మంచిధర్మముల నాచరించుటచేతను సంతోషము హెచ్చుకాఁగా నొప్పుచుందురు. ౭

క. తుల గురుఁ డున్నను గురియును,
దొలివానలు నిండుఁ గొలుచుతోఁ బాఁతరలున్
సలిలము గలుగును బ్రజకు స,
కలజనులకు వేడ్క లొదవుఁ గవిజనవంద్యా! ౮

తా. కవీశ్వరులచేతను స్తుతింపఁబడిన వేంకటరాజా! గురుఁడు తులారాశియం దున్నప్పుడు తొలకరివానలు కురియును. పాఁతరలు ధాన్యములతో నిండును—అనఁగా హెచ్చుగా ధాన్యము పండును. ప్రజలకు జలము సమృద్ధిగా లభించును. ఎల్లవారికిని సంతోషము కలుగును. ౮

సీ. గురుఁడు వృశ్చికరాశిఁ జరియింపఁ బంటలు
కొంచె మాఁగడు వాన గురియు మఱియు
ధనువున నుండినఁ దఱుఁగును నువ్వులు
ప్రత్తియుఁ బెసరయుఁ బరఁగు వెనుక

వృష్టియుఁ గురియును వెలిపైరు లెస్స య
మరియుండు భువియందు మకరరాశి
నున్న వానలు గల్గు నుజ్జ్వలంబుగ నన్ని
పైరులు లెస్స లౌ దారణలును

తే. గీ. గురుఁడు కుంభముఁ జేరినఁ గురియు వాన,
నిండుఁ జెఱువులు వెలయును దండిపంట
మీనమున నున్న వెలిపైరు మెఱయు నల్ప,
వృష్టి యౌ ననె రెట్టండు వేంకటేంద్ర! ౯

తా. వేంకటరాజా ! గురుఁడు వృశ్చికరాశియం దున్నప్పుడు పంటలు కొలఁదిగా పండును. వానలు హెచ్చుగానే కురియును. గురుఁడు ధనూరాశియం దున్నప్పుడు నువ్వులపంట తక్కువ యగును. ప్రత్తియును, పెసలును సమృద్ధిగా ఫలించును. వెనుకటివానలు కురియును. వెలిపయిరులు లెస్సగా ఫలించును. గురుఁడు మకరరాశియం దున్నప్పుడు వర్షము సమృద్ధిగా కురియును. అన్నిసస్యములును సమృద్ధిగా పండును. ధరలు హెచ్చుగా నుండును. గురుఁడు కుంభరాశియం దున్నప్పుడు చెఱువులు నిండునట్లుగా వానలు కురియును. దండిగా పంటలు పండును. గురుఁడు మీనరాశియం దున్నప్పుడు వెలిపయిరులు పండును. వానలు కొంచెముగానే కురియును— అని రెట్టఁ డన్నాఁడు. ౯

సీ. కడఁగి గీష్పతి కృత్తికను రోహిణిని నుద
యము నొంద నది కార్తికాబ్ద మనఁగఁ
బరఁగుఁ దత్ఫల మస్త్రభయ మీతిబాధలు
నరులకు హాని భూనాథులకును
రుజలు గల్గును మఱి రూఢిగా సౌమ్యార్ద్ర
లం దుదయించిన నదియె మార్గ

శీర్షాబ్ద మనఁ దగు క్షితితలంబున వాన
పడకుండు మృగములు మిడుత లెలుక
తే. గీ. పక్షిగమి గూడి చెలుఁగును బయిరు లెల్లఁ,
బూని భూపాలకుల కాప్తు లైనజనులు
శత్రుభావంబుచేఁ జాల సంచరింతు,
రనియె రెట్టఁడు సిరివేంకటావనీశ! ౧౦

తా. శ్రీమంతుఁడవయిన యోవేంకటరాజా! బృహస్పతి కృత్తికా నక్షత్రమునందును, రోహిణీనక్షత్రమునందును ఉదయించినట్టయితే అది కార్తికాబ్ద మని చెప్పఁబడును. దానికి ఫలము—ఆయుధములవలన భయము కలుగును. మనుజుల కీతిబాధలు గలుగును—(అతివృష్టి, అనావృష్టి, ఎలుకలు, చిలుకలు, మిడుతలు, సమీపమునందున్న రాజులు—అనువీనివలనఁ గలుగుబాధలే యీతిబాధలు.) రాజులకు కీడు కలుగును. ఎల్లవారికిని రోగములు సంభవించును. గురుఁడు మృగశీర్ష నక్షత్రమునందును, ఆరుద్రనక్షత్రమునందును ఉదయించినపక్షమున—అదే మార్గశీర్షాబ్ద మనుటకు తగును. దానికి ఫలము—భూతలమునందు వానలు కురియవు. మృగములు, మిడుతలు, ఎలుకలు, పక్షులు చేరి యెల్లసస్యములను ఫలింపకుండునట్లు పాడు చేయును. రాజుల కిష్టులయినవారే శత్రుత్వమును వహించి ప్రవర్తింతురు—అని రెట్టఁ డన్నాఁడు. ౧౦

సీ. వరుసతోఁ డుతఁ బునర్వసు పుష్య భాశ్లేష
లందు గురుం డుదయంబు నొందఁ
బౌషాబ్ద మండ్రు తత్ఫలము ప్రజల్ దయ
గలిగి యుండుదురు సౌఖ్యంబు గలుగు
నాగి మఘపుబ్బల నుదయింప మాఘాబ్ద
మన మించుఁ దత్ఫలం బఖిలజనులు

సురపితృభక్తితత్పరు లౌదు రుత్తర
హస్తలయం దుదయంబు నొంద
తే. గీ. ఫాల్గునాఖ్యాబ్ద మగును దత్ఫలము రాజ,
బాధలు ఘటిల్లు ధారుణీభాగమందు
వాన లధికము పంటలు పండు లెస్స,
వినుము కొండ్రాజుతిమ్మయవేంకటేంద్ర! ౧౧

తా. కొండరాజుతిమ్మరాజుగారి వేంకటరాజా! ఇంకను చెప్పెదము వినుము. గురుఁడు వరుసగా పునర్వసునక్షత్రమునందును, పుష్యనక్షత్రమునందును, ఆశ్లేషనక్షత్రమునందును ఉదయించినపక్షమున, అది పౌషాబ్ద మని వ్యవహరింతురు. దానికి ఫలము—ప్రజ లందఱును ఒకరియం దొకరు దయ గలవారయి యుందురు. ఎల్లవారికిని సౌఖ్యము కలుగును. గురుఁడు మఘానక్షత్రమునందును, పుబ్బనక్షత్రమునందును ఉదయించిన ట్టయితే అది మాఘాబ్ద మని ప్రసిద్ధి కెక్కును. దానికి ఫలము—ఎల్లవారును దేవతలయందును, పితృదేవతలయందును భక్తిభావముతో నుందురు. గురుఁ డుత్తరానక్షత్రమునందును, హస్తనక్షత్రమునందును, ఉదయించినయెడల నది ఫాల్గునాబ్ద మనఁదగును. దానికి ఫలము—రాజులవలన ప్రజలకు బాధలు గలుగును. భూతలమునందు హెచ్చుగా వానలు కురియును. పంటలును లెస్సగానే పండును. ౧౧

సీ. ఒనరఁ జిత్రాస్వాతులను గురుఁ డుదయంబు
నందిన నదియె చైత్రాబ్ద మనఁగ
వెలయుఁ దత్ఫలము వానలు మధ్యమంబును
బంట దారణలు నల్పంబు దలఁప
విప్రు లాదిగ వర్ణవృత్తి మానుదురు బృ
హస్పతి మఱి విశాఖానురాధ

లం దుదయించిన నదియె వైశాఖాబ్ద
మన ధరలోనఁ బ్రఖ్యాత మయ్యెఁ

తే. గీ. దత్ఫల మశేషభూసురోత్తములు రాజ,
వరులు నత్యంతసమ్మదస్వాంతు లగుదు
రధికముగ సస్యతతి ఫలం బందు నండ్రు,
వినుము కొండ్రాజుతిమ్మయవేంకటేంద్ర! ౧౨

తా. కొండరాజుతిమ్మరాజుగారి వేంకటరాజా! ఇంకను వినుము. గురుఁడు చిత్తనక్షత్రమునందును, స్వాతీనక్షత్రమునందును ఉదయించితే అది యేచైత్రాబ్ద మనునట్లు ప్రకాశించును. దానికి ఫలము—వానలు సామాన్యముగా కురియును. ఆలోచింపఁగా పంటలు స్వల్పముగా పండును. వెలలు కూడ తగ్గియేయుండును. బ్రాహ్మణులు మొదలుగానెల్లవారును తమతమ వృత్తులను విడుతురు. గురుఁడు విశాఖానక్షత్రమునందును, అనూరాధానక్షత్రమునందును ఉదయించినయెడల నది వైశాఖాబ్ద మని భూమియందు ప్రసిద్ధ మయినది. దానికి ఫలము—ఎల్లరు బ్రాహ్మణులును, రాజులును మిగుల సంతోషించిన చిత్తములుగలవా రగుదురు. సస్యములు సమృద్ధిగాపండు నందురు.
౧౨

సీ. తలఁప మూలజ్యేష్ఠతారల గురుఁ డుద
యంబు నొందినను జ్యైష్ఠాబ్ద మనఁగ
వెలయుఁ దత్ఫలము పైరులకు నొప్పదు పాటి
గను బండినను బొల్లు గలుగుఁ జాల
ననువొంద మఱియుఁ బూర్వాషాఢ నలయుత్త
రాషాఢయం దుదయంబు నొంద
నదియె యాషాఢాబ్ద మనఁ బ్రసిద్ధి వహించు
ధరణిఁ బ్రజాపీడ తత్ఫలంబు

తే. గీ. లేవు వానలు పైరు ఫలింపకుండు,
గ్రామములకు సమస్తభూరమణులకును
భయము వాటిల్లు మనమునఁ బ్రతిదినంబు,
ననియె రెట్టండు శ్రీవేంకటాద్రిరాజ! ౧౩

తా. శ్రీమంతుఁడవయిన యో వేంకటరాజా! ఆలోచింపఁగా గురుఁడు జ్యేష్ఠనక్షత్రమునందును, మూలనక్షత్రమునందును ఉదయించినట్టయితేను అది జ్యేష్ఠాబ్ద మని వ్యవహరింపఁబడును. దానికి ఫలము—సస్యములకు మంచిది గాదు. ఒకవేళ నవి పండినప్పటికిని ఆపంటయందు చాల భాగము పొల్లుగానే యుండును. ఇంతేకాక గురుఁడు, పూర్వాషాఢా నక్షత్రమునందుఁగాని, ఉత్తరాషాఢానక్షత్రమునందుఁ గాని యుదయించిన పక్షమున అదియే ఆషాఢాబ్ద మనగా ప్రసిద్ధినిపొందును. దానికి ఫలము—భూమియందు ప్రజలకు పీడలుగలుగును. వానలు కురియవు. పంటలు పండవు. గ్రామములకును, ఎల్లరు రాజులకును ఎల్లవేళలయందును మనస్సులయందు భయములు కలుగుచుండును—అని రెట్టఁ డన్నాఁడు. ౧౩

తే. గీ. సరవి శ్రవణధనిష్ఠల శతభిషమున,
దేవగురుఁ డుదయించిన దేశమునకు
శ్రావణాబ్దమ్మనంగ సస్యము ఫలించుఁ,
గలవు బహుబాధ లనె రెట్టకవివరుండు. ౧౪

తా. వేంకటరాజా! వరుసగా దేవతలకు గురువయిన గురుఁడు శ్రవణ నక్షత్రము నందును, ధనిష్ఠానక్షత్రమునందును, శతభిష మనునక్షత్రమునందును ఉదయించిన ట్టయితే అది శ్రావణాబ్ద మనఁబడును. దానికి ఫలము—సస్యములు చక్కఁగా ఫలించును. అయినప్పటికిని దేశములం దనేకములయిన బాధలు కలుగు నని రెట్టకవి యనెను. ౧౪

సీ. ఒనరఁ బూర్వభాద్ర నుత్తరభాద్రను
రేవతియందును దేవమంత్రి
యుదయంబు నొందిన నదియె భాద్రపదాబ్ద
మన నొప్పుఁ దత్ఫలం బఖిలసస్య
ఫలసమృద్ధి ఘటిల్లు బలిచక్రవర్తి యే
లెడునాఁటివలెఁ బ్రజ లెస్స యుండు
నొగి నశ్విభరణులం దుదయంబు నొందిన
నాశ్వయుజాబ్దమై యలరు జగతిఁ
తే. గీ. దత్ఫలము వాన పంటలుఁ దనరు మిగులఁ,
బ్రజలకును రాజకోటికి భయము గలుగు
క్షోణితలము సుభిక్షమై సొంపు గాంచు,
వినుము కొండ్రాజుతిమ్మయ వేంకటేంద్ర! ౧౫

తా. కొండ్రాజు తిమ్మరాజుగారి వేంకటరాజా! ఇంకను చెప్పెదము వినుము. దేవతలకు మంత్రియయిన గురుఁడు, పూర్వభాద్రానక్షత్రమునందును, ఉత్తరభాద్రా నక్షత్రమునందును రేవతీనక్షత్రమునందును ఉదయించిన పక్షమున అదియే భాద్రపదాబ్దమని యొప్పుచుండును. దానికి ఫలము—అన్ని సస్యములును సమృద్ధిగా పండును. బలిచక్రవర్తి భూలోకము నేలుచుండెడి నాఁటివలెనే ప్రజలు ధనధాన్యసమృద్ధిగలవా రయి లెస్సగా నుందురు. గురుఁ డశ్వినీనక్షత్రమునందును, భరణినక్షత్రమునందును ఉదయించినచో అది యాశ్వయుజాబ్దమనఁగా నొప్పును. దానికి ఫలము—వానలు సమృద్ధిగా కురియును. పంటలు లెస్సగా పండును. కాని ప్రజలకును, రాజులకునుగూడ భయములు కలుగును. భూతలముమాత్రము సుభిక్షము గలిగి సొంపుగా నుండును.
౧౫

సీ. ఒకయేఁట రెండుతారకలను గురుఁ డున్నఁ
గడు నుత్తమము తారకంబు నొకట

నరయంగ మధ్యమం బట తారకాత్రయం
బున నున్న నధమమమ్మ భూతలమున
గురుఁ డొకయేఁటిలోఁ బరువడి రోహిణీ
ప్రభృతిగాఁ దారకాత్రయిని నడవ
నాషాఢమాసంబునందు శ్రావణమునఁ
బ్రజలకుఁ బాటిల్లు భయము చాల
తే. గీ. మఱియు నొకయేఁట నాశ్లేష మఘను గురుఁడు,
సంచరించిన నందందు జనుల కెల్లఁ
గలుగు నానెల మొదలుగా ఘనశుభములు,
వినుము కొండ్రాజుతిమ్మయవేంకటేంద్ర! ౧౬

తా. కొండ్రాజు తిమ్మరాజుగారి వేంకటరాజా ! గురుఁ డొక్క సంవత్సరమునందు రెండునక్షత్రములయం దుండినట్టయితే మిగుల మంచిది. అటుఁ డొక్కనక్షత్రమునందు మాత్రమే యున్నట్టయితే అంత మంచిది గాదు. మూఁడు నక్షత్రములయం దుండినచో బొత్తిగా మంచిది గాదు. గురుఁ డొక్కసంవత్సరమునందు వరుసగా రోహిణిమొదలుగా మూఁడు నక్షత్రములయం దనఁగా రోహిణి, మృగశిర, ఆరుద్ర అను నీమూఁడు నక్షత్రములయందును సంచరించినపక్షమున, ఆషాఢమాసమునందును, శ్రావణ మాసమునందును ప్రజలకు చాల భయములు సంభవించును. ఇంతేకాక, గురుఁ డొకసంవత్సరమందే అశ్లేష నక్షత్రమందును, మఘానక్షత్రము నందును సంచరించుచున్నయెడల, అక్కడక్కడ నెల్లప్రజలకును, ఆనెల మొదలుకొని గొప్పశుభములు కలుగును. ౧౬

సీ. వఱ నొంద నక్షత్రములు మూఁటఁ గ్రమమునఁ
జరియింపుచును దేవగురుఁడు ప్రీతి
నాదినక్షత్రమునందుఁ బాపగ్రహ
సహితుఁడై యుండిన జ్వలనభయము

కలుగు ద్వితీయనక్షత్రంబునందుఁ బా
పగ్రహసహితుఁ డేని పవనభయము
గలుగుఁ దృతీయనక్షత్రంబునందుఁ బా
పగ్రహాయుతుఁ డైనఁ బ్రకటముగను
తే. గీ. గలుగు క్షుద్భయ మిట్లు నక్షత్రములను,
మూఁటఁ బాపగ్రహంబులు మొనసి యున్న
నఖిలఫలములును జెడు రత్నాకరోక్త,
మీమతం బనె రెట్టఁ డుర్వీశచంద్ర! ౧౭

తా. రాజులలో చంద్రునివంటివాఁడవగు నో వేంకటరాజా! దేవతలకు గురువయిన గురుఁడు తగురీతిగా మూఁడునక్షత్రములయందు క్రమముగా సంచరించునపుడు అందు మొదటి నక్షత్రమునందు పాపగ్రహముతోఁ గూడి యున్నవాఁడైతే అగ్నివలన భయము కలుగును. రెండవనక్షత్రమునందు పాపగ్రహముతోఁ గూడియున్న పక్షమున గాడ్పులవలన మిగుల భయము గలుగును. మూఁడవనక్షత్రమునందు పాపగ్రహముతోఁ గూడినవాఁ డయినయెడల స్పష్టముగా కఱవు కలుగుటవలన ప్రజల కాఁకలి వలనిభయ మధిక మగును. ఈప్రకారముగా గురుఁడు మూఁడు నక్షత్రముల యందును పాపగ్రహములతోఁ గూడి యున్నచో జనులకు సర్వమయిన ఫలములును చెడును—ఇది రత్నాకరమునందుఁ జెప్పఁబడిన మత మని రెట్టఁ డన్నాఁడు. ౧౮

సీ. పదినెల లొకరాశిఁ బ్రిదశగురుం డున్న
వత్సర మ్మనఁగ విద్వత్సర మన
భాసిల్లు నందుకు ఫలములు వానలు
పంటలు తగుపాటి పదునొకండు
నెల లొకరాశిని నెలకొన్న నది గురు
వత్సరం బన నిడావత్సర మనఁ

దగు నందుకు ఫలంబు మిగులఁ బ్రమోదంబు
ప్రజల కెల్లను గల్గుఁ బదియు రెండు
తే గీ. నెలలు మఱియొకరాశిని మెలఁగ నగ్ని,
వత్సరం బనఁ బైతృకవత్సర మన
ఖ్యాతి నలరారు నిది యిందు కరయ ఫలము,
మధ్యమం బనె రెట్టఁడు మనుజనాథ! ౧౮

తా. వేంకటరాజా! దేవతలకు గురువయిన గురుఁడు పదిమాసము లొక్క రాశియం దుండిన ట్టయితే, అది వత్సర మనియు, విద్వత్సర మని యుఁ బ్రకాశించును. అందులకు ఫలము—వానలుకొలఁదిగాకురియును. పంట లు తగుమాత్రముగా పండును. గురుఁడు పదునొకండునెలలొకరాశియందుంటే ఆసంవత్సరము గురువత్సర మనియును, ఇడావత్సర మనియు అనవచ్చును. అందులకు ఫలము—ప్రజ లందఱకును హెచ్చుగా ఆనందము గలుగును. గురుఁడు పండ్రెండుమాసములకాలము ఒక్కటే రాశియందు సంచరించితే ఆసంవత్సర మగ్నివత్సర మని పితృవత్సర మని పేరు పొందును. అందు వలనిఫలము—కలుగవలసినఫలములు రెండవరకముగా కలుగును— అని రెట్టఁ డన్నాఁడు. ౧౮

సీ. పదుమూఁడునెలలు గీష్పతి యొక్కరాశిని
వర్తిల్ల నది దైవవత్సర మనఁ
బరివత్సరం బన భాసిల్లు నందుకు
ఫలము సమ్మద ముర్విఁ గలిగి యుండుఁ
బోలుపొందఁ బదునాల్గునెల లొక్కరాశిలో
వర్తింప నది యుగవత్సర మన
వసుధఁ బ్రాజాపత్యవత్సరం బన మించు
సకలదేశముల నందుకు ఫలంబు

తే. గీ. వైభవంబులు సంతతశోభనములు,
గలిగి జను లెల్ల సంతసం బలర నుండ్రు
లలితచారిత్ర! కొండ్రాజకులపవిత్ర!
ఘనకృపాసాంద్ర! వేంకటక్ష్మాతలేంద్ర! ౧౯

తా. చక్కనిచరిత్ర గలవాఁడా! కొండ్రాజుగారికులమును పావనముగాఁ జేసినవాఁడా! గొప్పది యగు దయచేతను నిండారినవాఁడా! వేంకటరాజా! బృహస్పతి పదుమూఁడుమాసముల కాల మొక్కరాశియందున్నట్టయితే ఆసంవత్సరము దైవసంవత్సర మనియును, పరివత్సర మనియును, ఒప్పుచుండును. అందులకు ఫలము— భూమియందలి జనులకు సంతోషము గలుగును. పొలుపొందునట్టుగా గురుఁడు పదునాలుగు నెల లొక్కరాశియందు సంచరించినయెడల నాసంవత్సరము యుగసంవత్సర మనియు, ప్రాజాపత్యవత్సర మనియు నొప్పుచుండును. అందులకుఫలము— ఎల్లదేశములయందును వైభవములు, సంతతము శుభములును గలిగి యెల్ల జనులును అధిక సంతోషముతో నుందురు. ౧౯

## సంవత్సర ఫలము.

సీ. ప్రభవాబ్దమున భువిఁ బంటలు తగుపాటి
ప్రజలు వైభవములఁ బ్రబలి యుండ్రు
కొఱ్ఱ రాగియు మినుము కొదవ లేక ఫలించు
వర్షంబు మధ్యంబు వసుధయందు
విభవాబ్దమున మఱి వృష్టియుఁ గొలఁది యౌ.
వెలిపైరు ఫలియించుఁ బితుకుఁ బశువు
లింటింట శుభములు నెసఁగు నిశ్చయ మిది
వినుము లె స్సగుఁ గడు వేడ్క లెసఁగ
తే. గీ. శుక్లవత్సరమున భూమి శుభము ముదము,
గలిగి సుఖలీల వర్ధిల్లు ఘనతరముగ

వాన గురియును బ్రజల కవ్వారి గాఁగఁ,
గలుగును శుభమ్ము లనియె వేంకటనరేంద్ర! ౨౦

తా. వేంకటరాజా! ఇటుపయిని సంవత్సరముల ఫలము చెప్పెదము వినుము. ప్రభవసంవత్సరమునందు పంటలు తగుమాత్రముగా పండును. ప్రజలు ప్రబలవైభవములతో నొప్పుచుందురు. కొఱ్ఱలు, రాగు లనఁగా చోళ్లు, మినుములు, సంపూర్ణముగా పండును. భూమియందు వానలు తక్కువగా కురియును. విభవ సంవత్సరమునందు వర్షములు కొలఁదిగానే కురియును. వెలిపయిరులు ఫలించును. పశువులు లెస్సగా పాలిచ్చును. ప్రతియింటను శుభకార్యములు హెచ్చగును. ఆసమయములయందు జనులు లెస్సగా వేడుకలు చేయుదురు. శుక్లసంవత్సరమునందు భూమియందలి ప్రజలు శుభములు, సంతోషములు గలిగి సుఖముగా వర్ధిల్లుచుందురు. వానలు సమృద్ధిగా కురియును. ప్రజలకు కావలసినకంటెను హెచ్చుగానే శుభములు గలుగును—అని శెట్టిఁ డన్నాఁడు. ౨౦

క. వరి చెఱకు కందమూలము,
లరుదుగ ఫలియించుఁ బ్రజకు హర్షం బొదవుం
దొరలకుఁ బ్రమోదసంవ,
త్సరమున వేంకటనృపాల! ధర్మవిశాలా! ౨౧

తా. ధర్మాత్ముఁడ వయిన యోవేంకటరాజా! ప్రమోదసంవత్సరమునందు వరిపంటయు, చెఱకుతోఁటలు, కందమూలములు—ఇవియాశ్చర్యకరముగా ఫలించును. ప్రజలకును, రాజులకును సంతోషము గలుగును.

తే. గీ. వసుధ వినుము ప్రజాపతివత్సరమునఁ,
బదునుమాత్రము వానలు ప్రజకు ముదము
సన్నధాన్యము ఫలియించు జనన మొందుఁ,
బశుమృగాదులు వేంకటపార్థివేంద్ర! ౨౨

తా. వేంకటరాజేంద్రా! ఇంకను వినుము. ప్రజాపతి సంవత్సరమునందు భూమి యెప్పుడును పదును గలిగి యుండునట్టుగా వానలు కురియును. ప్రజలకు సంతోషము కలుగును. సన్నని ధాన్యములు ఫలించును. పశువులు మృగములు విస్తారముగా పుట్టును—వృద్ధిపొందును. ౨౨

సీ. ఆంగిరసాబ్దంబునందు ధాన్యము లెల్ల
ఫలియించు శ్రీముఖాబ్దంబునందుఁ
బైరు వానయుఁ దగుపాటి ధాన్యము గొని
దాఁచఁగావలెఁ బ్రీతి దఱచు ప్రజకు
భావాబ్దమున ధరాభవుఁ డుదయించిన
ధూమకేతువు పుట్టుఁ దొలఁగు వాన
భయపడు చుండ్రు భూప్రజ లెల్ల మఱి యువ
యువవర్షమున రాజనివహమునకు
తే. గీ. వచ్చు నుబ్బసపుఁ దెవుళ్లు వసుధయందుఁ,
గురియుఁ గొంచెము వాన భీకరము లైన
యగ్నిబాధలు వాటిల్లు నద్భుతముగ,
ననియె రెట్టసుకవి వేంకటావనీశ! ౨౩

తా. వేంకటరాజా! అంగిరససంవత్సరమునందు, సమస్తమయిన ధాన్యములును చక్కఁగా ఫలించును. శ్రీముఖసంవత్సరమునందు వానలు తగుమాత్రమే కురియును. పంటలును తక్కువగానే పండును. కావున ధాన్యము సకాలమున కొని నిలువ యుంచుకొనవలెను. ప్రజల కన్యోన్యము ప్రీతి హెచ్చుగా నుండును. భావసంవత్సరమున భూమికొడు కయిన యంగారకుఁ డుదయించెనేని తోఁకచుక్క పుట్టును. వానలు కురియవు. అందుచేఁ గఱవు వచ్చునేమో యని ప్రజలు భయపడుచుందురు. యువసంవత్సరమునందు రాజులకు ఉబ్బసపురోగము కలుగును. భూమియందు కొంచెము

గానే వాన కురియును. ఆశ్చర్యకరముగా భయంకరము లయిన యగ్ని
బాధలు సంభవించును—అని శెట్టికవీశ్వరుఁ డన్నాఁడు. ౨౩

క. అల ధాతృవత్సరంబునఁ,
గలుగు మనోభయము ప్రజకు ఘనవర్షంబుల్
గురియును బంటలు నధికము,
వెలయును ధాన్యంబు మిగుల వేంకటనృపతీ! ౨౪

తా. వేంకటరాజా! ధాతృసంవత్సరమునందు ప్రజలమనస్సులకు భయములు కలుగును. వర్షములు హెచ్చుగా కురియును. పంటలు సమృద్ధిగా పండును. ధాన్యములు సమృద్ధిగా లభించును. ౨౪

సీ. వసుధపై నీశ్వరవత్సరంబునఁ బ్రజల్
ధనికు లౌదురు సస్యతతి ఫలించు
ధాన్యంబు లొకయింత దఱుఁగును బహుధాన్య
వత్సరంబునఁ బంట స్వల్ప మరయఁ
గొంచె మా వర్షంబు కొలుచు దాఁచఁగవలెఁ
బ్రజ నొచ్చు రాజకార్యములచేత
వరుసఁ బ్రమాదిసంవత్సరంబున సన్న
ధాన్యముల్ మఱియు ముద్గము లాది
తే. గీ. యిలను ఫలియించు నొక్కొక్కయెడను జొన్న,
పంటచేఁ జాల శోభిల్లుఁ బ్రత్తి యుప్పు
గొనిన మీఁదఁట లాభంబు గూడు నిజము,
వినుము కొండ్రాజుతిమ్మయ వేంకటేంద్ర! ౨౫

తా. కొండరాజుతిమ్మరాజుగారి వేంకటరాజా! ఇంకను చెప్పెదము వినుము. భూమియం దీశ్వరసంవత్సరమునందు జనులు ధనవంతు లగుదురు. సస్యములు సమృద్ధిగా పండును. కాని ధాన్యము మాత్రము కొంచెము తఱిఁగియుండును. బహుధాన్య సంవత్సరమునందు, ఆలోచింపఁగా పంటలు

కొంచెముగా పండును. వానలును కొంచెముగానే కురియును. ధాన్యము కొని నిలువ చేసికొనవలయును. రాజకార్యములచేతను ప్రజల కిబ్బంది గలుగును. ప్రమాదిసంవత్సరమునందు సన్నధాన్యములు, పెసలు మొదలగునవి ఫలించును. కొన్నిచోట్ల జొన్నలు విశేషముగా పండును. ఆసంవత్సరమున ప్రత్తి, ఉప్పు కొని నిలువ యుంచుకొన్న ట్టయితే కొన్నాళ్లకు లాభము గలుగును. ఇది నిజము. ౨౫

క. ఇలపయి లెస్సగఁ బయిరులు,
ఫలియించినయట్ల యుండుఁ బంటలు స్వల్పం
బులు విక్రమాబ్దమునఁ గొన,
వలె ధాన్యము వేంకటేంద్ర! వైభవసాంద్రా! ౨౬

తా. వైభవముతో నిండారియున్న వేంకటరాజా! విక్రమసంవత్సరమునందు భూమిపైని సస్యములు ఫలించునట్లే యగపడునుగాని స్వల్పముగానే పండును. కాఁబట్టి, ఆసంవత్సరమున ధాన్యము కొని నిలువ యుంచుకోవలెను. ౨౬

తే. గీ. కలహములు చోరబాధలు గల్గి భూమి,
యందు నెఱయఁగ భాగత్రయంబు పంట
లేక యొకపాలుమాత్ర ఫలించు నిజము,
విషు వనెడువత్సరమునందు వేంకటేంద్ర! ౨౭

తా. వేంకటరాజా! విషు లేక వృషసంవత్సరమునందు కలహములు, దొంగలభయము కలిగి భూభాగమునందు మూఁడుపాళ్లు పంటలు లేక ఒక్కపాలుమాత్రమే పండును. ఇది నిజము. ౨౭

క. ధరఁ జిత్రభానుసంవ,
త్సరమునఁ బయిరులు ఫలించు దవస మధిక మా
సిరు లొదవును గర్ణాటక,
నరవరులకు వేంకటేంద్ర! నయనిస్తంద్రా! ౨౮

తా. రాజనీతియందు జాగరూకుఁడవయిన యోవేంకటరాజా ! భూమిపైన చిత్రభానుసంవత్సరమునందు సస్యములు చక్కఁగా ఫలించును. ధాన్యము హెచ్చుగా లభించును. కర్ణాటదేశపురాజులకు సంపదలు వృద్ధి యవును. ౨౮

సీ. జగతి స్వభానువర్షమునఁ బైర్లు ఫలించుఁ
బ్రాణుల కెల్ల శుభంబు లొదవు
నగ్నిభీతి ఘటిల్లు నట తారణాబ్దంబు
నందుఁ బంటలు గల్గు నగ్గు వౌను
గోలుచు నొత్తురు పతుల్ గోగణంబులు పిండుఁ
బార్థివాబ్దంబునఁ బ్రబలు వాన
పంట లగ్నిభయంబు ప్రభువుల కాపదల్
గలవు ప్రజల్ ధర్మముల మనుదురు
తే. గీ. పరఁగ వ్యయవత్సరంబునఁ బంట పండి,
కొల్లవోవును గఱవు గల్గును జ్వరములు,
నేల తిరిగినయ ట్లుండు నెగడు భయము,
లనిరి రెట్టసుకవి వేంకటాధినాథ ! ౨౯

తా. వేంకటరాజా ! లోకమున స్వభాను సంవత్సరమునందు సస్యములు సమృద్ధిగా ఫలించును. ఎల్లప్రాణులకును శుభములు గలుగును. అగ్నిబాధలు కలుగును. తారణసంవత్సరమునందు, పంటలు పండును. ధాన్యము చవుక యగును. రాజులు బాధపడుదురు. ఆవులు సమృద్ధిగా పాలిచ్చును. పార్థివసంవత్సరమునందు వానలు హెచ్చుగా కురియును. పంటలు సమృద్ధిగా పండును. అగ్నిబాధలు కలుగును. రాజుల కాపదలు ప్రాపించును. ప్రజలు ధర్మమార్గప్రవృత్తులై వృద్ధి నొందుదురు. వ్యయసంవత్సరమునందు, పంటలు పండునుగాని అవి కొల్లపోవును. కఱవు సంభవించును. జ్వరములబాధ

ప్రజల కెక్కువ యగును. భూమి తిరిగిన ట్లగపడుచుండును. విశేషముగ ప్రజలకు భయములు కలుగును—అని రెట్టఁ డనుకవీశ్వరుఁ డన్నాఁడు. ౨౯

సీ. క్షితితలంబున సర్వజిద్వత్సరంబున
సకలధాన్యములు లెస్సగ ఫలించు
ఘనరోగములచేత గ్రామముల్ పాడగుఁ
దగ సర్వధారివత్సరమునందుఁ
గలవు వానలు పంట లిల దొరల్ నొత్తురు
వరుస విరోధివత్సరమునందు
వెలిపైరు చెడును సొం పలరు సజ్జనులకు
దుర్జనులకు హాని దొడరు వికృతి
తే. గీ. వత్సరంబునఁ బంటయు వృష్టి కొలఁది,
హర్ష మందు జనంబు ఖరాబ్దమునను
బంటయును వాన తగుపాటి ప్రజలు భీతి,
వికలమతు లౌదు రనె రెట్టసుకవివరుఁడు. 30

తా. వేంకటరాజా! భూతలమునందు సర్వజిత్సంవత్సరమున సమస్త మయిన ధాన్యపుదినుసులును లెస్సగా పండును. గొప్పరోగములచేతను గ్రామములు పాడయిపోవును. సర్వధారిసంవత్సరమునందు వానలు కురియును. పంటలు పండును. రాజులు బాధలపా లగుదురు. విరోధిసంవత్సరమునందు వెలిపయిరులు చెడిపోవును. సజ్జనులు సొంపుగా నుందురు. దుర్మార్గులకు కీడు కలుగును. వికృతిసంవత్సరమునందు వానలును, పంటలును తక్కువగానే యుండును. జనులు సంతోషముతో నుందురు. ఖరసంవత్సరమునందు తగుమాత్రముగా వానలు గురియును. పంటలును తగుమాత్రముగానే పండును. ప్రజలు భయముచేతను మతి చెడినవా రగుదురు—అని రెట్టకవి యన్నాఁడు. 30

క. నందనసంవత్సరమునఁ,
బొందుగ వర్షములు గురియుఁ బొసఁగును బంటల్
డెందమునఁ బ్రజలు సంతస,
మందుదు రెప్పొద్దు వేంకటాధిపతిలకా! ౩౧

తా. వేంకటరాజా! నందనసంవత్సరమునందు సమృద్ధిగా వానలు కురియును. పంటలు లెస్సగా పండును. సదా పశువులు సంతోషించుచుండును. ౩౧

క. మినుములు గోదుమ జొన్నలు,
ననుములు మఱి సన్న ధాన్య మలరును వానల్
పెనుపొందఁ బ్రజకు ముద మగు,
విను విజయాబ్దమ్మునందు వేంకటనృపతీ! ౩౨

తా. వేంకటరాజా! విజయసంవత్సరమునందు, మినుములు, గోదుమలు, జొన్నలు, అనుములు, సన్నధాన్యములు పండును. వానలు సమృద్ధిగా కురియును. ప్రజల కానంద మధిక మగును. ౩౨

తే. గీ. జయను స్త్రీలును బురుషులు సతతసుఖము,
ప్రమద మెసఁగఁగ నుందురు పంట గలదు
నృపులు కడు సుప్రసన్ను లై యెనసి యుంద్రు,
వెలయు దారణలును దిమ్మ వేంకటేంద్ర! ౩౩

తా. తిమ్మరాజుగారి వేంకటరాజా! జయసంవత్సరమునందు, స్త్రీలును, పురుషులును ఎల్లప్పుడును సంతోషము, ఆనందము హెచ్చుగలుగనుందురు. పంటలు బాగుగా పండును. రాజులు మిక్కిలి ప్రసన్నచిత్తులయి ప్రవర్తింతురు. ధరలు బాగుగానే యుండును. ౩౩

క. అల మన్మథవత్సరమున,
నెలకొనుఁ బ్రజలకును ముదము నీరారంభం

బులును వెలిపైరు లెస్సగ,
ఫలియించును వేంకటాద్రిపార్థివతిలకా! 34

తా. వేంకటరాజా! మన్మథసంవత్సరమునందు ప్రజలకు సంతోషము కలుగును. నీటివలన పండుపంటలును, వెలిపయిరులును లెస్సగా ఫలించును. 34

తే. గీ. అనుపమంబుగ దుర్ముఖియందు వాన,
కలుగు వెలిపైరు లోకపాటిగా ఫలించు
నర్మదాతటి నుండుమానవులు భంగ,
మందుదురు చాల ననె రెట్టఁ డందముగను. 35

తా. వేంకటరాజా! దుర్ముఖిసంవత్సరమునందు వానలు బాగుగా కురియును. వెలిపయిరు లోకమాదిరిగా ఫలియించును. నర్మదానదీతీరముల యందుండు ప్రజలుమాత్రము హెచ్చుగా భంగపాటును పొందెద రని రెట్టఁడన్నాఁడు. 35

సీ. ధర హేవళంబివత్సరమున సర్వవి
హీను లౌదురు జను లేపు దొలఁగి
వేధ గల్గును సస్యవితతి కెంతయుఁ జాలఁ
బశువులు మృగములు ప్రజయు నొచ్చు
వరుస విళంబిసంవత్సరమున రాజ
బాధలు దగుపాటి వాన గురియు
నవనీశ్వరులు మలినాకృతుల్ దాల్తురు
పరదేశముల కేఁగుఁ బ్రజయు మఱియుఁ

తే. గీ. దథ్యముగను వికారివత్సరమునందు,
బంట వానలు చెడి చాలఁ బ్రజయు నొచ్చుఁ

వలయుధాన్యము దాఁచఁగావలె నరిష్ట,
మనియె రెట్టసుకవి వేంకటావనీశ! ౩౬

తా. వేంకటరాజా! హేవళంబిసంవత్సరమున జనులు సర్వశూన్యులగుదురు. సంతోషము లేకయుందురు. సస్యములకు హెచ్చుగా వేధలు గలుగును. పశువులు, మృగములు, జనులు కూడ బాధలపా లగుదురు. విళంబిసంవత్సరమునందు రాజులవలన ప్రజలకు బాధలు గలుగును. వానలు కొంచెముగా కురియును. రాజులు మలినములయినయాకారములు గలవారయి యుందురు. జనులు తిండికి లేక పరదేశములకు వలసపోవుదురు. వికారిసంవత్సరమునందు, వానలు కురియవు. పంటలు పండవు. ప్రజలు చాల బాధలపా లగుదురు. కాలమందు ధాన్యాదులు కొని యుంచుకొనవలయును. మొత్తముమీఁద వికారిసంవత్సరమునం దరిష్టమే కాని మంచి లే దని రెట్టఁ డన్నాఁడు. ౩౬

తే. గీ. వరుస నెన్నంగ శార్వరివత్సరమున,
గ్రహణములు రెండు వచ్చు నాగ్రహము లొదవు
నధిక మవు వాన జలముసస్యంబు చెడును,
జనులు చెడిపోదు రనె రెట్టఘనుఁడు దేవ! ౩౭

తా. వేంకటరాజా! శార్వరిసంవత్సరమున రెండుగ్రహణములు సంభవించును. కావున, ప్రజల కాగ్రహము లధికమవును. వానలు హెచ్చును. నీట పంటలు చెడును, జనులు కష్టములపా లగుదురు—అని రెట్టఁడన్నాఁడు.

సీ. ప్లవవత్సరంబునఁ బరిపాటి వానయు
వెలిపైరు కొంచెము నృపతు లెల్లఁ
గుపితులు నగుదురు గొనకొని చోరభ
యంబు భూజనులకు నధిక మగును
చన శుభకృన్నామసంవత్సరంబున

వానలు గురియు నవ్వారి గాఁగ
సకలసస్యంబులు చాలంగ ఫలియించుఁ
బ్రజలకు భయ మగు బ్రాహ్మణులును
సద్ధర్మకర్ములై చాల వర్తింతురు
వల నొప్ప శోభకృద్వత్సరముల
తే. గీ. వసుధఁ గ్రోధి విశ్వావసువత్సరమున,
నల పరాభవ వత్సరంబందు సస్య
ధాన్య ధన వృష్టి నిజజాతి ధర్మకుశల,
విభవములు గల్గుఁ బ్రజలకు వేంకటేంద్ర! ౩౮

తా. వేంకటరాజా! ప్లవసంవత్సరమునందు వానలు తగుమాత్రముగా కురియును. వెలిపయిరులు కొంచెముగా పండును. రాజు లందఱును కోపము గలవారై యుందురు. భూమియందలి జనులకు దొంగలవలన బాధలు కలుగును. శుభకృత్సంవత్సరమునందును, శోభకృత్తు సంవత్సరమునందును సాటిలేని వానలు హెచ్చుగా కురియును. ఎల్లసస్యములు సమృద్ధిగా పండును. ప్రజలకు భయములు గలుగును. బ్రాహ్మణులు మంచి కర్మములను చేయుటయందు హెచ్చుగా నుత్సాహపడుచుందురు. క్రోధి సంవత్సరమునందును, విశ్వావసు సంవత్సరమునందును, పరాభవ సంవత్సరమునందును, సస్యములు, ధాన్యము, ధనము, వర్షము, వారివారి జాతిధర్మములు, క్షేమమును, వైభవములును, ప్రజలకు సస్మృద్ధిగా కలిగియుండును. ౩౮

చ. వసుధఁ బ్లవంగవర్షమున వానలు పంటలు లేవు హెచ్చును
బ్బసపుఁ దెవుళ్లుహృద్వ్యథలుప్రత్యహముఁ జగడంబునిం డ్లెలుఁ
మసలక క్షామదుర్దశలు మానుగఁ గల్గు ననేఁ నిజంబుగా
రసికుఁడు రెడ్డి ధన్యుఁడు తిరంబుగ వేంకటమేదినీశ్వరా!

తా. వేంకటరాజా! భూమియందు ప్లవంగసంవత్సరమున, వానలు కురియవు. పంటలు పండవు. ఉబ్బసపు రోగము లధిక మవును. మనుజులకు మనోవ్యాధులు కలుగుచుండును. ప్రతిదినమునను జగడములు కలుగుచుండును, ప్రజలన్యోన్యము నిందించుకొనుచుందురు. కఱవులును, దుర్దశలును కలుగును—అని—రసజ్ఞుఁ డయినరెట్టఁ డనుధన్యాత్ముఁ డన్నాఁడు.

తే. గీ. కీలకాబ్దంబునను మిట్టనేలలందు,
నిడినపైరులు ఫలియించు హెచ్చు వాన
జడిని జెడిపోవు నితరసస్యములు కఱవు,
పుట్టు నిశ్చయముగ ననె రెట్టఘనుఁడు. ౮౦

తా. వేంకటరాజా! కీలకసంవత్సరమునందు మెరకభూములయందు వేసిన పయిరులు ఫలించును. వానలు హెచ్చుగా కురియును. కడమసస్యములు వర్షాధిక్యముచేతను చెడిపోవును. అయాకారణములచేతను తప్పక కఱవు తటస్థించు నని రెట్టఁ డను గొప్పపండితుఁ డన్నాఁడు. ౮౦

క. మానుగ సౌమ్యాబ్దంబున,
వానలు పంటయును ధరయు వరుసగ మధ్యం
బౌ నరపతులకు ముద మగు,
హాని యగుఁ బ్రజకుఁ బసుల కనె రెట్టఁ డిలన్. ౮౧

తా. వేంకటరాజా! సౌమ్యసంవత్సరమునందు, వానలు తక్కువగా కురియును. పంటలు కొలఁదిగా పండును. ధరలు మధ్యమరీతిగా నుండును. రాజుల కానందము గలుగును. ప్రజలకును, పశువులకును, కీడు మూఁడు నని రెట్టఁ డనెను. ౮౧

తే. గీ. అరయ సాధారణాబ్దంబునందు వాన,
లనుము జొన్నలు మఱి కంది మినుము పెసలు
ఫలిత మగు బాధ వాటిల్లుఁ బ్రజయు నొచ్చు,
నిలుచు నొకపా లనిరెు రెట్టఁ డలఘుమతిని. ౮౨

తా. వేంకటరాజా! ఆలోచింపఁగా, సాధారణసంవత్సరమునందు వానలు గురియును. అనుములు, జొన్నలు, కందులు, మినుములు, పెసలు సమృద్ధిగా పండును. బాధలు కలుగును. ప్రజలు నొత్తురు. మూఁడు వంతుల ప్రజలు నశించి యొకవంతు మాత్రమే నిలిచియుందు రని గొప్ప బుద్ధితో రెట్టఁ డన్నాఁడు. ౪౨

క. అరయఁగ విరోధికృద్వ,
త్సరమున జగడములు గలుగు జనులకుఁ దమలో
దొరలు కలహింతు రెందును,
గురియును వృష్టి యనె రెట్టకోవిదుఁ డధిపా! ౪౩

తా. వేంకటరాజా! ఆలోచింపఁగా, విరోధికృత్సంవత్సరమునందు మనుజులు తమలోఁ దాము కలహించుకొనుచుందురు. ఎల్లరాజులకును కలహములు గలుగును. వర్షములు బాగుగాఁ గురియును—అని రెట్టపండితుఁ డన్నాఁడు. ౪౩

ఆ. వె. ప్రత్తి నువ్వు లుప్పు ఫలియించుఁ దక్కిన,
పైరు చెడును గుజనబాధచేత
నలఁగు మధ్యదేశములు పరీధావివ,
ర్షమున ననియె రెట్టఁ డమలమతిని. ౪౪

తా. వేంకటరాజా! పరీధావిసంవత్సరమునందు, ప్రత్తి, నువ్వులు, ఉప్పు—ఇవి చక్కఁగా ఫలించును. తక్కిన సస్యములు చెడిపోవును. దుర్మార్గులవలని బాధలచేతను మధ్యదేశములు పాడయిపోవును—అని నిర్మలమయిన బుద్ధితో రెట్టఁ డన్నాఁడు. ౪౪

సీ. చాలఁ బ్రమాదీచసంవత్సరమున నీ
రారంభమైన సస్యము ఫలించు
చెడును ధాన్యంబులు చెలువొంద వానంద
సంవత్సరంబున సకల ధాన్య

తతులును ఫలియించు దారణ లగ్గు వొఁ,
ప్రజలు సంతసమునఁ బ్రబలి యుండ్రు
రాక్షససంవత్సరంబున ధాన్యముల్
తఱుఁగును రోగభాధలును గలిగి

తే. గీ. నోగిలియుండుదు రందంద మిగులఁ జెలఁగి,
ధేనువులు పిండు మఱి కడవాన గురియుఁ
బంట లోకపాటి గలవు భూభాగమునను,
వినుము కొండ్రాజుతిమ్మయ వేంకటేంద్ర! ౯౫

తా. తిమ్మరాజుగారి వేంకటరాజా! ఇంకను వినుము. ప్రమాదీచ సంవత్సరమున నీటియాధారమున పండుసస్యము లధికముగా ఫలించును. కడమ ధాన్యములుమాత్రము చెడిపోవును. ఆనందసంవత్సరమునందు, ఎల్ల రకములయిన ధాన్యములును సమృద్ధిగా పండును. వెలలు సరసముగా నుండును. ప్రజలు సంతోషము గలవారై ప్రబలియుందురు. రాక్షససంవత్సరమున ధాన్యపుఁబంట తగ్గిపోవును. అచ్చటచ్చట ప్రజలు రోగములవలన బాధలఁ బడుచుందురు. ఆవులు సమృద్ధిగా పాలిచ్చును. కడపటివానలు కురియును. భూమియం దోకమాదిరిగా పంటలు పండును. ౯౫

క. నలవర్షంబున నృపబా,
ధలచేతను గాఁపులకు వెతలు గల వెపుడున్
గలవారియిండ్ల ధాన్యం,
బులఁ దస్కరు లపహరింత్రు భూపవరేణ్యా! ౯౬

తా. వేంకటరాజా! నలసంవత్సరమున రాజులవలని బాధలచేతను కాఁపులకు కష్టములు గలుగును. ధనవంతులయిండ్ల నున్న ధాన్యములను దొంగలు కొనిపోవుదు రని శెట్టిఁ దన్నాఁడు. ౯౬

క. వరుసఁ బింగళసంవ,
త్సరమున వర్షములు గలవు జనులు ముదముతోఁ
బరఁగుదురు సస్యవితతులు,
విరివిగ ఫలియించు నండ్రు వేంకటనృపతీ! ౮౭

తా. వేంకటరాజా ! వరుసగా పింగళసంవత్సరమునందు, వర్షములు సమృద్ధిగా కురియును. జనులు సంతోషముగలవారై యొప్పుచుందురు. సస్యములు సమృద్ధిగా పండు నని పెద్ద లందురు. ౮౭

తే. గీ. కాళయుక్తివత్సరమునఁ గలుగ వరయ,
మునుపువానలు కొంచెంబు వెనుకవృష్టి
పైరులకు నీతిబాధ కొకపాటి వెలయు,
వినుము కొండ్రాజుతిమ్మయ వేంకటేంద్ర! ౮౮

తా. కొండ్రాజుతిమ్మరాజుగారి వేంకటరాజా ! ఇంకను వినుము. కాళయుక్తి సంవత్సరమునందు, మొదటివానలు కురియవు. వెనుకటివానలు కురియును. సస్యములకు ఈతిబాధలు సామాన్యముగా కలుగును. ౮౮

తే. గీ. రాజులకుఁ బోరు లౌదవు వర్షంబు గురియుఁ,
గ్రూరజనులచేఁ బంటలు గొల్లవోవు
వచ్చు క్షామంబు సిద్ధార్థివత్సరమున,
ననియె రెట్టసుకవి వేంకటావనీశ! ౮౯

తా. వేంకటరాజా ! సిద్ధార్థిసంవత్సరమున, రాజులకు యుద్ధములు సంభవించును. వర్షములు కురియును. పంటలు పండును గాని యవి దుర్మార్గులగు జనులచేతను కొల్లకొట్టఁబడిపోవును. కఱవు సంభవించును—అని రెట్టనకవీశ్వరుఁ డన్నాఁడు. ౮౯

తే. గీ. రౌద్రిసంవత్సరమున వర్షంబు వచ్చు,
నట్ల యుండియు రాదు సస్యములు పండు

నట్ల యగపడి ఫలియింప వనియెం దుదకు,
రెట్టధీరుండు వేంకటనృపవరేణ్య! ౫౦

తా. వేంకటరాజా! రౌద్రిసంవత్సరమునందు వానలు కురియునట్లగపడు నంతేకాని కురియవు—సస్యములు పండునట్లే యగపడుచుండును గాని తుదకు పండవు—అని రెట్టపండితుఁ డన్నాఁడు. ౫౦

చ. కురియును వర్షముల్ మిగులఁగొఱ్ఱలు రాగులు సజ్జలాదిగాఁ
బరఁగిన సన్న ధాన్యము లపారముగాఁదగు కందు లన్ములున్
ధర నెఱయన్ ఫలించు మఱి తక్కిన సస్యఫలంబు లల్పమౌ
స్థిరయశ! వేంకటేంద్ర! యిది తెల్లము దుర్మతివత్సరంబునన్.

తా. స్థిరమయినకీర్తిగల యోవేంకటరాజా! దుర్మతిసంవత్సరమునందు మిక్కిలిగా వానలు కురియును. కొఱ్ఱలు, సజ్జలు (గంటెలు) మొదలయినసన్నధాన్యములును, కందులు, అనుములును సమృద్ధిగా పండును. అంతకంటె నితరములయిన సస్యములు తక్కువగా పండును. ఇపుడు చెప్పినదంతయు నిశ్చయము. ౫౧

క. ఇల దుందుభివర్షమునన్,
ఫలియించును బయిరు ధరలు బహుళ మగుఁ బ్రజా
వళి ఖగమృగతతులును మఱి,
పిలుస్సిల్లును సంతసమున వేంకటనృపతీ! ౫౨

తా. వేంకటరాజా! భూమియందు దుందుభిసంవత్సరమున పంటలు బాగుగా పండును గాని ధర లధికముగా నుండును. మనుజులకును, పక్షులకు, పశువులకును మిగుల సంతోషము కలుగును. ౫౨

తే. గీ. వరుసతో రుధిరోద్గారివత్సరమున,
దొరలు నొత్తురు ప్రజలకుఁ దొడరు మిగుల

భయము దుఃఖంబు మెఱయు నుపద్రవంబు,
లనియె రెట్టసుకవి వేంకటావనీశ ! ౫౩

తా. వేంకటరాజా ! వరుసగా రుధిరోద్గారిసంవత్సరమున రాజులకు చావులు గలుగును. ప్రజలకు మిక్కిలి భయములు దుఃఖములు కలుగును. మఱియును ఉపద్రవములు తటస్థించును—అని రెట్టకవి యనెను. ౫౩

మ. అమితక్షామమునన్ ధరాప్రజలు కార్శ్యంబొంది యాత్మీయదే
శములన్ బాయుదు రెండుయుద్ధములచే జాలంగ రక్తప్రవా
హములుం బాఱుముదంబు భూతముల కత్యంతంబు రక్తాక్షివ
ర్షమునన్నిక్కముగానన్ బుధులు మెచ్చన్ రెట్టఁడుర్వీశ్వరా!

తా. వేంకటరాజా ! రక్తాక్షిసంవత్సరమున, గొప్పదియగు కఱవు సంభవించుటవలన భూమియందలి ప్రజలు తిండిలేక కృశించిపోయి తమ యున్న దేశములు విడిచి వేఱుచోట్లకుఁ బోవుదురు. సర్వత్ర యుద్ధములు గలుగును. అందువలన రక్తనదులు ప్రవహించును. దానంజేసి భూతములకు మిగుల సంతోషము గలుగును—ఇది నిజమే యని పండితులు మెచ్చునట్టుగా రెట్టఁ డన్నాఁడు. ౫౪

క. ధరఁ గ్రోధనవర్షమ్మునఁ,
దనరఁగ వర్షంబు పంట దారణ గలుగున్
ధరణీసురులు నిజనిష్ఠా,
పరు లగుదురు వేంకటాద్రిపార్థివతిలకా! ౫౫

తా. వేంకటరాజా ! భూమియందు క్రోధనసంవత్సరమున ఒప్పునట్లు వానలు కురియును, పంటలు పండును. వెలలు కలిగియుండును. బ్రాహ్మణులు తమనిష్ఠలయం దాసక్తి గలవా రగుదురు. ౫౫

క. క్షయవర్షంబున భూవర,
చయములకున్ బశువులకును జనులకు నొదవున్

భయములు ధాన్యంబును ని,
శ్చయముగఁ దఱుఁగు ననె రెట్టసత్కవి యధిపా! ౫౬

తా. వేంకటరాజా! క్షయసంవత్సరమునందు రాజులకును, పశువులకును, ఇతరులగు మనుష్యులకును ఉపద్రవములు కలుగును. ధాన్యము నిజముగా తఱిఁగిపోవును—అని రెట్టకవీశ్వరుఁ డన్నాఁడు. ౫౬

## సంవత్సరాధిపతిఫలము.

తే. గీ. చైత్రకంబున శుక్లపక్షంబు మొదల,
వార మెయ్యది వచ్చు నవ్వారమునకు
నధిపుఁ డైనట్టిగ్రహమె యబ్దాధినాథుఁ,
డగును నిశ్చయ మిది వేంకటావనీశ! ౫౭

తా. వేంకటరాజా! ఇంక సంవత్సరాధిపతుల ఫలమును చెప్పెదము వినుము. చైత్రశుద్ధప్రతిపత్తిథి (పాడ్యమి) నాఁడేవార మగునో ఆవారమున కధిపతి యయినగ్రహమే ఆసంవత్సరమునకు రా జగును. ఇదితప్పదు.

చ. అరుణగభస్తి వర్షపతి యైనను నొత్తురు ధారుణీపతుల్
గురియును వాన కొంచెముగఁ గొండఱుకంటకవృత్తిమాయలం
బొరలుచునుండఁ గాఁపుప్రజవోవును నిల్వక త్రోవ లెల్ల దు
స్తరములగుః విపద్దశలు దప్పవనెన్నవి రెట్టఁడిమ్మహిన్. ౫౮

తా. వేంకటరాజా! సూర్యుఁడు సంవత్సరాధిపతి యైనయెడల రాజులకు మంచిది గాదు. వర్షములు తక్కువగా కురియును. కొందఱు దుర్మార్గ ప్రవర్తనులై మాయలుచేయువారై సంచరింతురు. అందువలన కాఁపుజనము తమస్థానములను విడిచిపెట్టి మఱియొకదెసకు పోవుదురు. దారు లన్నియును నడవ శక్యముగా నుండవు. ప్రజల కాపదలు తప్పవు—అని రెట్టకవి యన్నాఁడు. ౫౮

చ. అమృతమయూఖుఁ డబ్దపతి యైనను గోద్విజరాజికిన్ బ్రమో
దము లగు వేడ్క హెచ్చు నతిధార్మికులౌదురు రాజు లెల్లవ
ర్షము గురియుం జెడు న్మనుజసంఘము జొన్నలు రాజనంబు గో
దుమ చెఱుకుల్ ఫలించు భువి ద్రోహము పుట్టదు వేంకటాధిపా!

తా. వేంకటరాజా! చంద్రుఁడు సంవత్సరాధిపతి యైనయెడల గోవులకును, బ్రాహ్మణులకును సంతోషము కలుగును. వేడుకలు హెచ్చు గును. రాజు లందఱును మిగుల ధర్మాత్ము లగుదురు. వానలు సమృద్ధిగా కురియును. మనుజులు చెడిపోవుదురు. జొన్నలు, రాజనాలు, గోదుమలు, చెఱుకుతోఁటలు చక్కఁగా ఫలించును. భూమియందు ద్రోహము పుట్టదు.

మ. అలరంగాఁ గుజుఁ డబ్దనాథుఁ డగుచున్ హర్షంబునం బొందు నా
వులు వర్షంబులు లేవు దారణలు వోవున్ వేగఁ బల్వ్యాధులా
ధులు గల్గున్ బెనుగాలి వీచు నని సాధుల్మెచ్చఁ దామ్రాక్షస
త్కులపాథోధివిధుండు రెట్టఁడు సమర్థుం డై విజృంభింపుచున్.

తా. వేంకటరాజా! ఒప్పునట్టులుఁ, అంగారకుఁడు సంవత్సరమునకు రాజయినచో, ఆవులకు సంతోషము గలుగును. వాన లంతగా కురియవు. ధరలు తగ్గిపోవును. జనులకు పలువిధములయిన రోగములును, మనోవ్యాధులును కలుగును. గొప్పగా గాలి వీచును—అని మంచివారు మెచ్చుచున్న తామ్రాక్షసత్కులసముద్రమునకు చంద్రునివంటివాఁడయిన రెట్టన్న పండితుఁడు సమర్థుఁ డగుచు విజృంభించుచు నన్నాఁడు. ౬౦

మ. బుధుఁ డబ్దాధిపుఁ డైన వానగురియున్ భూమండలిన్ రక్తధా
న్యధనశ్రీలు ఘటిల్లు రాజులు ప్రజన్మన్నింతు రెండున్ సమ
స్తధరామర్త్యులకున్ శుభం బొదవుఁ గాంతాశ్రేణిపైఁ గూర్మియ
త్యధికంబౌ యువకోటికి న్వినుము ధన్యా! వేంకటక్ష్మాధిపా!

తా. ధన్యాత్ముఁడవయిన యో వేంకటరాజా! వినుము. బుధుఁడు సంవత్సరమునకు రాజయినపక్షమున వానలు కురియును. భూమియందు కందులు మొదలయిన రక్తధాన్యములు ఫలించును. ధనసమృద్ధి గలుగును. ప్రజల కైశ్వర్యములు గలుగును. ప్రతిచోటను రాజులు ప్రజలను గౌరవింతురు. బ్రాహ్మణు లందఱకును శుభములు కలుగును. పడుచువారికి స్త్రీలయందు ప్రేమ యధిక మగును. ౬౧

తే. గీ. గురుఁడు వర్షాధిపతి యైనఁ గురియు వాన,
పంటలు శుభంబు లౌదవును బ్రాహ్మణులకు
రాజులకు క్షేమ మెసఁగు దుర్జనుల కొప్ప,
దనియె నిశ్చయ మిది వేంకటాద్రిభూప! ౬౨

తా. వేంకటరాజా! గురుఁడు సంవత్సరాధిపతి యైనయెడల వానలు సమృద్ధిగా కురియును. పంటలు లెస్సగా పండును. బ్రాహ్మణులకు శుభములు కలుగును. రాజులకును క్షేమము గలుగును. దుర్మార్గులకుమాత్రము మంచిది గాదు—ఇది నిశ్చయము—అని చెట్టెఁ డన్నాఁడు. ౬౨

క. దనుజగురుఁ డబ్దపతి యై,
నను మొదవులు పితుకు నృపులు నడతురు భీతిన్
జనులు సుఖస్థితిఁ గాంతురు,
విను పంటలు కలవు ధరను వేంకటనృపతీ! ౬౩

తా. వేంకటరాజా! ఇంకను వినుము. రాక్షసులకు గురువయిన శుక్రుఁడు సంవత్సరాధిపతి యగునేని ఆవులు సమృద్ధిగా పాలిచ్చును. రాజులు భయపడుచుందురు. జను లందఱును సుఖముగా నుందురు. భూమియందు పంటలు బాగుగా పండును. ౬౩

మ. శని వర్షాధిపతిత్వ మొందినను రాజశ్రేణికిన్ గల్గు భూ
జనసందోహముమీఁదఁ గోపము మనస్తాపంబు పాపంబులున్

ఘనరోగంబులుఁ బుట్టు గాలివిసరుఁ వర్షంబు లేకుండుఁ జ
య్యనఁగొల్చుఁ ధరతగ్గునంచునవె రెట్టాఖ్యుండుఁ బ్రఖ్యాతిగన్.

తా. వేంకటరాజా! శని సంవత్సరాధిపతి యైనట్టయితే, ఆసంవత్స రమున రాజులకు తమభూమియందలిమనుజులపయిని కోపము గలుగును. ఎల్లరకును మనస్సులయందు తాపము గలుగును. దోషములు సంభవించును. గొప్పగొప్పరోగములు బయలుదేరును. గాడ్పులు వీచును. వానలు సరిగా కురియవు. ఆకస్మికముగా ధాన్యాదులును ధరలును తగ్గిపోవును—అని ప్రఖ్యాతి గలుగునట్లు రెట్టఁ డన్నాఁడు. ౬౪

చ. అనువుగ నబ్దభర్త మొదలై తగువారు శుభగ్రహంబులై
నను ధరణీతలంబున ననారతముఁ దగు వృష్టి సస్యముల్
పెనుపగు నట్టియబ్దమునఁ బెంపు ఘటిల్లు వినోదమందియుఁ
జనతతికిఁ సుఖస్థితియె సంధిలు వేంకటరాజశేఖరా! ౬౫

తా. వేంకటరాజేంద్రా! సంవత్సరాధిపతి మొదలయినగ్రహములు శుభగ్రహము లయినపక్షమున భూప్రదేశమునందు సర్వదా వానలు గురియును. సస్యములు వృద్ధిపొంది చక్కఁగా ఫలించును. ఆసంవత్సరమున అందఱకును వృద్ధియే కలుగును. జనులు వినోదముల ననుభవించుచు సుఖులయి యుందురు. ౬౫

క. శ్రీకరుఁడు బుధుఁడు రాజగుఁ,
బ్రాకటముగ భూమిసుతుఁడు పరఁగు సచివుఁడై
జోకను వర్షేశుఁడు శశి,
వీఁకను నర్ఘాధిపుఁడయి వెలయును శశియే. ౬౬

తా. వేంకటరాజా! సంపదలను కలిగించుబుధుఁడు రాజయినపుడు ప్రకటముగా భూమికొడుకయిన యంగారకుఁడు మంత్రియగును. శశి యనఁ

గా చంద్రుఁడు వర్షమునకు ప్రభు వగును. ఆచంద్రుఁడే వెలలకుఁగూడ నధిపతి యయి యొప్పును. ౬౬

క. సైన్యాధిపతియు శశి రా,
జన్యులు కలహములచేతఁ జావరు భువిలో
ధాన్యాధిపతి బుధుఁడు సౌ,
జన్యాకర! వినుము రవి రసప్రభుఁ డరయన్. ౬౭

తా. సౌఖ్యమునకు నిధియైన యోవేంకటరాజా! వినుము. సేనానాయకుండు బుధుఁ డగునేని రాజులు యుద్ధములచేతను చావరు. అపుడు ధాన్యములకు ప్రభువు బుధుఁడును, రసములకు ప్రభువు సూర్యుఁడును అయి యుండురు. ౬౭

క. రసవస్త్వధిపతి కవి నీ,
రసవస్త్వధిపతి గురుఁడు నరయఁగా నయినన్
వసుధఁ దమోమేఘంబును,
వసుసన్నిభ! మూఁడుతూమ్లు వానయుఁ గలుగున్. ౬౮

తా. వసువులతోఁగాని, వసుమహారాజుతోఁగాని సమానుఁడవయిన యోవేంకటరాజా! రసవస్తువులకు ప్రభువు శుక్రుఁడును నీరసవస్తువులకు ప్రభువు గురుఁడును అయినపక్షమున భూమియందు చీఁకటివలె నల్లగానుండు మేఘములు వ్యాపించును. మూఁడు కుంచములవాన కురియును. ౬౮

సీ. శ్వేతభూములు చాలఁ జెలువొంద ఫలియించు
శ్వేతధాన్యంబులు చెలఁగుఁ బంట
మఱి మహోత్పాతముల్ వరుసతోఁడుతఁ బుట్టుఁ
గష్టంబు ప్రజలకుఁ గలహములును
వికృతరోగంబులు వింతగాఁ బుట్టును
బ్రాకృతజ్ఞానంబు ప్రాభవముగ

దక్షిణదేశంబు ధర తలక్రిం దౌను
దుర్భిక్ష మొదవును దూర్పునందు
తే. గీ. మరణముల్ రోగబాధలు మఱియుఁ గల్గు,
మధ్యవర్షంబు గాలియు మఱియు హెచ్చుఁ
జీడచేతను బయిరులు చెడును బంట,
దప్ప దని చెప్పె రెట్టఁడు ధన్యు లెన్న. ౬౯

తా. వేంకటరాజా ! మీఁది మూఁడుకందపద్యములయందును చెప్పఁబడిన గొప్పన గ్రహము లుండినపక్షమున, తెల్లనిభూములు సమృద్ధిగా పండును. తెల్లనిధాన్యములు మఱింత బాగుగా పండును. వరుసగా గొప్ప గొప్పయుత్పాతములు కనుపడును. ప్రజలకు కష్టములు కలుగును. కలహములు కలుగును. వికృతములయిన రోగములు, ఆశ్చర్యము గలుగునట్లుగా పుట్టును. ప్రాకృతులజ్ఞానము—అనఁగా తెలివితక్కువ, ప్రభుత్వము చేయును. దక్షిణదేశమునందు ధరలు తలక్రిందు లయిపోవును. తూర్పుదేశములయందు కఱవులు సంభవించును. ఇంతే కాదు. మరణములును, రోగములవలనిబాధలును చాల హెచ్చుగా నుండును. వానలు సామాన్యముగా కురియును. గాలి హెచ్చుగా వీచును. సస్యములకు చీడలు పట్టి పంటలు పాడయిపోవును. ఇవి తప్ప వని ధన్యాత్ములు కొనియాడునట్టులు రెట్టఁడు చెప్పినాఁడు. ౬౯

## —{ నూతనవస్త్రము ధరించుటకుపయోగములైన నక్షత్రముల వివరము. }—

సీ. నరనుత ! వినవయ్య ! నక్షత్రములయందుఁ
గ్రొత్తవస్త్రము గట్టుకొనినఫలము
చెలఁగ నశ్వినిఁ బెక్కుచీరలు గట్టును
భరణియందున ధనహరణ మొదవు

నరయఁ గృత్తికఁ గట్ట నగ్నిభయం బగు
నలరోహిణిని గట్ట నర్థసిద్ధి
యలమృగశీర్షమం దెలుకపోటునఁ బడు
నారుద్రయందును హాని యొదవుఁ
తే. గీ. గడుఁ బునర్వసునను బుద్ధి గలుగు చుండుఁ,
బుష్యమందునఁ గల్గును భోగచయము
సర్పభయ మగు నాశ్లేష సకలులకును,
మఘను ధరియింపఁ బీడలు మాన వెప్డుడు. ౭౦

తా. వేంకటరాజా! ఇంక క్రొత్తవస్త్రములు కట్టుకొనుట కుపయోగించు నక్షత్రములను వివరించెదము వినుము—సంతోషముగ అశ్వినీనక్షత్రమునఁ క్రొత్తవస్త్రము కట్టుకొన్నపక్షమున హెచ్చుగా క్రొత్తక్రొత్తవస్త్రములు కట్టుచుందురు. భరణినక్షత్రమున క్రొత్తవస్త్రము కట్టుకొనుచో ధనము పోవును. ఆలోచింపఁగా కృత్తికానక్షత్రమునఁ గట్టినచో దాని కగ్గి యంటుకొనును. రోహిణీ నక్షత్రమునఁ గట్టుకొన్నచో కార్యసిద్ధి యగును. మృగశీర్షనక్షత్రమునఁ గట్టినచో ఆబట్టలెలుకలు కొట్టివేయును. ఆర్ద్రానక్షత్రమునఁ గట్టితే హాని కలుగును. పునర్వసునఁ గట్టినపక్షమున బుద్ధి కలుగును. పుష్యమి నక్షత్రమున క్రొత్తవస్త్రము ధరించిన పక్షమున భోగములు కలుగును. ఆశ్లేషనక్షత్రమునఁ క్రొత్తబట్ట కట్టితేను పాములవలని భయము గలుగును. మఘానక్షత్రమునందు క్రొత్తవస్త్రములను కట్టిన ట్టయితే పీడలు తప్పవు. ౭౦

సీ. వరుసఁ బుబ్బను రాచబాధలు గావించు
నురుభోగసంపద లుత్తరందు
హస్తయందున ధర్మ మతిశయిల్లఁగఁ జేయుఁ
జిత్తయందున ధనసిద్ధి గలుగు
స్వాతిని భోజనసౌఖ్యంబు గావించు,
జనకునివిందు విశాఖయందుఁ

జుట్టాలపాలుగాఁ జూచు ననూరాధ
జ్యేష్ఠను నెలలోనఁ జీర చినుఁగు
తే. గీ. మూలతారను గట్టంగ మొనయు మృత్యు,
వమరఁ గల్గుఁ బూర్వాషాఢయందు నష్టి
సరవితోడుత నుత్తరాషాఢ జయము,
కన్నులకు నొప్పి శ్రవణానఁ గట్టినేని. ౭౧

తా. పుబ్బనక్షత్రమునఁ గ్రొత్తవస్త్రములు ధరించిన ట్టయితే రాజుల వలని బాధలను గలిగించును. ఉత్తర నక్షత్రమునఁ గట్టినయెడల గొప్పభోగములును, సంపదలును కలుగును. హస్తను గట్టినచో ధర్మము వృద్ధిని పొందునట్లు చేయును. చిత్తనక్షత్రమునాఁడు క్రొత్తబట్ట కట్టుకొనువారికి ధనము సిద్ధించును. స్వాతీనక్షత్రమునఁ గట్టినచో భోజనసౌఖ్యమును గలిగించును. విశాఖానక్షత్రమున కట్టినచో తండ్రివలన విందు గలుగునట్లు చేయును. అనూరాధను కట్టినచో అది చుట్టాలపాలగునట్లు చేయును. జ్యేష్ఠానక్షత్రమునఁ గట్టుకొనుయెడల నెలలోఁగానే అది చినిఁగిపోవును. మూలనక్షత్రమునఁ గట్టువారికి మృతి కలుగును. పూర్వాషాఢయందుఁ గట్టినచో నష్టము గలుగును. ఉత్తరాషాఢానక్షత్రమునాఁడు నూతన వస్త్రధారణము జయమును కలిగించును. శ్రవణనక్షత్రమునందుఁ గట్టుకొన్నచో కంటికి నొప్పి గలుగును. ౭౧

తే. గీ. తక్కునక్షత్రములు శుభదంబు లెన్నఁ,
జీర ధరియించుటకు నని సిద్ధయశుఁడు
రెట్టకవివర్యుఁ డీభువి దిట్టఁ డగుచుఁ,
జాటి చెప్పెను వేంకటక్ష్మాతలేంద్ర! ౭౨

తా. వేంకటరాజా! పైనఁ జెప్పఁబడిన నక్షత్రములు కాక, మిగత నక్షత్రము లన్నియుఁ నాలోచింపఁగా క్రొత్తవస్త్రములను గట్టుకొనుటకు

ంభప్రదము లయినవియ యని సిద్ధులకీర్తివంటి కీర్తిగలవాఁడయిన రెట్టకవీశ్వరుఁడు ధైర్యముగలవాఁడయి చాటి చెప్పినాఁడు. అనఁగా నతఁడు చెప్పినఫలములు తప్ప వనుట. ౭౨

## గ్రంథరచనా సమయము.

సీ. కలియుగప్రథమభాగము నాల్గువేలయె
    న్మిదినూర్లపయిని డెబ్బదియు నొకటి
శాలివాహనశకసమ లిల వేయునా
    ర్నూటతొంబదిరెండు రూఢిగాఁగఁ
బ్రభవాదిగతములు పరఁగ నిర్వదిమూఁడు
    నేండ్లయ్యె నెంతయు నెన్న విబుధు
లట్టికాలంబున నయ్యలు భాస్కర
    కవివర్యు లలరాజకమలహితుని
తే. గీ. యాజ్ఞఁ బూర్వోక్తరెట్టమతాఖ్యకావ్య,
    మును నొనర్చిరి యాచంద్రముగను గీర్తి
    వక్తృశ్రోతలకును గల్గ వసుధమీఁద,
    నల యహోబలనృహరికి నర్పణముగ. ౭౩

తా. కలియుగమునందు మొదటిభాగము నాలుగువేల యెనిమిదివందల డెబ్బదియొక్కసంవత్సరము గాఁగా, అనఁగా, కలియుగము పుట్టిన ౪౮౭౧ సంవత్సరములనాఁడు—శాలివాహనశక సంవత్సరములు పదునాఱువందల తొంబదిరెండు (౧౬౯౨) కాఁగా, అప్పటి ప్రభవమొదలయిన యఱువదిసంవత్సరములలోను ఇరువదిమూఁడుసంవత్సరములు ముగిసినప్పుడు—అనఁగా వికృతిసంవత్సరమునందు పండితులు కొనియాడునట్లు, అయ్యలు—భాస్కరుఁడు—అను కవీశ్వరు లిద్దఱును సూర్యునివలెనే ప్రకాశించుచున్న వేంకటరాజుగారి యనుమతినిపొంది పూర్వమందుఁ జెప్పఁబడిన రెట్టమత మనుపేరికావ్యమును చంద్రుఁడున్నంతవఱకును చెప్పువారికిని, వినువారి

కిని భూమియందు కీర్తి కల్గునట్టుగాను, ప్రసిద్ధుఁడయిన యహోబలనరసింహ స్వామి కర్పణ మగునట్టుగాను రచించినారు. ౭౩

మ కపటారాతివిభంజనోద్ధతమతీ! కర్ణాటసింహాసనా
ధిపతిప్రాప్తరమాధురీణ! కరుణాబ్ధీ! కంతుసౌందర్య! కా
శ్యపసద్గోత్రపవిత్ర! నమ్రతరవాచానైపుణీనిర్జితా
హిప! కామందక కావ్యనాయక! కవీంద్రేష్టార్థసంధాయకా!

తా. కపటముగల శత్రువులను భంజించుటయం దౌద్ధత్యము గలబుద్ధి గలవాఁడా! కర్ణాటకదేశప్రభువుచేతను పొందఁబడిన రాజ్యలక్ష్మియొక్క భారమును వహించినవాఁడా! దయాసముద్రుఁడా! మన్మథునిచక్కఁదనము వంటి చక్కఁదనముగలవాఁడా! కాశ్యపగోత్రమును పవిత్రముగఁ జేసినవాఁడా! మిగుల నమ్రమయిన మాటలనేర్పుచేతను శేషుని జయించినవాఁడా! కామందక మను కావ్యమునకు నాయకుఁడా! కవీశ్వరులయొక్క యిష్టములను చేకూర్చువాఁడా! ౭౪

తోదకము. భానువంశాగ్రణీ! బంధుచింతామణీ!
దీనరక్షామణీ! దేవభక్తాగ్రణీ!
దానవిద్యాభ్యస్కరా! దైవమంత్రాకరా!
సూనృతోక్తిప్రియా! శోభనైకాశ్రయా! ౭౫

తా. సూర్యవంశపురాజులలో శ్రేష్ఠుఁడా! బంధువులకుఁ జింతామణి వంటివాఁడా! దీనులకు రక్షామణివంటివాఁడా! దేవతలయందు భక్తి గలవారిలో మొదటివాఁడా! దానవిద్యయందు సూర్యునివంటివాఁడా! దైవమంత్రముల కాకర మయినవాఁడా! సత్యవాక్యము లిష్టముగాఁ గల వాఁడా! శోభనములకు నేకాశ్రయ మయినవాఁడా! ౭౫



...ష్టము.